# శాకుంతల విమర్శనము

*Being a critical Treatise on*
KALIDASA'S ABHIJNANA SAKUNTALAM

శ్రీ నర్సాపురము కళాశాల యాజమాన్యమున

ప్రకటితము

నండూరి బంగారయ్య

రాజమహేంద్రము

 [వెల 5—0—0

# విషయసూచిక



3, 5, 7, 8, 9 సంఖ్యగల భాగములు వ్యాసరూపమున ‘ భారతి ’ లో ప్రకటితములు

# పీ రి క

ఇది కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలముపయి విమర్శ. సాధారణముగ విమర్శమనగ ఖండనమనియే మనవారి తాత్పర్యము. ఈ గ్రంథము చదువువారికి నాయుద్దేశ మదికాదని స్పష్టముకాగలదు. కవి సృష్టితత్త్వాన్వేషకు డయినట్లే విమర్శకుడు కావ్యతత్త్వాన్వేషకుడు. సత్యప్రదర్శనమే యిరువురి పరమగమ్యమును.

ఈగ్రంథమును నేను ఇప్పటికి పదిసంవత్సరములకు పూర్వమే రచించితిని. అప్పటిలో సియూర జిల్లాజడ్జిగానున్న శ్రీ యమ్ అనంత నారాయణన్, M A, I C S, గారితో ప్రసంగవశమున నేను శాకుంతలమునుగూర్చి ముచ్చటింపగ వారు దానిపయి విమర్శ వ్రాయవలసినదిగ నన్ను మిగుల ప్రోత్సాహపరచిరి. వారీ పట్నమునుండి వెడలిపోయిన తరువాతనే దీనిని నేనురచించినను, ఇది తెలుగులోనుండుటచే వారు దీనిని ఇంతవరకు చదువుట తటస్థింపకపోయినను, ప్రథమ ప్రోత్సాహకులుగ వారు నాకు స్మరణీయులు

దీనిలోని కొన్నివ్యాసములను "భారతీ" ముఖమున ప్రకటించి ఆంధ్రలోకమునకు నివేదించు నవకాశము గల్పించిన భారతీ పత్రికాధిపులు శ్రీ శివలెంక శంభూప్రసాద్ గారు కూడ ఈసందర్భమున నాకు స్మరణీయులు.

దీనిని ప్రకటించి అందుమూలముగ సహృదయుల నారాధించు భాగ్యము లభ్యమగునని ఎన్నడును నేనాశింపలేదు అంత నిస్పృహాచిత్తతతోనున్న నన్ను తమ యవ్యాజవాత్సల్యమునకు బాత్రునిజేసి ఫలాపేక్షయేమియు లేకుండ కేవలము నిష్కామచిత్తతతో నయాచితముగవచ్చి దీని ముద్రావ్యయమునంతను వహించిన నర్సాపురవాస్త

వృలు న్యాయవాదిశేఖరులు అత్యుదారచిత్తులు నయిన శ్రీ ఎర్రమిల్లి నారాయణమూర్తి పంతులుగారి నెంత కొనియాడినను నాకు తనివి తీరదు వారి కోరిక ప్రకారము వారి యభిమానపుత్రికయని చెప్పదగిన శ్రీనర్సాపురము కళాశాల యాజమాన్యమున దీనిని ప్రకటించితిని

ఈసందర్భమున రాజమహేంద్ర కళాశాలలో నాసహోధ్యాయి చిన్నప్పటినుండి నాకు వాఙ్మయవ్యవసాయమున తోడ్పడు నభిజ్ఞుడు మధురస్వభావుడు నయిన శ్రీపెద్దాడ రాజలింగమూర్తిగారును (నర్సాపురన్యాయవాది) నాయెడ నకారణప్రేమనుజూపి దీనినచ్చొత్తించు నుద్యమము కొనసాగువరకు నిద్రపోక పెక్కువిధముల తోడ్పడిన అపారపాండితీ సంపన్నులగు శ్రీ శ్రీపాద లక్ష్మీనరసింహముగారును (నర్సాపుర న్యాయవాదులు) నాకు వందనీయులు.

దీని నచ్చొత్తించుటలో ఒక్కతప్పుకూడ రానీయరాదని సుజన రంజని ముద్రాశాల ప్రొప్రయిటరు శ్రీ పోతాప్రగడ సూర్యనారాయణ గారి ప్రతిజ్ఞ కాని నేను ప్రూఫులుదిద్దుటలో కుశలుడను గాకపోవుటచే నెన్నోతప్పులు దొరలినవి. గ్రంథముద్రణము నెంతో శీఘ్రముగ చేసి యిచ్చుటయేగాక తమ శక్తివంచన లేకుండ నిర్దుష్టముగ జేయుటకు సూర్యనారాయణగారు పాటుపడినారు.

ఇంకను శ్రీ తాడూరి శ్రీరామరాఘవేంద్రరావుగారు (రాజమండ్రి న్యాయవాదులు) శ్రీ చిలకమర్రి నరసింహాచార్యులుగారు (రాజమండ్రి న్యాయవాదులు) శ్రీ సంగేపు వీర్రాజుగారు మున్నగుమిత్రులు దీని ముద్రణ వ్యవసాయమున తోడ్పడిరి

ఈగ్రంథమున నేనుచేసిన సిద్ధాంతములన్నియు ప్రమాణములని వాదింపను. శాకుంతలమున గనవచ్చు సారస్వతరహస్యముల నాధార పరచుకొనియే ఇతరనాటకములు విమర్శనీయములని కూడ నావాదన

కాదు ఒక మహామేధావి త్రోవ ఇంకొక్క మహామేధావి త్రొక్కఁడు
కవులు నిరంకుశులుగదా! కాలిదాసునిఘనత నేను గ్రహించినంతవరకు
లోకమునకు వెల్లడించి ఇంచుకయైన ఆతని గ్రంథపఠనమున నానా
టికి వృద్ధినొందు నానందఋణమును తీర్చుకొనవలెనని నాసంకల్పము.
ఈ సంకల్పమునకు సత్యమిష్టదేవతయగుటచే మూలముతో సరిపోల్చు
పట్లను మరికొన్ని యెడలను నిర్భయముగ సంచరింపవలసిన వాడనయి
తిని అంతమాత్రముచే నాకవినయముగాని ఆమహాకవి కసమర్థతగాని
యారోపించుట కవకాశములేదని మనవి ఇంకు కొన్ని పునరుక్తులను
సందర్భవశమున నావశ్యకములగుటచే నట్లనే యుంచితిని. ప్రాకృతము
నకు ఛాయనే వాడితిని

అత్యల్పమయిన పాండిత్యముతో నింతటి మహోద్యమమునకు
పూనుకొన్న నాసాహసమును సహృదయులు మన్నించి శారదాదేవి
యారాధనమునే ప్రధానముగా నెంచి దీనిలోని తప్పులను నాకు దెలి
పినచో కృతజ్ఞతతో సవరించుకొందును

ఇట్లు,
బుధ విధేయుడు,
నండూరి బంగారయ్య.

రాజమహేంద్రము,
18—6—1952

# శాకుంతల విమర్శనము

## 1. కాళిదాసుని నాటకరచనాపరిణామము

కవితాకళకు శిఖరము నాటకరచనము అపురూపమైన ఎన్నో శక్తులు మేళగించిననే గాని ఇది అసాధ్యము. నిర్మాణనా వైదగ్ధ్యము, పాత్రీకరణకౌశలము, రసపోషణాసామర్థ్యము, సంభాషణకల్పనా చాతుర్యము పద్యరచనాపాటవము మున్నగు దీని వివిధాంగములలో నొక్కొక్క దానిలో కృతహస్తుడు కావలెనన్నను అపురూప ప్రతిభాశాలికి సైతము దీర్ఘ వ్యవసాయ మావశ్యకము.

ప్రతిభకును వ్యవసాయమునకును విరోధమని కొందరి యపోహ. ప్రతిభాశాలికి ఆడినదాట పాడినది పాటగ కళాపాటవము విజృంభింప వలసినదేగాని ప్రయత్నముచేసి సాధింపవలసినది ఏదియు ఉండరాదని వారి తాత్పర్యము ఇది ప్రకృతిపరిశీలనము చాలనిమాట ఏది సహాజ శక్తియని కొందరు భావించుచున్నారో అదికూడ వెనకటిజన్మములలో చేసిన యభ్యాసమునకు ఫలముగ నుదయించిన సంస్కారవిశేష మేయని మహాయోగుల మతము అందుచే నేకళయందైనను ఉత్తమసిద్ధి నార్జించినవాడు వ్యవసాయాత్మికమగు బుద్ధితో సాధనచేయుటవలన సహాజ ప్రతిభకు న్యూనత యారోపితము కానేరదు.

కళోసృష్టలు అఖండ వ్యవసాయాత్ములనుట వారి కావ్యముల నుండియే నిరూపింపవచ్చును. ప్రపంచమునందలి నాటకరచయితలలో ఉత్తమశ్రేణికి జెందిన కాళిదాసు రచించినకృతులకు శాకుంతలము

నాయకమణిగదా! ఇంతటి అఖండ కళావైభవమును అనువాదములో దర్శించినంత మాత్రముననే పాశ్చాత్యవిమర్శక శిరోమణి "గేటీ" ఆనందమును పట్టజాలక నృత్యముచేసినాడనుట కూడ జగత్ప్రసిద్ధము గదా! అట్టి శాకుంతలమును నిర్మించుటకు కాళిదాసుచేసినకృషి అతని యితరనాటకములలో విస్పష్టముగ ప్రతిబింబించు చున్నది ఒక్కొగం తులోబోయి జయలక్ష్మిని పైశాచవివాహమున బలాత్కృతిని జే పట్టక క్రమక్రమముగ నామె హృదయమును అతడు వశము జేసు కొన్నాడనుటకు మాళవికాగ్నిమిత్రమును విక్రమోర్వశీయమును గూడ ప్రబలసాక్ష్యములు ఒకదృష్టితో జూచినచో పైరెండు నాటక ములును శాకుంతలమునకు చిత్తుప్రతులవలె గనవచ్చును మాళవిక కాళిదాసరచితము కాదను వాద మొకప్పుడుండెను గాని ఇప్పుడు దాని నాదరించువారు కనబడరు. కొందరు నాటకరచయితలవలె కాళిదాసు విస్తృతిని ఆశయముగ బెట్టుకొనలేదు. వ్రాసినది ఒక్క నాటకము నను అది యనవద్యసౌందర్యమును సాధింపవలెనని యాతనిమతము కానోపును గీచినగీతనే మరలమరలగీయు చిత్రకారునివలె ఆలపించిన రాగమునే మరలమరల నాలపించు గాయకునివలె ఏకాగ్రచిత్తతతో సమగ్రవిజయము నాశించి యాతడు నాటకరచనావ్యవసాయమును కొనసాగించినాడు మాళవికలో బాల్యావస్థనే సూచించు నాతనిరచనా పాటవము విక్రమమున నిండుయౌవనవతియగు విరహోన్మాదినియై శాకుంతలమున స్వర్గమర్త్యలోకముల నేకముచేసిన తపస్వినీమతల్లియై విజయశోభ ని ప్రమోగించుచున్నది ఏయేశక్తులు శాకుంతలమున పూర్ణ విజృంభణమును గాంచినవో అవియెల్లను బీజప్రాయముగనైనను మాళ వికలో గనవచ్చుచున్నవి అంతకంటె పైమెట్టున విక్రమోర్వశీయ మున ప్రకటము లగుచున్నవి

రచయిత కళాపాటవపరిణామమును గమనించుటకు రెండు ప్రయోజనములు తమకు అభిమానాస్పదుడగు కవియేతీరుగ క్రమాభి

వృద్ధి నొందెనో తెలిసికొనవలెనను కుతూహలము సహృదయ లోక మునకు సహజము. ఈ కుతూహలమును శాంతింపజేసికొనుట మొదటి ప్రయోజనము ఇంతకుమించిన ప్రశస్తప్రయోజనము ఉత్సాహప్రాప్తి మూలమున రచయితలకు లభించుచున్నది శాకుంతలమును పఠించిన గుక్కలో మాళవికను బఠించినపుడు "రెండును ఒక్కకవియే రచించి నాడా" యని ప్రశ్నింప వలసినంతటి వ్యత్యాసమేర్పడుచున్నది. మాళ వికవంటి స్వల్పారంభముతో కాళిదాసు శాకుంతలమువంటి మహోద యమును సాధింపగల్గినచో కృషిచేసి ఎంతటి యుత్తమభూముల నయి నను బ్రాపింపవచ్చుననుట స్థాపితమగుచున్నది ఎట్టి నిస్పృహాచిత్తు డయిన నాటకరచయితకయినను ఇది యాశాజనకము గాదా?

## వినయము, విశ్వాసము

కాళిదాసుకృతులను శ్రద్ధతో బఠించినవారికి పరస్పర విరుద్ధ ములుగ గనవచ్చు పై రెండుగుణములును ఆతనియందు ప్రస్ఫుట మగుచుండును.

కవితాకళ ఎంత అపురూపమైన వరమో ఆతడు పూర్ణముగ గుర్తించినాడు. వాఙ్మయ ప్రపంచమున ఎవరెట్టు పర్వతములనదగిన వ్యాసవాల్మీకులుగదా కాళిదాసునికి పూర్వకవులు అట్టి కవిబ్రహ్మలను తిలకించునపుడు కాళిదాసునికలము వెనుకాడీనదనుటలో నాశ్చర్య మేమున్నది?

శ్లో॥ మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతాం
    ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు'వవామన

ఈశ్లోకము కేవలము గడుసుదనమునకు మాత్రమే నిదర్శనము కానే రదు కవిత్వమునగ నెంత బాధ్యతతో నిర్వహింపవలసిన మహోద్యో గమో కాళిదాసునకు తెలిసినంత గాఢముగ ఇతరులకు తెలియుట కవ

కాశములేదు. కాళిదాసు ఎంతమహాకవియో అంత సునిశిత విమర్శ కుడుగూడను లోతుపాతులకుబోయి తరచినకొలది కావ్యరచనాశిల్పము ఆతని కగాధమయిన మహాసముద్రమువలె పొడకట్టుటలో నాశ్చర్య మేమున్నది?

కాని అంతమాత్రముచే నాతని నాత్మవిశ్వాసహీనునిగ భావింప రాదు ఆత్మవిశ్వాసవిహీనుడు ఈ క్రిందిశ్లోకమును వ్రాయనే లేడు.

శ్లో॥ తం సంత శ్రోతుమర్హంతి సదసద్వ్యక్తి హేతవ
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధశ్శ్యామికాపివా

ఒకటిమాత్రము నిశ్చయము ఈ ఆత్మవిశ్వాసము అహంభావమునుండి అజ్ఞానమునుండి ఉదయించుట లేదు. బాధ్యతను సమగ్రముగ గుర్తించిన వెనుక వినీతములగు సున్నితమానసికభావములనుండి యుదయించు చున్నది

శ్రవ్యప్రబంధ నిర్మాణమునందుకంటె దృశ్యప్రబంధ నిర్మాణ మున నాతని కధికవిశ్వాస ముదయించుట కవకాశమున్నది ఈశాఖలో ఆతనికి పూర్వమున్న భాసాదులుకూడ ప్రతిభాశాలురే కాని శ్రవ్యకావ్య ములలో వ్యాసవాల్మీకులు సాధించిన అద్భుతసిద్ధులను దృశ్యకావ్యము లలో వారు సాధింపలేదనుట నిర్వివాదము అందుచే నాటకరచనమున కాళిదాసునికలము అధికోత్సాహముతో ముందడుగు వేయుచున్నది.

పారిపార్శ్వకః — ప్రథితయశసాం భాసకవిపుత్ర సౌమిల్లకాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం పరిషదో బహుమానః"

సూత్రధారః — అయే వివేకవిశ్రాంతమభిహితమ్ పశ్య —

శ్లో॥ పురాణమిత్యేవ నసాధు సర్వమ్ న చాపి కావ్యమ్ నవమిత్యవద్యమ్
సన్తః పరీక్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః

అట్లని దీనిలో నున్న బాధ్యతనుగూడ నాతడు గుర్తింపకపోలేదు ఇది వరలో మహోన్నతభూములను ప్రాపించినవారు లేరను నానుకూల్య మొకటి యున్నను శ్రవ్యశాఖకంటె దృశ్యశాఖ కష్టతరసాధ్యమనుట ఆతనికి విస్పష్టమే. శాకుంతలమువంటి పక్వరచనములోగూడ

* ఆపరితోషా ద్విదుషాం న సాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్,
బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః

అని తటపటాయించుచున్నాడు సామగ్ర్య మతిశయించినకొలది వినయముగూడ అతిశయించునేమో లోకోత్తరమైన నాటకము వ్రాయబోవుచున్నాడు! దాని ప్రస్తావనలో నింతజంకును ప్రకటించుచున్నాడు!

ఇంకొకటి దృశ్యకావ్య నిర్మాణమును ఎంత పూజ్యభావముతో పరిగణించినాడో అదికూడ ప్రారంభమునుండియు వ్యక్తమగుచున్నది

" దేవానా మిద మామనన్తి మునయః కాన్తం క్రతుమ్ చాక్షుషమ్
(మాళవిక అ1 శ్లో 4

యస్యాగమః కేవల జీవికాయై। తం జ్ఞాన పణ్యం వణిజం వదంతి

ఇంతటి మహోదారభావము లాతనికున్నవి గావుననే ఆతని కవితాకళ అంతటి పుణ్యభూములలో సంచరించి అపురూపసిద్ధులను సాధించినది

— సామాన్యలక్షణములు —

ఈమూడు నాటకములును రసప్రధానములే. కొన్ని నాటకములలో కేవలము కథాకల్పనమునకు మాత్రమె ప్రాముఖ్యముండును. మరికొన్ని నాటకములు పాత్రీకరణప్రధానములు. ఇంకను కొన్ని

---

* ఉ॥ కావున పండితోత్తములు కన్గొని సంతసమందు దాకనా
నావిధ సంప్రయోగ నవనాటక ఖేలన మొప్పునంచు నే
భావన సేయజాలం దగుభంగిం బరిశ్రమ చేసియుం గా స్వవి
ద్యావిషయంబునం దమకుదామయి నమ్మగలేర యెవ్వరున్

భావప్రధానములు. ఏదో యొక అపురూపమయిన భావమును ప్రతిపాదించుటయే వాని పరమలక్ష్యము మరికొన్ని సంగీతమునకు నృత్యమునకు అవకాశమిచ్చుటకు మాత్రమే బయలుదేరును

భావగీతములు వ్రాయుకవిని దీసికొనిపోయి పురాణములు వ్రాయుకవితో పోల్చుట ఎంత అసంగతమో ఒకజాతి నాటకములు వ్రాయు కవిని దీసికొనిపోయి ఇంకొకజాతి నాటకములు వ్రాయుకవితో పోల్చుట కూడ అంత అసంగతమే ఇరువురురచయితలను సరిపోల్చవలెనన్న తత్పూర్వకః వారికి సజాతీయత యేర్పడవలెను ఇరువురును నాటకములు రచించినవారే యన్నంతమాత్రమున చాలదు షేక్స్పియరును కాళిదాసును ఒకజాతి నాటకములు వ్రాసిన వారుగారు. అందుచే నీయిరువురను సమవిమర్శనము చేయబూనుకొనుట అశాస్త్రీయము

కాళిదాసు స్వయముగ కథను కల్పించుకొనవలెనని కాని లేక స్వీకరించినకథ యద్భుతముగ నుండవలెననికాని యాశయమేర్పరచుకొన్న వాడుకాడు మూడు నాటకములలోను వస్తునిర్మాణము బహు సరళము. కాళిదాసు వస్తువు రసధ్వనికి మధుపాత్రమువంటిది. రసధ్వని యను మధువునకు ఆధారముకాదగినంత మాత్రముచేత నదానికిప్రసక్తి అట్లనే పాత్రీకరణముకూడ పాత్రీకరణమున—భారతకథలను దీసికొన్నప్పుడుకూడ—వ్యాసుని పథము నవలంబింపవలెనన్న సంకల్పము కాళిదాసునకున్నట్లు కనబడదు ఈవిద్యలో మనము ఎన్నడును కనివినియెరుగని అపురూపసిద్ధుల నెన్నిటినో మహాభారతకారుడు సాధించినాడు. వ్రాసినది పురాణమేయైనను పాత్రీకరణ విద్యయందు ఎంతటి వాస్తవిక నాటకరచయితయు ఆతని సమీపభూములలో నయిన సంచరించుట లేదు. మానవస్వభావమునందలి అగాధమైన గాంభీర్యమును హిమరేఖను దాటిపోవు దానియౌన్నత్యమును ఆత డనుసంధించినంత గాఢముగ ఏయితర

మహాకవియు అనుసంధించుట గానము అంతటి పాత్రీకరణశక్తులను చవిజూచిన వాడయ్యును పాత్రీకరణమున కాళిదాసాతని పద్ధతి నవలంబింపక ఔచిత్యమునుమాత్రమే పోషించుకొనుచు బోయినాడు కేవలము భరతాచార్యుల శిష్యుడయి విభావాను భావ సంచారీ భావసంయోగమునందే ప్రధానదృష్టిని నిల్పినాడు

ఏయేస్థానమున పద్యముఉంచదగునో కాళిదాసునకు తెలిసినంత చక్కగ ఇతరనాటక రచయితలకు తెలియదనిన అతిశయోక్తి కానేరదు వరుసగ రెండుశ్లోకములుకన్న నెన్నడును రావు రెండు శ్లోకములు వరుసగవచ్చు తరుణములయినను స్వల్పసంఖ్యాకములు రచించిన పద్యమునకు విశిష్టప్రయోజన ముండితీరవలెను. రసము సాధారణ భావములనుండి ఆర్ద్రభావములను ప్రాపించినపుడే ఆతడు పద్యరచనము నడపినాడు. షేక్స్పియరు అంతటి మహానాటక రచయితకుగూడ పద్యరచనమునందలి ఔచితీనిర్వహణము ఇంతగనొప్పినది గాదనిన ఇది ఎంతటి అపురూపగుణమో ఊహించుకొనట సుకరము మూడు నాటకములలోను పద్యరచన ముచితస్థానములో నున్నదనినంత మాత్రమున పద్యరచనములో పరిణామము లేదనికాదు మాళవికలో ప్రారంభదశలోనున్న పద్యరచనము విక్రమోర్వశీయమున రసవత్తరమయి శాకుంతలమున రసవత్తమమయిన దనుట ఈవ్యాసమునందే నిరూపితమగును. మొత్తముమీద మూడు నాటకములలోను ఔచిత్యమునకు పోషకమగు పద్యరచనమున్నదను సంతవరకే ఇటప్రసక్తి

మూడు నాటకములందును నాయకులు ఇదివరకే వివాహితులయినవారు. ఇతరసంపర్క మెరుగని నాయికను ఇతరసంపర్క మెరుగని నాయకునితో గూర్చుటలో నొకప్రత్యేక సౌందర్యమున్నది 'యథోదకం శుద్ధేశుద్ధ మాసిక్తం' మనినట్లు అట్టి సౌందర్యమిట మనకులభ్యముగాదు.

మన సాంప్రదాయానుసారముగ మూడు నాటకములును శుభాంతములే. కాళిదాసునకు ఆధారములని చెప్పకొనదగిన కొన్ని గ్రంథములలో ఊర్వశీ పురూరవులకథ కష్టాంతముగా గనవచ్చుచున్నను కాళిదాసు దానిని శుభాంతముగనే చిత్రించినాడు. కరుణరసముకూడ ఆనందమునే ప్రసాదింపవలసి యున్నప్పుడు నాటకము కష్టాంతముగ నుండరాదని భారతీయాచార్యులు శాసించుటలోని పరమార్థమేమై యుండునో! "నిత్యము జీవితమున కష్టములు ప్రత్యక్షమగుచునే యున్నవి నాటకాంతమునకూడ కష్టములే ఏల ప్రత్యక్షముగావలె" ననియా? కోమలహృదయులగు ప్రేక్షకులు కష్టభారముతో ప్రదర్శనశాలనుండి ఇంటికి పోరాదనియా? సత్యము, ధర్మము జయించితీరునను సిద్ధాంతము సామాజికులకు దృఢపడవలెననియా? చెప్పజాలము. "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే ఆనన్దేనజాతాని జీవంతి ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తి" అని అనుభవపూర్వకముగ ఘోషింపగలిగిన మహర్షుల దివ్యదృష్టిలో నశుభమునకు వాస్తవికత లేనేలేదేమో! "సర్వమంగళ మాంగల్యే! శివే!" యని ప్రకృతిని సయితము సంబోధింపగలిగిన మహాకవులకు అమంగళము మిథ్యకాక మరేమగును?

## మాళవికాగ్నిమిత్రము

### కథ

నాటకములలో ప్రథమరచనమగు 'మాళవిక' చరిత్రకథ. కాళిదాసునకు ఇంచుమించుగ నొక శతాబ్దమునకు పూర్వమున్న అగ్నిమిత్రుడు దీనికి నాయకుడు. కళాపాటవముననిది తక్కిన రెండునాటకములకు దీసిపోవుచున్నను దీని కథాకల్పనము మాత్రము తక్కిన రెండింటిలోకంటెను చమత్కారముగ నున్నది. ఇందు విదూషకుడు పన్నినయుక్తులుకథకు వింతచమత్కృతిని గల్పించుచున్నవి. ధారిణీదేవి చిత్రశాలలోని ఫలకమునుజూడగనే రాజును మాళవికపయి నను

రాగముదయించినది. ఆమెను జూడవలెనని కుతూహల పడుచున్నాడు. అతనికిదివరకే ఇద్దరు భార్యలున్నారు ఒక భార్యయొద్ద మాళవిక యున్నది మాళవికను చూడబోయినచో ఆభార్య శంకించును. అందుచే నేదయిన వ్యాజముపన్ని యామెను చూడవలెను ఈసంకల్పము తన వేడుకచెలికానికి విశదీకరించినాడు హరదత్తుడు, గణదాసుడు నని యిరువురు నాట్యాచార్యులు వారిరువురికి విదూషకుడు స్పర్ధగల్పించినాడు వారిరువురును తమలో నెవ్వరధికులు అనువివాదమును తేల్చుకొనుటకయి రాజునొద్దకు వచ్చినారు శిష్యుల చాకచక్యమును పరిశీలించి గురువుల పాశస్త్యమును నిర్ణయింతునని రాజు వాకుచ్చినాడు. ఈతీరుగ నాయిరువురిలో నొకరియొద్ద 'చలిత' మను నాట్యమునభ్యసించు మాళవికను సందర్శించుటకు నాయకునికి అవకాశము చిక్కినది. ఈ సన్నివేశకల్పనమంతయు మిక్కిలి చక్కగనున్నది. తరువాతికథలో రాజు భార్యయయిన ధారిణీదేవికి మాళవికపయి ననుమానము నసూయకలిగి ఆమె మాళవికను చెరయందుంచినది ఎట్లయిన ఆమె యంగుళీయకమును సంగ్రహించి కారాగృహపాలకునికి చూపి మాళవిక చెర బాపవలె. అంగుళీయక సంగ్రహణమునకు విదూషకుడు పన్నినయుక్తులు గూడ కథకు పుష్టిని దెచ్చుచున్నవి. ఈతీరుగ కథాకల్పనము చరితార్థమగుచున్నది. నాటక రచయితలకు మున్ముందు కథాకల్పనముమీద దృష్టి ప్రసరించుటయు పోనుపోను రసపోషణముమీది కది విజృంభించుటయు సహజమేకదా!

కథాకల్పనము చమత్కారముగ గనవచ్చుచున్నను కథాసంవిధానమున మాత్రము కొన్ని యప్రౌఢఘట్టములు గనవచ్చుచున్నవి. ముఖ్యముగ కొన్నిస్వగతములు అనావశ్యకములని చెప్పకతప్పదు. ప్రథమాంకమున

"చేటీ :— ఆజ్ఞప్తాస్మి దేవ్యాధారిణ్యా అచిరప్రవృత్తోపదేశం చలితం నామ నాట్యమంతరేణ కీదృశీ మాళవికేతి నాట్యాచార్య మార్యగణదాసం ప్రష్టుం"

అను స్వగతముతో చేటికను ప్రవేశపెట్టుచున్నాడు ఈ స్వగత ప్రయోజనము తరువాతి కౌముదికతోడి సంభాషణము నెరవేర్చుచున్నపుడు ఈ స్వగత మనావశ్యముగాదా? తృతీయాంకమున మున్ముందు మాళవికను ప్రవేశపెట్టి స్వగతము మూలమున నామెకు రాజుపయి గాఢానురాగమున్నట్లు చెప్పించినాడు తరువాత చెలికత్తెను ప్రవేశపెట్టి వారియిరువురి సంభాషణము మూలమునను అదే ప్రయోజనమును నెరవేర్చుకొన్నాడు అట్టిచో స్వగతమును పరిహరించిన బాగుండును గాదా? శాకుంతలములో నట్లుగాక తృతీయాంకమున శకుంతలకు చెలికత్తెలకు నడచిన సంభాషణమూలమున ఆమె రాజర్షియగు దుష్యంతుని వరించినట్లు ప్రౌఢముగ వ్యక్తీకరించినాడు. అనావశ్యకములగు స్వగతముల మూలమున మాళవికలోని కథానిర్వాహణమునకు జిగి సడలినది

అయినను కథానిర్వాహణమున గూడ ఇది కాళిదాసుని హస్తమే యని నిరూపించుటకు దగిన గడుసుపోకడలు కొన్ని మాళవికలోగూడ నున్నవిగాని లేకపోలేదు. నాటకకవి కుండదగిన ముఖ్యలక్షణము సన్నివేశములను సహజములుగను సంభవములుగను చిత్రించుట

మాళవికపట్ల రాజునకు ప్రప్రథమమున కుతూహల ముదయించిన ఘట్టమునుగూర్చి వకుళావళిక కౌముదిక అను నంతఃపుర పరిచారికలు ముచ్చటించుకొనుచున్నారు. రాజు ధారిణీదేవి యంతఃపురమునకు వచ్చినాడని-అచ్చటనున్న మాళవిక చిత్రపటము చూచినాడని-వెంటనే 'ఈమెయెవ్వ'రని ఆతడు రాణిని ప్రశ్నించినాడని-ఆమె సమాధానము చెప్పలేదని-ఇంతలో పసిపిల్లయయిన వసులక్ష్మి "ఈపటము మాళవిక"ది అని చెప్పివేసినదని. ఇచ్చట మరియొక కవియైనచో తరువాతి వృత్తాంతము చెప్పుకొనుచు పోయియుండును. కాళిదాసుమాత్ర మట్లుచేయక "కౌముదికా:-(సస్మితమ్) సదృశమ్ ఖలు బాలభావస్య" అని కౌముది

కచేపలికించినాడు. ఇది ఘటనాశిల్పమునకు నిదర్శనమగు గడుసుపోకడ. "వసులక్ష్మీమాత్ర మెందులకు జెప్పవలసివచ్చినది? సన్నివేశ మసంభవముగ లేదా!" యను ప్రశ్నలు చదువరి హృదయములో నుదయింప కుండగనే "సదృశంఖులు బాలభావస్య" అని వానికి కౌముదికచే సమాధానము జెప్పించి కాళిదాసు సన్నివేశమును సమర్థించుకొనుచున్నాడు.

ఇట్లే విదూషకుడు మాళవికకు బంధవిముక్తి ఘటించిన ఘట్టమునగూడ

"రా — నఖలు ముద్రామధికృత్య బ్రవీమి. తయోర్బద్ధయోః కిన్నిమిత్తో౽యం మోక్షః కింవా దేవ్యాపరిజన మతిక్రమ్య భవా న్సందిష్ట ఇత్యేవ మనయా ప్రష్టవ్యం."

అను ప్రశ్నలు రాజునోట నుంచుటలో నెంత గడుసుదనమున్నది! నిజమునకు ఈ ప్రశ్నములన్నియు కథాకల్పనమున బరీక్షించు విమర్శకుని నోట నుండదగినవి. భార్య చెరసాలలోనుంచిన మాళవికను విదూషకుడు విడిపించినాడు. సన్నివేశము స్థూలదృష్టికి అసంభవముగ నున్నది. దానిలోనున్న అసంభవాంశములను పాత్రముల సంభాషణమునచే వ్యక్తీకరించి మరలవానికి పాత్రములనోటనే (విదూషకునినోట) ప్రత్యుత్తరమిప్పించి సన్నివేశమును సంఘటించుకొనుటయే ఇందున్న కళావైదగ్ధ్యము. ఇట్టి ఘటనాశిల్పము కాళిదాసుకు వెన్నతో బెట్టిన విద్య. ఇది శాకుంతలమున ప్రకాశించునంత ప్రౌఢముగ మాళవికలో లేకున్నను స్ఫులింగములు మాళవికలోగూడ నున్నవి.

## పాత్రీకరణము

మాళవికలో నొక్క విదూషక పాత్రముతప్ప తక్కినపాత్రము లెవ్వియు ఆకర్షకముగలేవు కాళిదాసు మూడునాటకములలో ముగ్గురు విదూషకులున్నారు. సంస్కృతనాటకములలో విదూషకుడు లేని నాటకమే యుండదేమో! ఈ విదూషకులు తరచు "నమూనా" పాత్రలు.

ఒక విదూషకుని జెప్పి ఇంకొక్క విదూషకుని జెప్పనక్కరలేదు కాళిదాసుని విదూషకులు గూడ ఇంచుమించుగ "నమూనా" పాత్రములే ఒక్క మాళవికలోని విదూషకుడు మాత్రము ధీనైశిత్యము తోను చైతన్యపుష్టితోను అలరారుచున్నాడు రాజుకుగాని మాళవికకుగాని పేర్కొనదగిన విశిష్టలక్షణము లెవ్వియును లేవు జీవనాడి మిక్కిలి నీరసముగ ధ్వనించుచున్నది

ఇందలి యితివృత్తము ఉదాత్తమనిగాని ఉన్నతమని కాని చెప్పుటకు వలనుపడదు బహువల్లభా ప్రియులగు రాజులను సంతోషపెట్టుటకు దగిన అంతఃపుర శృంగారోదంతము

శ్లో॥ ప్రతిపక్షేణాపి పతిం సేవన్తే భర్తృవత్సలాః సాధ్వ్యః
అన్యసరితాం శతానిహి సముద్రగాః ప్రాప్నువన్త్యబ్ధిమ్ అం 5 శ్లో 19

బుధాహ్లాదమును సంపాదింపజాలిన గౌరవము వస్తువునకున్నట్లు తోపదు.

## పద్యరచనము

కాళిదాసు పద్యరచనమునకు గంభీరమైనభావము అలంకారపుష్టి అక్షరరమ్యత ప్రత్యేకలక్షణములు కాని ఆలక్షణములు మాళవికలో లుప్తమైనవి. తరచు ఇది కాళిదాసుపద్యరచన మేనా అని శకింపవలసివచ్చుచుండును.

శ్లో॥ అనిమిత్తమిన్దువదనే కిమత్రభవతః పరాఙ్ముఖీ భవసి
ప్రభవన్త్యోపి భర్తృషు కారణకోపాః కుటుంబిన్యః అం 1 శ్లో 8

శ్లో॥ వివాదేదర్శయిష్యన్తమ్ క్రియాసంక్రాంతిమాత్మనః
యది మాం నానుజానాసి పరిత్యక్తోస్మ్యహం త్వయా అం 1 శ్లో 19

ప్రథమాంకములో కంటె పోనుపోను పద్యమునకు కొంత పురి హెచ్చినది తరువాతి పద్యరచనమును దలపించు పద్యములుకూడ అక్కడక్కడ లేకపోలేదు

అనతిలమ్బిదుకూలనివాసినీ
బహుభిరాభరణైః ప్రతిభాతి మే
ఉడుగణైరుదయోన్ముఖచంద్రికా
గతహిమైరివ చైత్రవిభావరీ అం 5 శ్లో 7

## ఔచితి

ఔచితికి కాళిదాసు అందె వేసినచేయి ఉదాత్తతను విస్మరించి యాతడు వ్రాయడు ముఖ్యముగ నాటకరచనములో ననౌచిత్యమున కాస్పదములగు తావులు లేవనియే చెప్పవచ్చును కాని మాళవికలో మాత్రము ఒకటి రెండు చోట్లు ననుచితవాక్యములు దొరలినవి.

నాలుగవయంకమున

ఇరావతీ —అపినిర్వృత్తస్సమనోరథో దివాసంకేతో మిథునస్య?

అని యిరావతిచే రాజును ప్రశ్నింపజేయుటయు, పంచమాంకమున వసుమిత్రుని యజ్ఞాశ్వ సంరక్షణమును వర్ణింపుచున్నట్టమున

విదూషకః —భవతి! పరితుష్టాస్మి పితరమనుసరతో వత్సస్యేతి.

అను విదూషకవాక్యముతో సరిపెట్టక అలంకారచాపలము నాపుకొనలేక "ననుకలభేన యూథపతి రనుకృతః" అని ఆత్మప్రశంసా సూచకముగ నగ్నిమిత్రునిచే ననిపించుటయు నౌచిత్యమునకు పోషకముగ లేవు.

ఈవిధముగ పాత్రీకరణమున, పద్యరచనమున ఔచిత్యనిర్వహణమున లేతదనమునే ప్రకటించు మాళవికలో కళాగాంభీర్యమునకు తోడ్పడు ప్రక్రియలుకూడ కొన్ని కనవచ్చుచున్నవి అందు మొదటిది నిర్వహణసంధిలో నద్భుత రససంచారము మాళవిక చరిత్రమునందలి రహస్యమును చివరవరకు దాచిపెట్టుటవలన నిది సిద్ధించినది. అట్లే రెండవ రంగమున మాళవికనాట్యమునే ప్రదర్శింపజేసి తక్కిన నాట్యమును ఏదోమిషమీద తోసివేయుటలో కవికిగల ప్రదర్శనజ్ఞత ప్రత్యక్షముగు

చున్నది మరియొక ఛాందసుడయినచో రెండునాట్యములను రంగము మీదికి దెచ్చిపెట్టి ప్రేక్షకులప్రాణము విసిగించియుండును కథాగమ నమునుకూడ అరికట్టుకొని యుండును. నాట్యవ్యాజమున మాళవిక రాజునెడ తనహృగయానురాగము ప్రకటించుటకూడ ఎంతయు విదగ్ధ ముగ నున్నది.

శాకుంతలము నందలి అకర్వ కలక్షణములలో ముఖ్యమైనది ఉదం తమునకు అనుగుణమైన ఆశ్రయ (Back ground) కల్పనము. శకుం తలా దుష్యంతుల ప్రథమసమావేశము నకు కణ్వాశ్రమ వర్ణనము, వృక్ష సేచనము, భ్రమరవృత్తాంతము ఇత్యాదులు ఎంతసొంపును సంపాదించు చున్నవి! ఇట్లే శకుంతలానిష్క్రమణమునకు ఋషిపత్నుల యాశీర్వ చనము, పరభృతరుతము, మృగపోతకానుసరణము ఇత్యాదులు ఎంత మాధుర్యము నాపాదించుచున్నవి! రమణీయమయిన ఉదంతమునకు రమణీయమైన పరిసరములు కల్పించుట ఒక కళాప్రక్రియ ఈప్రక్రియ శాకుంతలమున మిక్కిలిప్రౌఢముగ ప్రత్యక్షమగుచున్నది దీనికి పునాది మాళవికలోకూడ నున్నది పంచమాంకమున పుష్పితమగు తపనీయాశోకతరుసమీపమున దేవిని, దేవిపరిజనమును, వివాహమంగ ళాలంకృతయగు మాళవికను, తదుపరి రాజును రాజుపరిజనమును ప్రవేశ పెట్టి నాటకమును అక్కడనే పరిసమాప్తి నొందించుటలో ఉదంత రామణీయకతకు ఎంత ఉచితమైన ఆశ్రయమును గల్పించుచున్నాడు! చదువరులకే ఆ దృశ్యము కన్నులకు గట్టినట్లగుపడునే! ఇక ప్రేక్షకుల మాట వేరుగ జెప్పవలెనా?

నాట్యమును కథాకల్పనమున కాధారముగా నొనర్చుకొనుటయు తన్మూలమున తన కభిమానాస్పదమగు నాట్యకళను కవి పొగడుకొను టయు మరియొక విశేషము.

దేవానా మిదమామనన్తి మునయః శాన్తమ్ క్రతుమ్ చాక్షుషమ్

ఇత్యాదులు

"సంప్రతి శిథిలసమాధిం మన్యే యేనేయమాలిఖితా" అం 2 ప 2

అనువాక్యమున లలితకళావిమర్శనమున నొక యద్భుతరహస్యమును కాళిదాసు ప్రకటించుచున్నాడు లలితకళాసృష్టికి సమాధి ప్రధానమని ఆతని మతము మన స్తత్త్వమును ఆతడెంతచక్కగ పరిశీలించినదియు ఇందువలన సువ్యక్తమగుచున్నది

పునరుక్తియని శంకింపక అభిమానాస్పద భావములను పదేపదే కీర్తించుట కాళిదాసుని సంప్రదాయము

ఉపదేశం విదుః శుద్ధమ్ సన్తస్తముపదేశినః,
శ్యామాయతే న యుష్మాసు యః కాంచనమివాగ్నిషు

అను మాళవికలోని శ్లోకమునకును

తం సన్తః శ్రోతుమర్హన్తి సదసద్వ్యక్తిహేతవః,
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా

అను రఘువంశములోని శ్లోకమునకు ఎంత సన్నిహితబాంధవ్యమో! ఇట్టి పునరుక్తులవలననే కాళిదాసుని యభ్యాసయోగము నిరూపితమగుచున్నది.

## విక్రమోర్వశీయము

విక్రమోర్వశీయము ఒకచేయి మాళవికతోను ఇంకొకచేయి శాకుంతలముతోను కలుపుకొనుచు కాళిదాసుని కళాకౌశలమునకు నడిమిసోపానముగ నలరారుచున్నది.

## పద్యరచనము

ఇది మనోహరమయిన భావగీతము (lyric) వలె నొప్పుచున్నది. కావున ఇందు ముఖ్యముగ పరిశీలింపదగినది పద్యరచనము.

మాళవికలోని పద్యరచనము నీరసస్థితిలో నున్నదనిగదా యను కొంటిమి? ఇందలి పద్యరచనము సర్వథా దానికంటె శ్లాఘ్యతరమే. దానిని నాలుగుతరగతులుగ విభజించుకొనవచ్చును అందు మొదటి తరగతి మాళవికలోని పద్యరచనకు సన్నిహితమయి దానికంటె కొంచెము పురిమెక్కువగ నున్నను ఇంకను నీరసముగనే ఉన్న పద్యరచన.

ముంచతి న తావదస్యాః కంపమ్ కుసుమసమబంధనం హృదయమ్,
పశ్య హారిచందనేన స్తనమధ్యోచ్ఛ్వాసినా కథితమ్ అం 1 శ్లో 6

ఇంకొకతరగతి పద్యరచన శాకుంతలములో నున్నంత పక్వముగ లేక పోయినను కాళిదాసుగౌరవమును కాపాడుటకుదగిన మధ్యతరగతి లోనిది

శ్లో॥ యానత్పునరియం సుభ్రూరుత్సుకాభిః సముత్సుకా,
సఖీభిర్యాతి సంపర్కం లతాభి శ్రీరివార్తవీ అం 1 శ్లో 12

పూర్ణముగ శాకుంతలమునే దలపింపజాలిన పద్యములుకూడ ఎన్నో ఇందుగలవు. 'ఉపమా కాళిదాసస్య' అని ఏనాడు వచ్చినదోగాని నిజముగ నుపమానముచే నాతడు సాధించు సౌందర్యము నిరుపమానము.

ఏషా మనో మే ప్రసభం శరీరా త్పితుః పదమ్ మధ్యమముత్పతన్తీ,
సురాంగనా కర్షతి ఖండితాగ్రాత్ సూత్రం మృణాళాదివ రాజహంసీ.
అం 1 శ్లో 28

ఈపద్యమునకు ప్రాణము ఉపమానమేయని చెప్పవలసియున్నది. ఉపమానమును దీసివైచినచో తక్కినభాగము వస్తుకథనమువలె పొడి పొడిగనున్నది. ఉపమాన భాగముచేత రాజు మనోవేదన పూర్ణముగ వ్యక్తమగుటయేగాక పద్యమునకంతకును అపూర్వమయిన సౌందర్యము చైతన్యము చేకూరినవి.

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥

అను రఘువంశశ్లోకములోఁగూడ నింతే ఉపమానమును దీసివైచినచో పద్యమునకు శిరస్సు ఛేదించినట్లగును. అధోలోకమున బడిపోవు తక్కిన భాగమును ఉపమానము ఒక్కసారిగా నాకసమున కెత్తుచున్నది. ఉపమానమువలన పద్యమున కుజ్జ్వలకాంతి చేకూరుటయేగాదు వాచ్యముగ వర్ణించి చెప్పనక్కరలేకుండగ నెన్నో భావములు ధ్వనితమగుచుండును మితభాషావిరచనమునకును సౌందర్య ప్రతిపాదనమునకును అది ఎంత తోడ్పడునో ఈక్రింది రఘువంశశ్లోకమువలన స్పష్టముకాగలదు.

శ్లో॥ తాం సైవ వేత్రగ్రహణే నియుక్తా । రాజాంతరం రాజసుతా నినాయ
సమీరణోత్థేవ తరంగరేఖా । పద్మాంతరం మానసరాజహంసీం రఘు స 6 శ్లో 26.

ఇచ్చట తరంగరేఖ చెలికత్తె మానసరాజహంసి ఇందుమతి పద్మాంతరము స్వయంవరార్థ మరుగుదెంచిన రాజపుత్రుఁడు సమీరణము అంతకు పూర్వము వర్ణించిచెప్పిన రాజునఁగూర్చి ఇందుమతిచేసిన ప్రత్యాదేశము ఈ పూర్ణోపమలోని ప్రత్యంగమునకు సౌందర్యము నాపాదించుకొనుచు సన్నపుదంతపు పనితనముతో కాళిదాసీ శ్లోకమును నిర్మించినాడు ఇట్టి రచనములే ప్రాయికముగ కాళిదాసుని పద్యరచనావైశిష్ట్యమును నిరూపింపజాలినవి ఇట్టిపద్యములు విక్రమోర్వశీయమున సుపుష్కలముగ నున్నవి

ఇక నాలుగవతరగతి ఇందు అలంకారపుష్టికంటె భావౌన్నత్యమే ప్రధానముగ నుండును కవి వ్యక్తముచేసిన తరువాత నాభావము అత్యంత సులభముగను సుగ్రాహ్యముగను గనవచ్చుచుండును గాని ఆలోచించినకొలది అట్టిభావము లాకవి కెట్లుదయించినవాయని యాశ్చర్యపడక మానము అట్టి భావములలో నేదో విచిత్రమైన కల్పన యుండునని కాదు. ఈగుణము కేవలము మేధాసంపత్తికి సంబంధించినది కానేకాదు. పిశిష్టమయిన ఆత్మీయతను (personality) పురస్కరించుకొని ఇట్టి మహోన్నతభావము లుదయించును. ఉదా

హృతినిద్బిగాని ఈవిషయము తేటపరచుటకు వీలుపడదు

శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురేత్వభిజానామి నిత్యం పాదాభివందనాత్.

అను వాల్మీకిశ్లోకమును గైకొందము ఇందు ఉపమాద్యలంకారము లెవ్వియు లేవు ఉన్నవి మూడు సరళమైనవాక్యములు మాత్రమే సుగ్రీవుడిచ్చిన సీతాదేవి యాభరణములను పరీక్షించునపుడు రామచంద్రమూర్తితో లక్ష్మణుడీ వాక్యములను పలికినాడు ఈపద్యము మిక్కిలి సరళమగుటచే దాని గొప్పదనమును మున్ముందే గ్రహింపజాలము కాని తరచినకొలది లక్ష్మణుని ఘనతను చిత్రించుటకు ఇట్టి మహోన్నత ప్రక్రియ వాల్మీకి కెట్లు తట్టినదాయనిపించును. అట్టి పద్యమును నిర్మించుటకు మహాకవులయినవారుకూడ ఎన్నోజన్మము లెత్తవలసియుండును. ఎంతో గంభీరమైన జీవితము నడపువారికిగాని ఇట్టి భావసంపద లభింపదు. కవితాప్రపంచమున మానవులకందని దేవభూములివి. ఈ భూములలో స్వేచ్ఛావిహారము సలుపనేర్చినవాడు వాల్మీకి. ఆతని రామాయణమున నిట్టిశ్లోకము లసంఖ్యాకములుగ గనవచ్చును ఈతరగతిని సమీపింపజాలిన శ్లోకములు విక్రమోర్వశీయమున సకృత్తుగ గనవచ్చుచున్నవి.

శ్లో॥ ఆభరణస్యాభరణమ్ ప్రసాధనవిధేః ప్రసాధనవిశేషః
ఉపమానస్యాపి సఖే! ప్రత్యుపమానం వపుస్తస్యాః అం 2 శ్లో 3

శ్లో॥ దేవ్యా దత్త ఇతి యది వ్యాపారం వ్రజసి మే శరీరేఽస్మిన్
ప్రథమం కిస్యానుమలే చోరితమేతత్త్వయా హృదయమ్. అం 3 శ్లో 17.

శ్లో॥ అనధిగతమనోరథస్య పూర్వమ్ శతగుణితేవ గతా మమ త్రియామా
యదితు తవ సమాగమే తథైవ ప్రసరతి సుభ్రు తతః కృతీ భవేయమ్

## వస్తువు

పద్యరచనమునందు మాత్రమేకాక వస్తుప్రస్తారము నందుకూడ ఇది మాళవికకును శాకుంతలమునకును మధ్య నిలచియున్నది.

అటు మాళవికతోడి పోలికలకు: మాళవికలో ఇరావతికి పాదాక్రాంతుడయి ఆమెకు అగ్నిమిత్రుడు క్షమాపణ చెప్పికొన్నట్లే ఊర్వశీయములో పురూరవుడుకూడ కాశీరాజపుత్రికి పాదాక్రాంతుడయి క్షమాపణ చెప్పుకొనుచున్నాడు. మాళవికలో ధారిణీదేవియు ఇరావతియు మాళవికా వివాహమున కంగీకరించినట్లే ఊర్వశీయమున కాశీరాజపుత్రి ఊర్వశీ సంగమమున కంగీకరించుచున్నది మాళవికలో విదూషకుడు నిద్రలో కలవరించి రహస్యమును భంగపరచినట్లే ఊర్వశీయమున విదూషకుడు జాగ్రదవస్థలోనే కలవరించి రహస్యమును భంగమొనర్చుచున్నాడు. ఇటు శాకుంతలముతో పోలికలకు శాకుంతలములోని మొదటి యంకమునకును ఊర్వశీయమున మొదటి అంకమునకును అక్కచెల్లెండ్రవరుసగదా! చెలికత్తెలతోనున్న శకుంతలను దుష్యంతుడు సందర్శించిన సన్నివేశమును చెలికత్తెలతోనున్న ఊర్వశిని పురూరవుడు సందర్శించిన సన్నివేశమును ఎంతచక్కగ సరిపోలుచున్నవి! సవ్యాజముగా రాజును వీక్షించుచు ఊర్వశినిష్క్రమణమును సవ్యాజముగా రాజునువీక్షించుచు శకుంతలా నిష్క్రమణమును ఎంత సామరస్యమును ప్రకటించుచున్నవి! శకుంతలకు ఊర్వశికి హృదయవ్యక్తీకరణమునకు ప్రణయలేఖ సమానసాధనము ఇటు శకుంతలకు దుర్వాసుని శాపము, అటు ఊర్వశికి భరతునిశాపము. రెండును ప్రియునిగూర్చి తదేకధ్యానమువలన నుదయించిన ప్రమాదమును పురస్కరించుకొని తటస్థించినవే. పురూరవ దుష్యంతులిరువురకును ఇంద్రసఖ్యము దేవసాహాయ్యాచరణము సమాన ధర్మములే. నాయకులు అనపత్యతకయి వేదనబడుట తుదకు పుత్రసమాగమము తోడను, పుత్రాభిషేకము తోడను నాటకము సమాప్తినొందుట రెండు కావ్యములకును సమాన లక్షణములే

ఇంతేకాదు. కొన్ని వాక్యములును, పద్యములును యథామాత్రకముగ ఊర్వశీయమునుండి శాకుంతలమున నుద్ధృతములైనవి.

విక్ర-అప్సరసః-సదృశమేతత్పురువంశసంభవస్య (అం 1)
శాకుం-వైఖానసః-సదృశమేతత్పురువంశప్రదీపస్య భవతః (అం 1)
విక్ర-చిత్రలేఖా-మహారాజ పరవశోఽయంజనః (అం 2)
శా-ప్రియంవదా-ఆర్య ధర్మచరణేఽపి పరవశోఽయంజనః (అం 1)

రథవేగ వర్ణనము –

విక్రమో - అగ్రే యాన్తి రథస్య రేణుపదవీం చూర్ణీభవన్తో ఘనా
శ్చక్రభ్రాన్తిరరాన్తరేషు జనయత్యన్యామివారావలిమ్
చిత్రన్యస్తమివాచలం హయశిరస్యాయామవచ్చామరమ్
యష్ట్యగ్రే చ సమం స్థితో ధ్వజపటః ప్రాంతే చ వేగానిలాత్ అం 1 శ్లో 5

శా - అయమరవివరేభ్యశ్చాతకైర్నిష్పతద్భి
ర్హరిభిరచిరభాసాం తేజసా చానులిప్తైః
గతముపరి ఘనానాం వారిగర్భోదరాణాం
పిశునయతి రథస్తే శీకరక్లిన్ననేమిః అం 7 శ్లో 7

ఇట్లే పురూరవదుష్యంతుల వినయ భాషణములును

విక్ర-రాజా-నను వజ్రిణ ఏవ వీర్యమేతత్ ద్విజయన్తే ద్విషతో యదస్య పక్ష్యాః
వసుధాధరకందరాద్విసర్పీ ప్రతిశబ్దోఽపి హరేర్భినత్తి నాగాన్

శా-రాజా-అత్రఖలు శతక్రతోరేవ మహిమా స్తుత్యః-

శ్లో|| సిధ్యన్తి కర్మసు మహత్స్వపి యన్నియోజ్యాః
సంభావనా గుణమవేహి తమీశ్వరాణాం
కిం వాఽభవిష్యదరుణస్తమసాం విభేత్తా
తం చేత్సహస్రకిరణో ధురి నాకరిష్యత్

సన్నివేశము లొండొంటిని సరిపోలునవియైనను ఘటనాశిల్పము నందును చిత్రణావైశారద్యమునందును రెండింటికిని ఎంతో తారతమ్యమున్నది.

మున్ముందు విశదీకృతమగునట్లు శాకుంతలమున వస్తువు మిక్కిలి జిగి గలిగియున్నది సన్నివేశములను సంఘటించుటలో ప్రత్యంగమును యథోచితస్థానము నాక్రమించుకొనుచు ప్రధానాంగమునకు అపరిహార్య మగుచున్నది. విక్రమోర్వశీయమున నట్లుగాక వస్తు

వైకల్యము గనవచ్చుచున్నది దీని నించుక దీర్ఘముగ వివరించుట యావశ్యము

నాటకమును శ్రద్ధగ బరికించినచో నాలుగవయంకము నిమిత్తమే నాటకమును రచించినాడాయని నట్లున్నది ఈ నాలుగవయంకము నిమిత్తము మొదటి మూడంకములను కొరడా పుచ్చుకొని తోలుకొనివచ్చినట్లుగ నున్నది అనగా వస్తునిర్వాహణమున వానిలో నొక విధమగు ప్రాధానికమని చెప్పదగిన యాత్రతయు తీవ్రగమనము గనవచ్చుచున్నవి

అంతేకాదు ఒకదృష్టితో జూచినచో ఇందలి చతుర్థాంకమునకు బంచమాంకమునకు బ్రసక్తిలేదు ఇంకొక దృష్టితో జూచినచో ద్వితీయాంకము, తృతీయాంకము నవావశ్యకములు. నాలుగైదంకములు బీజమునుబట్టి యాకాంక్షితములు గావు. రెండుమూడంకములు నిర్వాహణముతో బొసగి నిలుచుటలేదు.

మొదటిదృష్టిలో- ప్రథమాంకమున బీజప్రాయముగ నున్నది: ఊర్వశీపురూరవుల స్నిగ్ధవీక్షణము నిర్వాహణమున ఇది వారిసంభోగముగ పరిణమింపవలసి యున్నది. అంతవరకే ఆకాంక్షితవస్తువు. ఊర్వశికున్న అంతరాయము ఇంద్రుడు. విక్రమునికున్న యంతరాయము కాశీరాజదుహిత ఈరెండును తృతీయాంకముతో దీరిపోవుచున్నవి అనగా బీజమునుబట్టి తృతీయాంకముతో నాటకము పరిసమాప్తము కావలసి యున్నది నాలుగవయంకము అయిదవయంకము- ఈరెండిటికి బీజములో పునాది లేనేలేదు అనగా మొదటి మూడంకములనుండియు నాలుగవ యంకము, అయిదవయంకము సహజ పరిణామముతో నుద్భవించుట లేదు అందుచే నీనాటకమున వస్తుపరిణామము (Evolution of plot) అను గుణము కొరవడి యున్నది

రెండవదృష్టిలో—ఊర్వశీ పురూరవుల ప్రణయగాథను పూర్ణముగ చిత్రించుట కవియుద్దేశమైనచో మొదటియంకము నాలుగవ

యంకము అయిదవయంకము సమన్వయించినట్లుగ రెండు మూడంకములు సమన్వయించుట లేదు రెండుమూడంకములలో నున్నవస్తువు, భార్యకు రాజుకు నడచిన యంతఃకలహము — ఈ ప్రణయగాధకు అనాకాంక్షిత మగుచున్నది శాకుంతలవస్తువున గూడ శకుంతలాపరిగ్రహణానంతరము దుష్యంతునకు హంసపదికతోడను వసుమతితోడను ఇట్టికలహ ముద యించుటకు శాంతించుటకు అవకాశ మున్నదిగదా! కవి వానిని చిత్రించినాడా? అనగా ఈ యంతఃకలహము నడుమవచ్చి నడుమశాం తించినది కొసవరకు దానికి ప్రసక్తి లేదు. అందుచే ప్రధానవస్తువుతో నెన్నగ సమన్వయించుట లేదు

మూడవయంకమున నొక సన్నివేశము మిక్కిలి నీరసముగ గోచరించుచున్నది

ప్రియానుప్రసాదన వ్రతమును, ఊర్వశీ సంభోగమునకు కాశీ రాజదుహిత — స్త్రీ సహజమగు నసూయను వీడి — యంగీకరించుట యును సహజముగ లేవు బహువల్లభాప్రియులగు మగవారికి ముఖ్య ముగ ప్రభువులకు అట్టి యనుకూలవతులు లభించిన బాగుండునను కోరిక యుండవచ్చును గాని అంతగ ననుకూలించుట స్వభావవిరు ద్ధము. విరుద్ధము కాదనియే యంగీకరింతమన్నను ఈ నాటకమున దానిని సంఘటించిన విధానమును బురస్కరించుకొని చూచినచో నదియంతగ విశ్వాసము గొలుపుట లేదు. ఈ నాటకమునకంతకు నింతటి దుర్బలసన్నివేశము వేరొకటి గానరాదు.

ఘటనాశిల్పమునందే కాక సన్నివేశచిత్రణమునందుకూడ విక్ర మోర్వశీయమన ప్రాథమికమగు నాత్రతయు తీవ్రగమనమును గన వచ్చుచున్నవి. ఏసన్నివేశమున కాసన్నివేశము చక్కగ నుస్మీలితము కాలేదు ప్రథమాంకమును గైకొందము. చెలికత్తెలతోనున్న ఊర్వ శిని పురూరవుని రంగమున ప్రవేశపెట్టినాడు శాకుంతల ప్రథమాంక మున నున్న సన్నివేశముకంటె నిది మిక్కిలి యనువైన సన్నివేశము.

శకుంతల మాటలేరాని ముద్దరాలు చెలికత్తెలయినను తాపసాశ్రమ వర్ధితలు వారిని దుష్యంతుడు ప్రథమమున దర్శించినది కులపతి యాశ్రమమున. అది శృంగారరసపోషణమున కనువైన యాశ్రయమే (back ground) కానేరదు ఇట్టి యననుకూలములైన పరిస్థితులందు సైతము సన్నివేశము నెంతో విపులముగను మనోహరముగను పోషించుకొని వచ్చినాడు. నిజమునకు విక్రమోర్వశీయ ప్రథమాంక మంతకంటె ననువైన సన్నివేశము నాయిక ప్రౌఢయగు నప్సరస. చెలికత్తెలా రంభ, సహజన్య మేనక మున్నగు సంధానకృత్యమున నారితేరిన దేవవేశ్యలు. కలసికొన్నది స్వేచ్ఛావిహారమున కనువైన ప్రదేశమున ఇన్ని యనుకూలపరిస్థితులున్నను ఇచ్చట సన్నివేశచిత్రణమునకు శాకుంతలసన్నివేశచిత్రణములో నున్న పుష్టి లేదు

ఇట్లే శాకుంతలమున సప్తమాంకమున గనవచ్చు పుత్రసమాగమ సన్నివేశముతో విక్రమోర్వశీయపంచమాంకమున గనవచ్చు పుత్రసమాగమసన్నివేశమును సరిపోల్చుకొనవచ్చును ఈ చిత్రణము మిక్కిలి తొందరతో నడచినది శాకుంతలమున మనము ఊహించుటకయినను వీలులేని కల్పనలతో వింతవింతగ విజృంభించి సన్నివేశ మెంతో యపురూపసౌందర్యమును సంపాదించుకొన్నది.

కాని కాళిదాసునకే గాక ఇతరులకు అసాధ్యము లని నిర్ణయింపజాలిన కొన్ని గడుసుపోకడలును మానవస్వభావమర్మ పరిశీలనమును విక్రమోర్వశీయమున గనవచ్చుచున్నవి

ప్రథమాంకమున— అంతవరకు దానవునిచేత జిక్కినందులకు భయముచే మూర్ఛలో మునిగిన ఊర్వశి కన్నులు దెరచి రాజును చూచినంతనే ఆత్మగతమున

"ఉపకృతం ఖలు దానవైః"

అనుకొనుట ఎంతో రసోద్బోధకముగ నున్నది ఇట్లే వైజయింతీ మోచనమునుగూర్చి ప్రార్థించినపుడు ఊర్వశితో చిత్రలేఖ

(సస్మితమ్) దృఢమ్ ఖలుల గ్నా గుర్ోనచనీ యేవ మమప్రతిభాతి భవతుయతిష్యే తాదత్

అనిపలికిన వాక్యములోని నర్మగర్భితమగు ధ్వనియు మిక్కిలి విదగ్ధముగ నున్నది

పంచమాంకమున ఆయువురు చూచినవెంటనే ఊర్వశికి పురూరవసంగమావసానసమయము జ్ఞప్తిచేయక

రాజా —సుందరి!

శ్లో॥ ఆద్యాహం పుత్రిణా మగ్ర్యః సుపుత్రేణ త వామునా
పౌలోమీసంభవే నేవ జయంతేన పురందరః

అనుమాటలు పురూరవుడు పలికినవెనుక సంగమావసానమును జ్ఞప్తి చేసి ఊర్వశీరోదనమునకు ప్రసక్తి కల్పించుట కాళిదాసుని మానవ స్వభావపరిశీలనమునకు వన్నె దెచ్చుచున్నది చిరకాలమునకు చూచినదిగావున ముందుగ ఊర్వశికి పుత్రస్నేహమే పయుకొన్నది రాజునకు ఆమె పుత్రుని ఇంతకాలముగ దాచుటకు గలకారణము తెలియదు. అందుచే "అయ్యో! పుత్రవంతులలో నగ్రేసరుడనయ్యును ఇంతకాలము నపుత్రకునివలె నటనుటింపవలసి వచ్చినదే" యను. వేదనాభరమున నాతడు పయువిధముగ పలుకుటయు సహజమే. ఈమాటలు పురూరవుడు పలికినవెనుకనే పురందరు డేర్పరచిన సమయము ఊర్వశికి జ్ఞప్తికొదవుట ఎంతయు స్వాభావికముగ నున్నది మానవస్వభావమర్మములను ఎంతోగాఢముగ పరిశీలించినవారు గాని ఇట్టి సన్నివేశములను ఈతీరుగ సంఘటించి పోషింపలేరు.

మాళవికలో కథాకల్పనముమీదను వస్తునిర్వాహణము మీదను లగ్నమయిన కాళిదాసునిదృష్టి విక్రమోర్వశీయమున పద్యరచనము మీదికి రసపోషణము మీదికి ప్రధానముగ ప్రసరించినది. మాళవికలో పద్యరచనము, సన్నివేశచిత్రణము పాత్రపోషణము

ప్రత్యేక ప్రశంసార్హములుగ లేవు. ఇక విక్రమోర్వశీయమున వస్తుసంఘటనము పన్ని వేశచిత్రణము పరిపుష్టి నందుట లేదు. పాత్రములలో మాళవికాగ్నిమిత్రులకంటె ఊర్వశీపురూరవులు హృదయము నాకర్షించుచున్నను శాకుంతలమునందలి పాత్రములతో తులతూగలేరు. నిర్మాణపు శిల్పమునందు, రసపోషణమునందు పద్యరచనమునందు, పాత్రీకరణ వైదగ్ధ్యమునందు ప్రకృతివర్ణనమందు ఏగుణమును గైకొన్నను శాకుంతలము తక్కిన రెండు నాటకములకంటె మిక్కిలి ప్రశస్తపాకమున బడి కాళిదాసు నాటకరచనమున కుత్తమపరిణామమును చేకూర్చినది.

ఇంతవరకు ఒక్కొక్క నాటకమునే సోపానక్రమమున నధిరోహించినాము. ఇప్పుడు మాళవికాగ్నిమిత్రమును విక్రమోర్వశీయమును ఒక తులయందును ప్రత్యేకము శాకుంతలము నొక్కదానిని ఒకతులయందును ఉంచి తారతమ్యము నిరూపించిననేగాని దాని ప్రాశస్త్యము విస్పష్టముగ వ్యక్తముగా నేరదు

మూడును కాళిదాసకృతులే యైనను మొదటి రెండు నాటకములకును మూడవనాటకమునకును ఎన్నో యంతరువులు తారతమ్య మున్నదనుట మనము విస్మరింపరాదు. ఉత్తమరచయితల రచనములలో సాధారణముగ రెండుదశలు స్ఫురించుచుండును. (1) శిక్షణదశ (2) స్వేచ్ఛాదశ. మొదటిదశలో నియమములకు ప్రాధాన్యము. ఆ నియమము లెక్కడ భంగమగునో యన్నశంకకూడ రచయితలో ప్రాయికముగ గానవచ్చును, నియమములను పూర్ణముగ జీర్ణముచేసికొన్న వెనుక రచయిత విశ్వాసము విజృంభించును. ఈ దశలో నాతడాడినదాట పాడినపాట, ఇచ్చట సీమములు ప్రతిభకు దాసులు. ప్రతిభ తన్నట్లు నడపిన నట్లు స్వేచ్ఛావిహారము సలుపుటయే ఈ దశకు లక్షణము. అట్టి ప్రతిభాశాలుర ప్రతిభకు అవధినిర్మించుట ఎట్టిఆలంకారికునకు సాధ్యము గాదు. అది నిరంకుశము. వ్యక్తమయిన వెనుక దాని

స్వరూప మిట్టిదని నిరూపించుటయే విమర్శకధర్మముగాని వ్యక్తము
కాకముందు దాని మార్గమును నిర్ణయించి శాసించుటకు ఎవ్వరికిని
అధికారము లేదు మాళవికయు ఊర్వశీయమును శిక్షణదశకు జెంది
నవి ఊర్వశీయమున స్వేచ్ఛావిహారమునకు ప్రయత్నమున్నను కృతా
ర్థము కాలేదు కాని శాకుంతలమున కాళిదాసుని ప్రతిభ భరతునిరథ
మువలె నప్రతిహతముగ భూమ్యాకాశముల నేకముచేసికొని స్వేచ్ఛా
విహారము సల్పుచున్నది ఎచ్చటజూచినను ప్రత్యక్షమగు దాని
"యూర్ధ్వతిర్యగ్గతిసముల్లాసము" తక్కిన నాటకములలో మృగ్యము.

శాకుంతలమునకు ప్రధానాధారము భారతమే యైనను భారత
ములో నున్నట్లుగానే అది యిచ్చట మనకు ప్రత్యక్షమగుట లేదు
దానిస్వరూపమే చాలవరకు మారిపోయినది కాళిదాసు చేసినమార్పు
లకు కొంతవరకు కాలభేదమును బట్టి తటస్థించిన యభిరుచిభేదము
కారణమయి యుండవచ్చును కొంతవరకు రాజచారిత్రము ననవద్యము
చేయవలెనన్న యాశయము కారణమయి యుండవచ్చును. కాని
ముఖ్యకారణము కాళిదాసునకు భారతకారునికి కళాదృష్టియం దేర్పడు
చున్న తాత్త్వికభేదమే యని చెప్పవలయును ఈ యంశముల నన్ని
టిని శాకుంతలమును శకుంతలోపాఖ్యానముతో బోల్చి చూచునపుడు
విమర్శించుకొనవచ్చును. ప్రకృతము శాకుంతలమును ప్రత్యేకకావ్య
ముగ గైకొని తత్త్వాన్వేషణము చేయవలసియున్నది.

సుకవి సత్కృతి సురభిళము మకరందపూర్ణము సుందరము నగు
పుష్పమువంటిది. కావ్యమునం దంతటను ధ్వనిప్రధానముగ సంచరించు
మహార్థము పరిమళము. నిక్షిప్తమైనరసము మకరందము. ఆకృతివైభ
వము సౌందర్యము ఇంకొక విశేష మేమనగ కృతిలోనివి యన్యోన్యా
శ్రియములు. మహార్థముమీద నాధారపడి రసము రసముమీద
నాధారపడి యాకృతివైభవము నిర్ణీతము లగుచుండును. అందుచే

మహార్థమును కావ్యమున కాత్మగా గైకొందురు

మొదటి రెండునాటకములలోను మహార్థమొద్దియు సురభిలించుచున్నట్లు కనబడదు. మాళవికకు మాళవికాగ్నిమిత్రుల వివాహమే పరమప్రాప్యము. విక్రమోర్వశీయమున నయిదవయంకమున పురూరవుడు పుత్రులు లేరని వాపోవుట కొంత గాననగును గాని ఇది నాటకమునకంతకు నైక్యమును ప్రతిపాదించు మహార్థముగ లేదు. ప్రణయవ్యవసాయమున కెక్కడ భంగమువచ్చునో యని ఊర్వశి పుత్రుని చ్యవనాశ్రమమున దాచివేయుట చూడగ ప్రణయము ప్రధానము పుత్రోదయ మప్రధానమైనది. శాకుంతలమున నట్లుగాక బీజము మొదలుకొని కార్యావసానమువరకు భరతావతరణమే పరమలక్ష్యమయినది. ఈవిధముగ మహార్థప్రతిపాదనమున నిది తక్కిన రెండునాటకములకంటెను మిన్నయై యలరారుచున్నది. భరతువంటి జాతీయ చక్రవర్తికి జన్మము నొసంగి చరితార్థులయిన దంపతు లెంతటి పవిత్రచరిత్రులో నిరూపించుటయే నాటకమునకు పరమార్థము.

ఈ మహార్థమును పురస్కరించుకొని చూచినపుడు ఒక రహస్యము ప్రకటమగుచున్నది. మాళవికాగ్నిమిత్రుల ప్రణయమును ఊర్వశీపురూరవుల ప్రణయమును లలితముగను ఉదాత్తముగను చిత్రితములయినను శకుంతలాదుష్యంతుల ప్రణయము సంచరించిన పుణ్యభూములలో నవి సంచరింపలేదు. మొదటి రెండునాటకములలోను దంపతుల ప్రథమసంగమము ప్రాసాదములలో. అట్లుగాక మూడవనాటకమున నది కులపతియాశ్రమమున నడచినది. నిజముగా కోపమునకు కారణమే లేకపోయినను ఊర్వశిపురూరవుని ప్రణయకోపమున కింధనముగ జేసివైచినది. కొండంత కోపకారణమున్నను మారుపల్కక శకుంతల తనభాగధేయమును నిందించుకొనుచు దుష్యంతుని సన్నిధినుండి నిగ్రహశక్తితో నిష్క్రమించినది. ప్రణయినితోడి విహారణము

నకయి పురూరవుడు రాజ్యము మంత్రుల కొప్పగించి శృంగారవన ములనాశ్రయించినాడు. ఒకమూల సహధర్మచారిణియయిన యిల్లాలిని త్రోసిపుచ్చితినే యన్న పశ్చాత్తాపభారము రంపపుకోత కోయుచున్నను దుష్యంతుడు ప్రజాహితజీవియై రాజ్యభారమును వహించినాడు

అనగా శాకుంతలమున నిగ్రహమునకు ప్రాధాన్యమువచ్చినది భోగమున కప్రాధాన్యము నిరూపితమైనది ఈ రహస్యమును గ్రహించినవారికే నాటకమునందలి రసము, ఆకారవైభవము శైలి మున్నగు గుణములన్నియు సుగ్రాహ్యములు కాగలవు

శాకుంతలమున కాళిదాసు సాధించిన ముఖ్యసిద్ధులు మూడు. (1) ధ్వన్యైక్యము, (2) ఆకృతివైభవము, (3) ఆశ్రయశిల్పము ఈ మూడిటియందునుగూడ మొదటి రెండునాటకములకును మూడవనాటకమునకును నెక్కడను పోలికలేదు ఈ మూడిటినిగూర్చి వీటిలో నంతర్భూతములయిన యుపసిద్ధులనుగూర్చి దీర్ఘవిమర్శనమునకే ఈ గ్రంథముద్దిష్టము. కాని ప్రకృతము సమష్టిమీద కొన్ని సూచన లావశ్యకములు.

శాకుంతలమునకు పరమప్రాప్యమయిన మహార్థము ధ్వనిప్రధానముగ చిత్రితమయినది. అనగా ప్రత్యక్షవస్తువులో నది పరోక్షముగ పుష్పమున సౌరభము వలె సంచరించుచున్నది ప్రత్యక్షముగ ఆకృతి సౌష్టవమునకు పరోక్షముగ పరిమళసాంద్రతకు తోడ్పడుటవలన పుష్పమునందలి ఒక్కొక్కరేకే రెండుప్రయోజనములను నిర్వహించినదగుచున్నది. ఈతీరుననే నాటకమునందలి ఉపాంశము లన్నియు ప్రత్యక్షముగ నాటకమునందలి ఆకృతివైభవమునకు తోడ్పడుచున్నవి పరోక్షముగ నాటకమునకు పరమప్రాప్యమయిన మహార్థమును స్ఫురింపజేయుటలో ధ్వనిసాంద్రతకు తోడ్పడుచున్నవి.

జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ,
పుత్ర మేవంగుణోపేతం చక్రవర్తినమాప్నుహి.

అనుశ్లోకమును గైకొనుడు ఋషులయాజ్ఞను మన్నించి తనవేటతమకమును నిగ్రహించుకొన్నందులకై వైఖానసు లనుగ్రహించిన యాశీర్వచన మిది ప్రత్యక్షముగ నాటకకథ కిది బీజప్రాయము శకుంతలాదుష్యంతులవివాహము, దుర్వాసశ్శాపము, శకుంతలానిరాకరణము, పునస్సమాగమము భరతాభిషేకము మున్నగు నుపాంశములుగల గాథయంతయు ఇందిమిడి యున్నది పరోక్షముగ నిది కావ్యమహార్థమును ప్రతిపాదించుటలో ధ్వనిని సాంద్రము చేయుచున్నది

" వేటయను వ్యసనమునందుసైతము నీకు నిగ్రహమున్నది, ఇది మీపౌరవులకందరకు సంప్రదాయ సిద్ధము. ఇట్టి నిగ్రహశక్తిచే వారు ప్రజాహితజీవనులయి రాజ్యముచేయుచువచ్చిరి ఇకముందు శృంగారాదివ్యాపారములలో సైతమిట్టినిగ్రహమునే ప్రకటించి నిన్ను మించిన ప్రజాహితజీవనుడును, చక్రవర్తియునగు కుమారుని గాంచుము " అని ఈయాశీర్వాదమునందలి భావము అనగా భోగము యోగమునకు త్యాగమునకు లొంగియుండవలసినదిగ నిరూపించు కావ్యపరమార్థమున కిది పోషకము. ఈతీరుగ "నదీనాం సాగరో గతిః" అనినట్లు ఇంచుమించుగ కావ్యమునందలి ప్రతివాక్యమును కావ్యపరమార్థమును సూచించుచు దాని ధ్వనిసాంద్రతను (central effect) నిబిడీకరించుటకు తోడ్పడుచున్నది. అందుచే నేవాక్యమున కావాక్యమును ప్రత్యయార్థమును పరోక్షధ్వనిని విమర్శించుకొని చూచినపుడే రసానుభూతి చరితార్థము కాగలదు. ఈతీరున పరీక్షించిన నేర్పడు కావ్యమునందలి ఏకాగ్రతకు—అదే ధ్వని సాంద్రతకు "ధ్వనైక్యము " అని నామకరణము మనము చేసికొనవచ్చును. ఇట్లు ధ్వనైక్యము శాకుంతలమున మూర్తీభవించియున్నది. రసపోషణము, పాత్రీకరణము, శైలి అనుమూడు ఉపసిద్ధ

లును సూర్యునిచుట్టు తిరుగు నితరగ్రహముల వలె నీధ్వనైక్యము నను సరించుకొని తిరుగుచున్నవి

పాత్రములను దీసికొన్నచో మాళవికాగ్నిమిత్రులకంటె ఊర్వశీపురూరవులకంటె శకుంతలాదుష్యంతు లెందులకు మనహృదయము నాకర్షించుచున్నారో గ్రహించుట సుకరము. వీరి చారిత్రమున నున్న సార్వజనీనకత వారి చారిత్రమున లేదు లతలయందు వృక్షముల యందుకూడ సోదరస్నేహమును ప్రకటించుచు అనాధములగు మృగపోతకములను పుత్రదృష్టితో పెంచుకొనుచు ఆశ్రమములో నిరాడంబరము, అమాయకము ననురాగగంభీరము నగు తపస్వినీజీవితము నడపె జన్మమంతయుకష్టములతోనే గడపిన శకుంతల సీతతో సావిత్రితో దమయంతితో సరిగద్దె నెక్కుచున్నది. మాళవికచారిత్రములో సౌందర్యము నాట్యవిజ్ఞానము తప్ప మనల నాకర్షింపదగిన యంశము లేదు. ఊర్వశి ప్రజాహితజీవితమునకు రాజధర్మమునకు విముఖుని జేసి గంధమాదనమునకు పురూరవుని లేవదీసికొనిపోయిన తేరకత్తె. ఆమెలో సౌందర్యము రసజ్ఞత తప్ప ఇతరమైన యాకర్షకాంశము గన్పట్టుటలేదు.

ఇట్లే దుష్యంతునిపాత్రచిత్రణములో నున్న గాంభీర్యము ఇతర నాయక పాత్రములలో గానరాదు ఎక్కడికక్కడకు దుష్యంతుడు తత్త్వాన్వేషి. అనగా ఆత్మపరీక్షణము అతనిస్వభావములో సంస్కారసిద్ధముగ గనవచ్చు విశేషము. శకుంతలను అభిలషింపవచ్చునా లేదా యనుట మొదలుకొని శకుంతలను ప్రత్యాదేశించుటలోను భరతుని పుత్రునిగా గ్రహించి పరిష్వంగము చేసికొనుటలోను గూడ అతని వివేకవైభవము ప్రకటమగుచున్నది.

అహాన్యహాన్యాత్మన ఏవ తావత్ జ్ఞాతుం ప్రమాదస్ఖలితం న శక్యమ్
ప్రజాసు కః కేన పథా ప్రయాతీ త్యశేషతో వేదితుమస్తి శక్తిః

అనుకొనుటలో నాతని యాత్మపరీక్ష మిన్నుమిట్టుచున్నది ఆరవ

యంకమున దుష్యంతుడు ప్రకటించినది భోగాసక్తిచే నుదయించిన విర హముకాదు ప్రజావతికానున్న ధర్మపత్నిని అకారణముగ పరిత్యజించి తినే యన్నపశ్చాత్తాపము అందుచే నది మనహృదయమును గాఢముగ నాకర్షించుచున్నది.

తక్కిన నాటకములలో నప్రధానపాత్రములలో నాకర్షకమైనవి ఇంచుమించుగ లేనేలేవని చెప్పవచ్చును. శాకుంతలమున కణ్వుడు శకుం తల చెలికత్తెలు మున్నగు నప్రధానపాత్రములుగూడ మిక్కిలి యాక ర్షకముగ చిత్రితమయినవి

ఇక శైలివిషయమున మాళవికలో పద్యమునకు వచనమునకు గూడ గాంభీర్యము లేదు

ఊర్వశీయమున రెండును మిక్కిలి యభివృద్ధి గాంచినవి. పద్యము మిక్కిలి ప్రశస్తమనుకొనుడు వచనముకూడ మాళవికలో కంటె సానబట్టినట్లగుచున్నవి. సంభాషణను పెంచుకొని వచ్చుటలో కాళి దాసుది అందేవేసినచేయి నాతిదీర్ఘములగు వాక్యములు. ఒక్కొక్క వాక్యమే గంటానాదము వలె చెవులలో మారుమ్రోగుచుండును. వాస్త వికనాటకములకును రసప్రధానములను న టకములకునుగల తారతమ్య మును గుర్తించి అతడు తనశైలిని నిర్వహించుకొన్నాడు వాస్తవిక నాటకములలో వ్యావహారికములగు పొడివాక్యములే హెచ్చుగనుం డును రసప్రధానములగు నాటకములలో వచనముకూడ పద్యముతో చెలిమినవహించు లాలిత్యమున కాకరము కావలసియున్నది శాకుంతలము నందలి పద్యమునకును వచనమునకునుకూడ అపూర్వమైన రామణీయ కము అనన్యసామాన్యమగులాలిత్యము ప్రత్యేక గుణములుగ నేర్పడు చున్నవి "అహో మధుర మాసాం దర్శనం" "అహో! సమవరోపరూప రమణీయమ్ సౌహార్దం భవతీనాం" "అహో రాగపరివాహినీ గీతిః" ఇత్యాదివాక్యముల నెన్నిటినైన ఉదాహరణములుగ నీయవచ్చును.

ప్రతిపాదింపదలచుకొన్న మహార్థ మొక రత్నమనుకొనుడు. దానికి ఆధారమగు వస్తువు కుందన మనుకొనుడు ఈరెండును కలసి ఆభరణ మగుచున్నవి. ఈయాభరణమును దాచుటకుదగిన దంతపుబరణి శైలి (శయ్య అను పూర్వాలంకారికవ్యావ్యాత మెక్కు డుచితముగ నుండు నేమో) శాకుంతలమునకు తరువాత రచించినట్లు కొందరు నిర్ణయించు రఘువంశాదులలోకూడ ముక్తపదగ్రస్తాది చిత్రప్రక్రియలు గనవచ్చుచున్నవి గాని శాకుంతలమున శయ్యా సౌష్టవ మెక్కడను భంగము నొందుటలేదు

మాళవికలోనికథకు చమత్కృతి యున్నది అది నిర్వహించిన విధానమునకూడ నిస్పష్టతయున్నది ఊర్వశీయమునగూడ నీవిస్పష్టత గానవచ్చుచున్నను ఇదివరకే వివరించినట్లుగ వస్తువునకు కొంత వైకల్య మేర్పడుచున్నది మొత్తముమీద రెండింటిలోను వస్తుప్రస్తరణమున గంభీరమగుశిల్పము గానరాదు శాకుంతలమున నట్లుగాక ఎక్కడి కక్కడ అద్భుతమైన శిల్పము ప్రత్యక్షమగుచున్నది అప్రయత్నముగ వస్తువు తనయంత తానుగ నల్లుకొనిపోవు విధానము చూడగ నాశ్చర్యము గొలుపును వీనికిక్కడ నక్కడ యని పేర్కొన నక్కరలేదు. నాటకమంతయు నుదాహరణముగ నీయవచ్చును. అయినను ప్రతిపాద్య విషయము విస్పష్టముకాగలందులకు ఒక్క యుదాహృతి చాలును.

"జన్మ యస్య పురోర్వంశే యుక్తరూపమిదంతవ,
పుత్ర మేవంగుణోపేతం చక్రవర్తిన మాప్నుహి."

అని వైఖానసు లాశీర్వాదము ననుగ్రహించినారుగదా ! దానికి రాజు "పరిగృహీతం బ్రాహ్మణవచనమ్" అని ప్రత్యుత్తరమిచ్చినాడు. వెంటనే ఆశీర్వాదము ఫలింప నారంభించినది.

వైఖానసః :- రాజన్ సమిదాహరణాయ ప్రస్థితా వయం. ఏషఖలు కణ్వస్య కులపతే రనుమాలినీతీర మాశ్రమో దృశ్యతే. నచే దన్యకార్యాతిపాతః ప్రవిశ్యాత్ర గృహ్యతా మతిథి సత్కారః—

అని యాహ్వానించునపుడు వైఖానసులకుగాని ఈ యాహ్వానమును స్వీకరించు చున్నపుడు దుష్యంతునకుగాని ఆశీర్వాదము ఫలించుటకు మార్గ మేర్పడినదని తెలియదు చదువరికిమాత్ర మది విస్పష్టముగ గోచరించుచున్నది యాదృచ్ఛికముగ గానవచ్చు వాక్యములలో భవితవ్యతాఘటనము ప్రత్యక్షముగఁజూడుడు ఇదే యిందలి ఘటనాశిల్ప రహస్యము. అవైఖానసుల వాక్యములు యాదృచ్ఛిక మనుటకు

శ్లో॥ రమ్యా స్తపోధనానాం ప్రతిహతవిఘ్నాః క్రియాః సమవలోక్య,
జ్ఞాస్యసి "కియద్భుజో మే రక్షతి మౌర్వీకిణాఙ్కః" ఇతి.

అను వారి తరువాతివాక్యము ఆధారము. రాజు పలికిన "నైవ విదిత భక్తిం మాం మహర్షేః కరిష్యతి" అను వాక్యమును బట్టి అతని కప్పటికి శకుంతలపట్ల నెట్టి శృంగారప్రయోజనాపేక్షయు లేదని నిరూపితమయినది ఇట్లే "తపోవనవాసినా ముపరోధో మాభూత్" అను యాదృచ్ఛినవాక్యమునకు ప్రత్యక్షప్రయోజనము దుష్యంతుని వినయ నిరూపణము, కాని పరోక్షముగ నిది కథాసంఘటనమున కెంత పరిమోపకారి ! ఈ తీరుగ నాటకమునంతను ఘటించుకొని వచ్చినాడు. తరచినకొలది దాని సౌందర్యమునకు చకితులము గావలసినదే.

మాళవికలో పంచమాంకమున తపనీయాశోకము నాశ్రయముగ నిర్మించుటలోగల శిల్పమునుగూర్చి ముచ్చటించుకొంటిమి. ఊర్వశీయమునగూడ నాలుగవయంకమున కొంతయాశ్రయశిల్పము గనవచ్చుచున్నది విరహోన్మత్తుఁడగు పురూరవుని గంధమాదనమున ప్రవేశపెట్టి తొలకరి నీలమేఘము మున్నగు ననుగుణదృశ్యములతో ప్రకృతి నాశ్రయముగ గల్పించినాడు. ఇది మాళవికలోనున్న ఆశ్రయ శిల్పముకంటె విజృంభణదశలో నున్నను ఈఆశ్రయశిల్పము ప్రత్యేక సిద్ధిగ నైకొనదగినంతటి ప్రాముఖ్యమును బడయుటలేదు. శాకుంతలము నందలి యాశ్రయశిల్పము ఎట్టి కళాభిజ్ఞునికైనను వెఱపు గొలుప జాలి

యున్నది తక్కిన రెండునాటకములలోవలె నెక్కడనో ఒక్కచోట నుండుటగాక మొదటినుండి కడవరకు బ్రత్యక్షమగుచున్నది మాళవికమునను న్నను గమనించుటకే వీలులేకుండ నున్నది ఊర్వశీయమున ఒక్కచో కుప్పవోసినట్లుగ నుండి కొంతవరకు మొగము మొత్తుచున్నది. శాకుంతలమున నది ధ్వనిప్రధానముగను ఎంతో నాజూకయిన పనితనముతోను ప్రధానవస్తువుతో కలిసిమెలసి ప్రత్యక్షమగుచున్నది శకుంతలను కేసరవృక్షవము చెంత నిలువబెట్టినాడు

ప్రియంవదా — సఖిశకుంతలే! అత్రైవ తావన్ముహూర్తం తిష్ఠ యావత్త్వయా ఉపగతయా లతాసనాథఇవ అయంకేసరవృక్షక ప్రతిభాతి

రాజా — ప్రియమపి తథ్య మాహ ఆస్యాఃఖలు—
అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ
కుసుమమివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధమ్

అని వర్ణించుచున్నాడు

ఈతీరుగ నీ యాశ్రయశిల్పము ప్రధానవస్తు సౌందర్యము నినుమడింపజేయుచు దానికి చెలికత్తెయై మొదటినుండి తుదివరకు పరిచర్య జేయుచునే యున్నది. ఈయాశ్రయశిల్పమున గననచ్చు నపురూపకళా రహస్యములను ప్రత్యేకవ్యాసమున విమర్శించుకొందము

మొత్తముమీద కాళిదాసుకృతులన్నియు గైకొన్నచో రెండు అంతర్వాహినులు ప్రత్యక్షమగుచున్నవి, (1) భోగవాహిని (2) యోగవాహిని. ఋతుసంహారమున, మాళవికాగ్నిమిత్రమున, మేఘదూతను విక్రమోర్వశీయమున భోగవాహినియే ప్రధానము. కుమారసంభవమున, రఘువంశమున, శాకుంతలమున భోగమునకు యోగమునకు సంయోగ మేర్పడినది. మొగ్గరము యోగము మీదనే. భోగములో కూడ కేవలము విషయలోలత లేదు. ఎక్కడజూచినను లలితము, ఉదాత్తము నిగ్రహోపేతము నయినభోగమే సంచరించుచున్నది ఏయితర

కృతియందును భోగమునకు యోగమునకు శాకుంతలమున ప్రతి పాదితమగు పరమమైత్రి ప్రత్యక్షమగుట లేదు కళాగాంభీర్యమునందు ఆశయపారిశుద్ధ్యమునందు రససంచారమునందు శాకుంతలము కాళిదాసుని నాటకములకేగాక కృతులన్నిటికినిగూడ శిరోరత్న మన జెల్లును. కాళిదాసు ప్రతిభకు ఉత్తమనిదర్శనమును చేకొనవలసివచ్చి నపుడు శాకుంతలమునే చేకొనవలసియున్నది.

ఇట్టి యద్భుతకృతిని జూచి రసజ్ఞచక్రవర్తియగు గెటే (Goethe)

Wouldst thou the young year's blossom and the
fruits of its decline
And all by which the soul is charmed enraptured
feasted fed ?
Wouldst thou the earth and heaven itself in one sole
name combine ?
I name thee O' Sakuntala, and all at once is said

అని రసోన్మత్తుడయి గానము చేసినాడనుటలో నాశ్చర్యమేమున్నది ?



# శాకుంతల విమర్శనము

## నిర్మాణనశిల్పము

కావ్యమునకు పట్టవలసిన ఉత్తమలక్షణములలో నిర్మాణనశిల్ప మొకటి కావ్యవస్తువును ప్రపంచించు చాతుర్యమును నిర్మాణనశిల్ప మనుట యుక్తము కళాభిజ్ఞుని నిరూపించుటకు జాలిన ప్రత్యేకసాధన ములలో నిది మేలైనది కళాభిజ్ఞుడు కాని కవి తన కావ్యమున ఆస్వాదన యోగ్యమైన భావముల నెన్నింటినో గుప్పించునుగాని చక్కని నిర్మా ణనశిల్పమునుమాత్రము ప్రదర్శింపజాలడు

—♦ శ్రవ్యప్రబంధములలో నిర్మాణశిల్పము ఆవశ్యకమా? ♦—

పూర్వాలంకారికులు నాటకములకు మాత్రమే ఆకృతిసౌష్ఠవ మును నిర్ణయించిరిగాని శ్రవ్యకావ్యములకు నిర్ణయింపలేదు గావున వానిలో నిర్మాణనశిల్పమున్నను లేకపోయినను ఇబ్బంది లేదని కొందరి మతము. కాని యీవాదము సరియైనది కాదు. పూర్వాలంకారికుల యాత్మశాంతికయి కళాసృష్టి కావ్యమును నిర్మించుట లేదు నిజముగా నాతనిలో నిర్మాణనకౌశల మున్ననాడు అది యాతనిరచనలో దృశ్యమే కానిండు, శ్రవ్యమే కానిండు దేనిలోనైనను ప్రత్యక్షము కాకమానదు. ఎంత చిన్నగీతము వ్రాసినను "దానినెట్లు మొదలుపెట్టవలెను? ఎట్లు పెంచవలెను? తుదకు ఎట్లు ముగించవలెను? ప్రస్తరింపదలచిన భావ ములు 'తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకును ప్రసాదము'గా నుండ కుండ అన్యోన్యాశ్రయములయి జడయల్లికగనుండునట్లుచేయుటయెట్లు" అను నిట్టి ప్రశ్నములకు సమాధానము చెప్పుకొనిగాని యాతడు రచన మారంభింపడు. చక్కగ నాలోచించి వంటయిల్లెక్కడ నుండవలెనో, పూజాగృహ మెక్కడ నుండవలెనో, కచేరీసావడి యేలీకున నిర్మింప

వలెనో, స్నానమునకు గది ఏదిశను నిర్మింపవలెనో, దేనికెంత స్థలము నొసంగవలెనో, దేని కేసామగ్రి నుపయోగింపవలెనో ముందుగ నిర్ణయించుకొని కట్టిన భవనము మిక్కిలి అందముగను వాసయోగ్యముగ నుండునట్లే చక్కని నిర్మాణముగల కావ్యమునకూడ రససంచారము సుగమమగును నిర్మాణమునందు ఔచిత్యభంగ మెప్పుడు కలిగినదో అప్పుడె కావ్యమునకుగూడ ఔచిత్యభంగమును, తన్మూలమున రస భంగమును వాటిల్లును దేహికి శరీరసౌష్ఠవ మెట్టిదో కావ్యమునకు నిర్మాణశిల్ప మట్టిది ఎట్టి యాత్మప్రధానవాదియు దేహమును కేవలము విస్మరింపలేడుగదా? శ్రీరామాది అవతారమూర్తులను వర్ణించునపుడుగూడ వాల్మీకిమహర్షి మున్నగు కవులు వారి యాత్మసౌందర్యమును మాత్రమే వర్ణించి యూరకుండక "సమ స్సమవిభక్తాంగః" ఇత్యాదివర్ణనములలో శరీరసౌష్ఠవమునకుగూడ ప్రాధాన్యమిచ్చుచు వచ్చిరిగదా? చక్కని యాత్మసౌందర్యమునకు చక్కని శరీరలావణ్యము జతగూడినపుడే కావ్యమునకు చరితార్థత సిద్ధించుచున్నది.

శ్రవ్యప్రబంధమైనను వాల్మీకిరామాయణమున ఆకృతిశిల్పమున నెన్నో రహస్యములు గోచరించుచున్నవి ఐతే ఆకృతిశిల్పమున రామాయణమున గానవచ్చు వైభవము ఇతరకావ్యములలో మృగ్యము. కాళిదాసకృతులనే గైకొనుడు రఘువంశమున వర్ణితములయిన రాజుల చరిత్రలకు వారొకేవంశమునకు చెందినవారను స్థూలసంబంధముతప్ప వస్తుతః ఆంతరంగికైక్యము (Organic cohesion) ఏర్పడుటలేదు. మరియు "దిలీపునితో ఎందులకు ప్రారంభింపవలెను? అగ్నివర్ణునితో ఏల ముగింపవలెను?" అను ప్రశ్నలకుగాని, "ఈరాజుల చరిత్రములలో దేని కెంతవరకు ప్రాధాన్యమిచ్చి వర్ణింపవలెనో అది గ్రహించి వర్ణించినాడా" యను ప్రశ్నకుగాని సమాధానమిచ్చుట కష్టసాధ్యము కావ్యప్రారంభము నొకవేళ సమర్థింపవచ్చునేమో కాని ముగింపుమాత్రము

తుగించిపైచినట్లున్నది. కావ్యమున చక్కనిశరీరపరిణామము గనవచ్చుట లేదు. కుమారసంభవమును గైకొన్నను ఆకృతివిషయమున నంత తృప్తికరముగ గనుపట్టదు. ప్రకృతము లభ్యమగు కుమారసంభవకావ్యము వస్తుస్వరూపమునుబట్టి చూచినచో నిది తారకాసురవధకాని కుమారసంభవము కానేరదు, అట్లని దీనిని 'తారకాసురవధ'గ గైకొందమన్న ఆపక్షములో మొదటి కొన్ని సర్గలు అనావశ్యకములు

—♦ దృశ్యప్రబంధములలో నిర్మాణశిల్ప ప్రాముఖ్యము ♦—

శ్రవ్యప్రబంధములను గూర్చి పూర్వాలంకారికులు మూకీభావము వహించినను దృశ్యప్రబంధములను గూర్చి యట్లు వహింపలేదు. పంచసంధులు, పంచ అర్థప్రకృతులు, పంచఅవస్థలు నిర్ణయించినపుడు వారు నాటకవస్తువు ఎంతచక్కగ గ్రథితము కావలసియున్నదో మిక్కిలి స్పష్టముగ ద్యోతమాన మొనర్చిరి

కాని అలంకారికుల నియమముల ననుసరించినంత మాత్రముననే ఆకృతిశిల్పమున నాటకరచయిత కృతహస్తుడు కాజాలడు. కాళిదాసుడు రచించిన నాటకములలోనే మాళవికాగ్నిమిత్రమునను, విక్రమోర్వశీయమునను శాకుంతలమున గానవచ్చు నిర్మాణశిల్పము కానవచ్చుట లేదు. పై రెండునాటకములలోను పైని సూచింపబడిన యాలంకారిక నియమములు పాటించినను మాళవికాగ్ని మిత్రమునందలి వస్తుసంఘటనమునకు జిగి మిక్కిలి తక్కువ 'ఎటుపోయిన నేమి ప్రమాదించునో' యను భయముతో సాగినది కాళిదాసునికలము విక్రమోర్వశీయమును నాటకముగ పరిగణించుట కంటె విరహగీతముగ పరిగణించుట యుక్తము చతుర్థాంకమే ఇందలి ప్రధానఘట్టము తక్కిన యంకములన్నియు ప్రధాన ఘట్టమునకు పరిచారికలు అందుచే మొక్కుదీర్చుకొనుటకు రచించినట్లు గానవచ్చును గాని వానికి పూర్ణమైనపుష్టి నిరూఢమగుటలేదు. అందుచే అవయవములందు ఏదోయొకటి మిక్కిలి

స్థూలమై తక్కినవి మిక్కిలి సన్నముగనున్న నెట్లుండునో అట్టి ఆకృతి వైకల్యము ఈ నాటకమున పొడకట్టుచున్నది సర్వాంగసుందరమయి ఆకృతిసౌష్ఠవమునకు, ఘటనా శిల్పమునకు ఇంచుమించుగ నాదర్శప్రాయముగ బేర్కొనదగిన కృతి శాకుంతలమే దీనియందు గానవచ్చు నిర్మాణన వైదగ్ధ్యము కాళిదాసు ఇతరకృతులకు సైతము అసాధ్యమైన దనినపుడు దాని మాహాత్మ్యమును గ్రహించుట సుకరము.

ఈ నిర్మాణన వైదగ్ధ్యమును మరల మనము రెండుశాఖలుగ విభజించుకొనవచ్చును, (౧) ఆకృతిసౌష్ఠవము (౨) ఘటనాశిల్పముఅని

## —♦ ఆకృతిసౌష్ఠవము ♦—

ఆకృతిసౌష్ఠవ మనినపుడు నాటకము మొత్తము ఆకారములో గమనింపదగిన విశేషము పూర్వాలంకారికులు స్థూలనిర్వచన మొనర్చుచు నాటకమంతయు గోపుచ్ఛము మాదిరిగా నుండవలెనని వాక్రుచ్చినారు అనగా మొదట బీజప్రాయముగ ప్రారంభమైన నాటకివస్తువు గర్భసంధి, అవిమర్శసంధి వచ్చునప్పటికి పుష్టివహించి మరల నిర్వహణమున సన్నమై ముగింపు నొందవలెనని వారి యాశయము గానోపును. ఇది స్థూలమైన సూచనముగ గ్రహింపదగును గాని నాటకములన్నియు ఒకే నమూనాలో తయారు కావలెనని వారియాశయము కానేరదు లేదా గోపుచ్ఛమువలె నాటకవస్తువంతయు ఏకాగ్రము కావలెనని వారి యభిప్రాయమగుచో నెట్టి తగవును ఉండనేరదు ఏర్పరచుకొనిన గమ్యమునుబట్టి, అనగా సాధింపదలచుకొనిన పరమార్థమును బట్టి నాటకాకృతి మారుచుండును. వస్తునిర్మాణమును నాటకమునకు శరీరప్రాయముగ గైకొన్నచో ప్రతిష్ఠింపదలచుకొన్న పరమార్థమును నాటకమునకు ఆత్మగ గైకొనవలసియుండును ఈ యాత్మనుబట్టి శరీరనిర్మాణనము కూడ మారవలసియుండు ననుట నిర్వివాదము. ఆయా జీవులకు నిర్దిష్టమగు ప్రయోజనమును పురస్కరించుకొని వారివారి శరీరనిర్మా

ణానమున భేదము గానవచ్చుట లేదా? అసురసంహార మొనర్పవలసిన శ్రీరాముని యవయవనిర్మాణము వేరు వాదములో బౌద్ధులను జయింపవలసిన శంకరుని యవయవనిర్మాణము వేరు సొంతముగ నివసించుటకు కట్టుకొను సౌధమునకును, ధర్మసత్రమునకును - దేవాలయమునకును ఉద్దిష్టమగు ప్రయోజనమును పురస్కరించుకొని నిర్మాణము నందు భేదము సిద్ధించుటలేదా! అట్లె విదగ్ధుడగు కవి సాధింపదలచిన ప్రయోజనము ననుసరించి నాటకాకృతిని నిర్ణయించుకొనుచుండును అందుచే శాకుంతలమునందలి యాకృతిసౌష్ఠవమున కానందింపవలెననిన శాకుంతలమున కాళిదాసు ప్రతిష్ఠింపదలచుకొనిన పరమార్థమేమి అను ప్రశ్నకు మున్ముందు మనము సమాధానమును బడయవలెను

కాళిదాసు నాటకమునకు శకుంతలా దుష్యంతుల ప్రణయమే పరమార్థమా! వేరొక పరమార్థ మేమైన నున్నదా? శకుంతలా దుష్యంతుల ప్రణయమే పరమార్థము కానేరదు అట్లయినచో నాటకాకృతి వేరుగ నుండియుండును. శకుంతలయు, దుష్యంతుడును ఒకరినొకరు చూచుకొని మోహించుటతో ప్రారంభమయి పెండ్లిపీటలమీద అగ్ని సన్నిధిని ఒకరిమెడలో నొకరు పూలదండ వైచుకొనుటతో ముగియవలసియుండెడిది.

శాకుంతల నాటకప్రారంభము మిక్కిలి ప్రౌఢమయినది. దీనిని గమనించినచో నాటకమునందలి పరమార్థమెల్ల మనకు కరతలామలకమగును. మరియొక కవియైనచో శకుంతల చెలికత్తెలతో మొక్కలకు నీళ్ళుపోయుచు "ఇత ఇత స్సఖ్యౌ" అను ఘట్టమునుండి నాటకమును ప్రారంభించియుండును. కాళిదాసు మాత్ర మట్లు చేయక బాలహరిణము నొకదానిని ప్రవేశపెట్టి దానివెనుక రథారూఢుడయి మృగానుసారియయిన పినాకపాణివలె నున్న రాజును ప్రవేశపెట్టి ముందు హరిణమును, దానివెనుక రథమును పరుగెత్తించినాడు. ఒకవిధముగ నీరెం

డును రంగస్థలమునకు అననుకూలములు గావా? పరుగెత్తుచున్న లేడిని—ఆలేడి వెనుక బరుగెత్తు రథమును రంగమున ప్రదర్శించుట సుకరము కాదుగదా? అయితే ఈమ్రుఘట ప్రక్రియవలన కాళిదాసు సాధింప దలచుకొనిన ప్రౌఢార్థమేమి?

కాళిదాసునకు ఆర్యధర్మములపట్ల భక్తి అపారము "అనార్య" అనుట ఆతనిమతమున మిక్కిలి నికృష్టమగు దూషణము ఆర్యుల మతమున స్త్రీపురుషులు కామోద్రిక్తతచే ప్రణయ వ్యాపారమున నిమగ్నులగుట మిక్కిలి గర్హ్యము వంశోద్ధారకమగు సంతతిని బడయవలెనను సంకల్పముతో సంగమించునపుడే ప్రణయమునకు పారిశుద్ధ్యమేర్పడుచున్నది ఇతరత్ర ఆర్యజీవితమున దానికి స్థానమే లేదు

శ్రుతి-సోఽస్యాయ మాత్మా పుణ్యేభ్యః కర్మభ్యః ప్రతినిధీయతే (ఐతరేయోపనిషత్తు, తృతీయ ఖండము. మం ౧)

అను మంత్రార్థము ననుసరించి ప్రతిమానవుడును తనకు ప్రతినిధిగ నుండదగిన వ్యక్తినిగాని, వ్యక్తులనుగాని సంఘమునకు సమర్పించినపుడే తనకు జన్మ మొసగిన పితరుల ఋణము తీర్చుకొన్నవాడగుచున్నాడు అనగా తపస్వియై సంఘమునకు సేవ చేయవలసిన వ్యక్తి వేరొక తపస్విని సంఘమున తనకు మారుగ ప్రతినిధిగ నిలుపవలసియున్నది అట్లే ప్రభువయి ప్రజాపాలనమూలమున లోకమునకు సేవ చేయవలసినవ్యక్తి, మరల వేరొక ప్రభువును తన స్థానమున నిల్పి కాని లోకమునుండి విరమించుటకు వీలులేదు. ఏదో యాదృచ్ఛికముగ తటస్థించిన స్త్రీతో మోహావేశ పరవశుడయి సంగమించినచో ఈ ప్రయోజనము నెరవేరదనియే ఆర్యులమతము. ఇప్పటివలె "నాయిష్టమువచ్చిన స్త్రీని నేను వివాహమాడెదను. చచ్చుసంఘము నన్నేమి చేయగలదు!" అని 'సవాల్' చరచుటకు ఆర్యులియ్యకొనరు. వ్యక్తుల వివాహముల పయి సంఘమునకు పరిపూర్ణమైన యధికారమున్నది ఎవరి యిష్టము

వచ్చినట్లు వారు వివాహమాడినచో సంఘ మల్లకల్లోల మగును సమష్టిమీద సంఘహితముగోరి వ్యక్తులు తమస్వేచ్ఛను త్యజించుకొన్న ప్పుడే సంఘహితము సిద్ధించును అనగా వ్యక్తుల వివాహములు సంఘ మునకు అంతకును మేలు చేకూర్పవలసిన పవిత్రియజ్ఞములు తనకు అనురూపమగు వధువును వివాహమాడి తనవలెనే కాని, తనకు మించి గాని సంఘసేవ చేయగలిగిన సంతతిని గాంచుట వ్యక్తికి విధ్యుక్త ధర్మము. ఇక దుష్యంతునివంటి చక్రవర్తిపట్ల ఈభారము మరింత యధి కముగ నున్నది ప్రజల నందరిని ధర్మమార్గమున నడుపుచున్న ఉత్తమ ప్రజాసేవకు డాతడు అట్టివాడు తనకు ప్రతినిధిగ వంశకర్త యయిన చక్రవర్తిని కుమారునిగ బడసి ప్రజాసేవ కాతని నియోగించి తాను వానప్రస్థాశ్రమమును స్వీకరింపవలసియున్నది అనగా నాతని జీవిత మున కెల్ల నిది యుత్తమోత్తమ ఘట్టము. ఈఘట్టమును చిత్రించు టయే శాకుంతలమునకు పరమ ప్రయోజనము

శాకుంతల నాటకమున శకుంతలా దుష్యంతుల వివాహము భరతోత్పత్తి అను మహోత్కృష్ట గమ్యమునకు లొంగియుండవలసిన సాధనము మాత్రమే. అనగా శకుంతలా దుష్యంతుల ప్రణయము అప్రధానము. భరతోత్పత్తియే ప్రధానము మూలమునకూడ దుష్యంతచరిత్రమునకు ప్రసక్తి సిద్ధించిన విధమును గమనించినచో ఈ రహస్యము మనకు మరింత విస్పష్టమగును "భరస్వ" అని యాకాశవాణి పలుకుటచే 'భరతు' డను నామము కలిగిన దని వైశం పాయనుడు పలుకగ "భరస్వ" యని యాకాశవాణి పలుకవలసిన యగత్యమేమి కలిగినదని జనమేజయుడు ప్రశ్నించును దానిపయి శకుంతలాదుష్యంతుల సంవాదమును, దానికి కారణమయిన వారి చరిత్రమును చెప్పవలసివచ్చినది. అనగా మూలములోకూడ భరతో త్పత్తికి గల ప్రాధాన్యమును మనము గమనింపవలసియున్నది.

ఒక విధముగ జూచినచో శాకుంతలము మనకు జాతీయ నాటకము భరతఖండమునకు ఆనామము ననుగ్రహించిన చక్రవర్తి జన్మకథ యిది అట్టి చక్రవర్తి తల్లిదండ్రు లెంతటి పవిత్రచరిత్రులో నిరూపించు నాటకమిది

ఈ నాటకమునకు భరతోత్పత్తియే పరమగమ్యము గావుననే

" జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ
పుత్త్ర మేవంగుణోపేతం చక్రవర్తిన మాప్నుహి "

అను వైఖానసాశీర్వచనము దీనికి బీజప్రాయము

" రథే నానుద్ఘాత స్తిమితగతినా తీర్ణజలధిః
పురా సప్తద్వీపాం జయతి వసుధా మప్రతిరథః
ఇహాయం సత్త్వానాం ప్రసభదమనా త్సర్వదమన
పున ర్యాస్య త్యాఖ్యాం భరత ఇతి లోకస్య భరణాత్ "

అను మారీచుల యాశీర్వచనము ఈ నాటకమునకు ఫలప్రాయము.

మృగయావ్యసనాసక్తు డయియున్నను ఆశ్రమమృగమని తెలిసిన వెంటనే బాణము నుపసంహరించుకొనుటలో దుష్యంతుని యాత్మ నిగ్రహము ద్యోతమాన మగుచున్నది ఈ యాత్మనిగ్రహమునకు లభించిన పారితోషికమే వైఖానసుల యాశీర్వచనము ఈ యాశీర్వచనమును నాటకమునకు ప్రారంభముగ జేసికొనుటలోనే కాళిదాసుని కళాప్రౌఢిమము గానవచ్చుచున్నది ఈ ప్రౌఢిమమును గ్రహించినపుడే నాటకస్వరూపము మనకు సుగమ మగుచున్నది శకుంతలా దుష్యంతుల ప్రణయగాథ నెంతో చతురముగ వర్ణించిన కాళిదాసు ఆ ప్రణయ గాథకు పూర్ణస్వాతంత్ర్యము నీయక దానిని భరతోత్పత్తి యను నంకుశముచే నరికట్టినాడు శకుంతలా దుష్యంతుల వివాహపుష్పము నకు వంశకర్త యగు భరత చక్రవర్తి జననము ఫలము. ఇట్టి యాశ యముపై తన కెట్టి పూజ్యభావ మున్నదియు "ప్రజాయై గృహమేధి నామ్" అను రఘువంశ వాక్యములోనే ప్రకటించినాడు.

శాకుంతల నాటకమునకు పరమప్రాప్యము భరతోత్పత్తి యని గ్రహించినపుడు నాటకాకృతికి నూతనరామణీయక మేర్పడుచున్నది నాటకమున మొత్తము ఏడంకము లున్నవి గదా ఇందు మొదటి మూడంకములకును వివాహము ప్రత్యక్షవస్తువు తరువాతి మూడంక ములకును వియోగము ప్రత్యక్షవస్తువు సప్తమాంకమున సంయోగము ప్రత్యక్షవస్తువు. నాటకమునకు ప్రారంభము కులపతియాశ్రమమున, భరతవాక్యము ప్రజాపతియాశ్రమమున ఇచ్చట స్థూలదృష్టికి గోచ రింపని చమత్కృతి ఇంకొకటికూడ గనవచ్చుచున్నది. ఈ కులపతియు ఆ ప్రజాపతియు సగోత్రులు ఈ యంశమును కాళిదాసే "యుష్మ త్సగోత్రస్య కణ్వస్య" అను దుష్యంతవాక్యమును (అం. 2) బట్టి ద్యోతమాన మొనర్చుచున్నాడు. దీనినిబట్టి కాళిదాసు నాటకవస్తువు నకు చక్కని యైక్యమును సిద్ధింపజేయుటకై ఎంత శ్రద్ధవహించినదియు, అతని బుద్ధివైభవ మెంత యగాధ మయినదియు తేటతెల్లమయి ఆశ్చ ర్యము గొలుపును. కొంతవరకయిన భారతమునుబట్టి పోవలసినవాడు గావున శకుంతలను కణ్వాశ్రమమున దప్ప వేరొకచో ప్రవేశపెట్టుట కాతనికి స్వాతంత్రము లేదనుకొనుడు కాని వారిని మరల సమావేశ పరచు ఘట్టమాతని స్వకపోలకల్పితముగదా అది కశ్యపప్రజాపతి యాశ్రమముననే ఏర్పరచుకొనుటలో నెంతటి యపురూపప్రజ్ఞ గాన బరచుచున్నాడు! ఇంతే కాదు మొదటి యాశ్రమమునకును, రెండవ యాశ్రమమునకును గల వ్యత్యాస నిరూపణముగూడ ఎంత విదగ్ధముగ నున్నది:

> "ప్రాణానా మనిలేన వృత్తి రుచితా సత్కల్పవృక్షే వనే
> తోయే కాంచనపద్మరేణుకపిశే ధర్మాభిషేకక్రియా
> ధ్యానం రత్నశిలాతలేషు విబుధస్త్రీసన్నిధౌ సంయమో
> యత్కాంక్షంతి తపోభి రన్యమునయస్తస్మిం స్తపస్యంత్యమీ"

శకుంతలాదుష్యంతుల మొదటిసంయోగమునకును కాళిదాసు

చక్కని ఆశ్రయము (Back ground) చిత్రించినాడు. ఈ రెండవ సంయోగమునకుగూడ చక్కని ఆశ్రయము (Back ground) చిత్రించు చున్నాడు కాని రెండింటికిని గల తారతమ్యము పై శ్లోకమున చక్కగ విస్పష్టపరుచుచున్నాడు. మొదటి యాశ్రమమునకిది పైయంతరువు వంటిది శకుంతలాదుష్యంతుల జీవితములోకూడ నీ ఆశ్రయము (Back ground) నకు తగిన పరిణామము గానవచ్చుచున్నది కణ్వాశ్రమమున వారు పెండ్లిపీటలమీద గూర్చుండుటకు మాత్రమే అర్హులు. కశ్యపాశ్రమమున గార్హస్థ్యమును వీడి వానప్రస్థాశ్రమమున ప్రవేశించుటకు తగిన యధికారము లభ్యమగుట సూచితమగుచున్నది చక్రవర్తి కాదగిన కుమారుని దంపతు లిరువురును చెరియొక వైపునుండి ముద్దాడుచు కశ్యపాశ్రమమునుండి నిష్క్రమించుచున్నారు ఇంతేకాదు దుష్యంతుని కణ్వాశ్రమప్రవేశమును కశ్యపాశ్రమ ప్రవేశమును గమనింపుడు మానవమాత్రుడైన సూతునితో సామాన్యరథమున ఆతడు కణ్వాశ్రమమును ప్రవేశించినాడు. దేవేంద్ర సారథియైన మాతలితో దేవతలకుసైతము దుర్లభమైన ఇంద్రుని రథమున ఆతడు కశ్యపాశ్రమమున ప్రవేశించుచున్నాడు శకుంతల పాణిగ్రహణమునకు ముందు నడచినది ఋషుల సవనరక్షణము భరతుని పాణిగ్రహణమునకు ముందు నడచినది దేవతల కభయప్రదానకరమయిన యసురవధ రెండు ఆశ్రమ ప్రవేశములకుముందును శుభనిమిత్తములు గానవచ్చినవి కాని మొదటి యాశ్రమప్రవేశ సందర్భమున "భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర" అని యాశించుటకు తగిన యుల్లాసము దుష్యంతున కున్నది. రెండవ యాశ్రమమున ప్రవేశించుటకు పూర్వమే యాతని హృదయమున నిర్వేదము ప్రవేశించినది.

"మనోరథాయ నాశంసే కిం బాహో స్పందసేవృథా
పూర్వావధీరితం శ్రేయో దుఃఖంహి పరివర్తతే"

అని యాతడు నిస్పృహతో బలుకుచున్నాడు. ఈ నిస్పృహయే

ఈ సన్నివేశమునకు ప్రాణపదము ఎదుట పుత్రుడు ప్రత్యక్షము ఐనను, ఆతడు తన పుత్రుడనుట కెన్నియో బలవత్తరములగు నిదర్శనములు గోచరించుచున్నను అన్నిటిని ఒకదానివెనుక నొకటిగ త్రోసివేయుచు దుష్యంతుడు నిస్పృహనే యాశ్రయించుచున్నాడు

భరతోత్పత్తి శాకుంతలమునకు పరమప్రాప్యమని గ్రహించి నంతనే మన రసజ్ఞత చరితార్థము కాజాలదు దీని నెంతవిదగ్ధముగ మహాకవి ప్రతిపాదించునదియుకూడ గ్రహించి యానందింపవలసి యున్నది శకుంతలాదుష్యంతుల ప్రణయమును ప్రత్యక్షవస్తువుగా జేసి దానిలో మొదటినుండి తుదివరకు శరీరము గో లావణ్యమును, పూవులో తావిని నెలకొల్పినట్లు భరతోత్పత్తిని ధ్వనిప్రధానముగ చిత్రించుకొనుచు వచ్చినాడు. ప్రధానప్రయోజనము ధ్వని నాశ్రయించుటవలననే స్థూలదృష్టికి గోచరము కాకుండుట తటస్థించుచున్నది

ధ్వనివలన రసమునకు సాంద్రత సిద్ధించును ధ్వనిలో నున్న విశేషమేమనగా వక్తవ్యాంశమును మొగము మొత్తనీయకుండ చదువరితో దోబూచులాడించుటయే కవి తన ప్రయోజనమును కుండ బ్రద్దలుకొట్టినట్లు దెసమొలగ ప్రదర్శించినచో లాభము లేదు. అట్లని "ఘూర్జరీ స్తనయుగక్రియ" నతినిగూఢ మొనర్చినను లాభము లేదు నడుమనడుమ మెరపుతీగవలె మెరయించుచు, ఆవైపునకు దృష్టిసారించునరికి మరల మాయముగావించుచు ఈరీతిని చదువరి నుఱ్ఱూటలూరింపవలెను అనగా 'స్ఫురణము' 'గోపనము' అను రెండు ప్రక్రియలను యథోచితముగ బ్రయోగించిననే ధ్వనికి కృతార్థత సిద్ధించును. భరతోత్పత్తియను నీప్రధానలక్ష్యమును ప్రదర్శించుటలో స్ఫురణము, గోపనము అను నీరెండు ధ్వనిసాధనములకు ఎట్టి ప్రసక్తి కలిగినదియు ఇంచుక సావకాశముగ విమర్శింపవలసి యున్నది

శకుంతలా వివాహమును, భరతోత్పత్తియుకూడ దుష్యంతు

నకు యదృచ్ఛాలాభములు బయలుదేరినది వేటకని, కాని ఆవేటలో ఆశ్రమమృగము ననుసరించుట తటస్థించినది దానికి వైఖానసు లడ్డు పడినారు వారి యాజ్ఞానుసారము సంధించిన నాయకము నుపసంహ రించుకొనుటవలన అతని నిగ్రహమునకు మెచ్చిన ఋషిజనులవలన చక్రవర్తి కాదగిన కుమారుని గను మను నాశీర్వాదమును, కణ్వాశ్ర మము జూచిపోవలసిన దను నాహ్వానమును లభించినవి పైనుదాహ రించిన "జన్మయస్యపురోర్వంశే" అను శ్లోకమే భరతోత్పత్తికి ప్రథమ స్ఫురణము కవి దీనినే నాటకమునకు బీజముగ గైకొనినాడు కాని ఋషుల యాశీర్వాదము ఫలించుటయెట్లు? నాకు చక్రవర్తికాజాలిన కుమారుడు గలుగుసాధన మెద్ది యని వెనువెంటనే దుష్యంతునిచే నన్వేషింపజేసినాడా, దానిలో నందము లేదు కణ్వాశ్రమమును జూచి పొమ్మను నాహ్వానములోనే—వైఖానసులే—యాసాధనమును సమకూర్చినవా రగుచున్నారు. కాని కణ్వాశ్రమమునకు ఆహ్వానించు నపుడు ఋషులకుగాని, ప్రవేశించినపుడు దుష్యంతునకుగాని, సాధనము సన్నిహితముగనే ఉన్నది అను భావము కలుగదు. ఆహ్వానించుటలో ఋషులు నిరూపించిన ప్రయోజన మిది

> "రమ్యా స్తపోధనానాం ప్రతిహతవిఘ్నాః క్రియాః సమవలోక్య
> జ్ఞాస్యసి కియద్భుజో మే రక్షతి మౌర్వీకిణాంక ఇతి."

ఇక దుష్యంతుడో, భుజ మదరుచున్నను

> "శాంతమిద మాశ్రమపదం స్ఫురతిచ బాహుః కుతః ఫలమిహాస్య?"

అని ప్రశ్నించుకొనుచునే యున్నాడు శకుంతలా దుష్యంతుల ప్రణయమును సహజగతిని బోనిచ్చి ఈ భరతోత్పత్తిని గూర్చి తరువాత నేమాత్రము ప్రసక్తి తేకుండ నాటకము నడుపుటలో ఈ యంశమునకు గోపనము సిద్ధించుచున్నది మరల తృతీయాంకమున

"పరిగ్రహబహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే
సముద్రరశనా చోర్వీ సఖీచ యువయోరియమ్"

అని దుష్యంతునిచే పలికించువరకు కవి యీ విషయమును స్ఫురణకు తెనే లేదు అంతవరకు మన హృదయము శకుంతలా దుష్యంతుల ప్రణయగాథ ననుసరించుటలోనే నిమగ్నమైనదిగాని ఋషుల యాశీర్వాద మేమైనదని ప్రశ్నించుట లేదు. పైనుదాహరించిన శ్లోకములోనైనను స్ఫురణము ఎంతో నిగూఢముగ నున్నది "మా శకుంతలను పెండ్లియాడినందులకు ఆమెపుత్రునే నీ యనంతర చక్రవర్తిగ నంగీకరింపవలసినది" అని నోరుదెరచి శకుంతలపక్షమువా రడుగ లేదు ఆమెకుమారునే పట్టాభిషిక్తుని చేసెద" నని రాజు స్పష్టముగ-వాచ్యముగ బలుక లేదు. ధ్వనిప్రధానముగ స్ఫురణమున్నది ఈ స్ఫురణమైన వెనుక మరల గోపనము సిద్ధించుచున్నది తరువాత దుర్వాసుని శాప వృత్తాంతమునందును, శకుంతలవియోగమునందును మనస్సు లగ్నమగుచున్నది. ఈ గోపనవాతావరణమున అశరీరవాణి పలికిన

"దుష్యంతే నాహితం తేజో దధానాం భూతయే భువః
అవేహి తనయాం బ్రహ్మన్నగ్నిగర్భాం శమీమివ"

అను వాక్యము మెఱపుతీగవలె మెఱయుచు కావ్యపరమార్థమును స్ఫురింపజేయుచున్నది. "జాతే వీరప్రసవినీభవ" ఇత్యాది ఋషిపత్నుల ఆశీర్వచనములనుగూడ పై శ్లోకముతో జతగూర్పవలసినదే. అయితే వెనుకటికంటె నొకమెట్టు పైకెక్కినాము. శకుంతల గర్భవతియైనట్లు పైశ్లోకమువలన దెలియుచున్నది. మరల శకుంతల కణ్వుని యొద్దనుండియు, చెలికత్తెలయొద్దనుండియు, తపోవనమునొద్దనుండియు సెలవుగైకొనునపుడు ఆ లలితవిషాదమున మనసు లగ్నమగుటచే గోపనము సిద్ధించుచున్నది.

"తాత! కదానుఖలు భూయోఽపి తపోవనం ద్రక్ష్యామి?" అని శకుంతల ప్రశ్నించినపుడుకూడ తపోవనమునందలి యామె స్నేహ

మునకు ముగ్ధులమగుచున్నాము గాని కణ్వునినోట వెలువడు సమాధానమును ముందుగ నూహింప సమర్థులము గాకపోవుచున్నాము. ఇంతవరకు పటుత్వముచూపిన గోపనతిరస్కరణి ఒక్కమారుగ

"భూత్వా చిరాయ చతురంతమహీసపత్నీ
దౌష్యంతి మప్రతిరథం తనయం ప్రసూయ
భర్త్రా తదర్పితకుటుంబభరేణ సార్ధం
శాంతే కరిష్యసి పదం పున రాశ్రమేస్మిన్"

అను కణ్వవాక్యమువలన భగ్నమైపోవుచున్నది ఈ వాక్యమున స్ఫురితమైనది శకుంతలాదుష్యంతుల వానప్రస్థాశ్రమ స్వీకరణము. అనగా భరతోత్పత్తివలన దంపతులు పొందదగిన వైహికలాభము - విశ్రాంతి. ఇటుతరువాత ఇతర విషయములలో నిమగ్నులమై పోవుచున్నాము దుష్యంతునిమోహము, శకుంతలాప్రత్యాదేశము, దుష్యంతుని స్మృతిలబ్ధియున్నగువానిలో. ఈ నడుమ "త్వంసాధుభి రాదిష్టపూర్వా ఏవ ప్రథమం చక్రవర్తినం జనయిష్యసీతి" అను వాక్యము గోపనమును ఛేదించి మన హృదయమును భరతోత్పత్తివంక కాకర్షించు నంత పటిష్ఠమైనది కాదు. అందుచే దానిని స్ఫురణముగ గ్రహింప నక్కరలేదు ఇక తరువాతి స్ఫురణము సార్థవాహ వృత్తాంతమును విని

"అస్మాత్పరం బత యథాశ్రుతి సంభృతాని కో నః కులే నివపనాని కరిష్యతీతి
నూనం ప్రసూతివికలేన మయా ప్రసిక్తం ధౌతాశ్రుశేష ముదకం పితరః పిబంతి"

అను దుష్యంతుని విలాపములోనున్నది. ఈ స్ఫురణమున వెనుకటికంటె మరల నింకొక మెట్టు పైకెక్కుచున్నాము ఈ శ్లోకమున పుత్రప్రాప్తి వలన ఆర్యులాసించు నాముష్మికలాభము స్ఫురితమైనది మరల మాతలి యాగమనము-దుష్యంతుని స్వర్గయాత్ర మున్నగు నితర విషయములలో చదువరి మగ్నుడగుచుండుటచే గోపనము సిద్ధించుచున్నది. "కిం ను ఖలు బాలేస్మి న్నౌరస ఇవ పుత్రే స్నిహ్యతి మే మనః. నూన మనపత్యతైవం వత్సలయతి" అను దుష్యంత వాక్యము వరకు ఈ యుదంతమునకు స్ఫురణము లేదు. అటుతరువాతనా స్ఫుర

ణముమీాద స్ఫురణను. ఇదియే ఈ నాటకమునకు సిద్ధావస్థ. ఇచ్చట కాళిదాసు చూపిన ప్రాగల్భ్యము ఇంచుమించుగ నతిమానుషము దీనిలోని వైదగ్ధ్యము ఘటనాశిల్పమున విమర్శితమగును గాన ఇట పునరుక్తి యనావశ్యకము

నాటకమంతయు మెఱుపుతీగలతో కట్టిన మేడ. కాళిదాసుని కళాకౌశలములోని విశేషములలో నిదియొకటి. అంతయు ధ్వని ప్రధానమైన పనివానితనము. దీర్ఘోపన్యాసములు లిం దుండవు. ఒక్క మెఱుపు మెరయగనే ప్రపంచమంతయు దృగ్గోచర మగునట్లు ఒక్కొక్క వాక్యము చదువగనే ఏదో వింతవింత సౌందర్యమయప్రపంచము దృగ్గోచర మగుచుండును. నాటకశరీర నిర్మాణమున ఆతడు చూపిన ఈ నాజూకుతనమును, ఈ శిల్పమును ఎంత మెచ్చుకొన్నను మెచ్చుకొన వలసినదే.

శాకుంతలమును గైకొన్నపుడు అందలి కథాకల్పనము అద్భుతముగ నున్నదని కాని, మిక్కిలి ప్రౌఢమనికాని వాదించుటకు వలను పడదు. వస్తువు మిక్కిలి సరళమైనది. ఒక ప్రధానవస్తు వుండి (Plot) దానిలో వేరొక యుపవస్తువుండి (Sub plot) ఈ రెండింటిని సమన్వయించుటలో నెఱజాణతనమును గానబరచినాడని వాదించుటకు కూడ వలనుపడదు. కాని సరళమైన వస్తువును ప్రపంచించుటలోనే ఎక్కడ క్లిష్టత లేకుండ చేసికొని "అహో రాగ పరిస్రావిణీ గీతిః" అని నట్లుగ రసధ్వనిని మూర్తీభవింపజేయుటలో మాత్రము ఆతని చాకచక్యము మహాకవులకు సైతము వెఱపుగొలుపజాలియున్నది.

## — ♦ ఘటనావైదగ్ధ్యము ♦ —

ఇంతవరకు నాటకమునందలి శరీరలావణ్యమును సమష్టిమీాద విమర్శించితిమి. ఒక్కొక్క యంకమునే గైకొన్నచో దానిలో ఉపాంశముల నొకదానితో వేరొకదానిని హత్తించుటలో నెంతో శిల్పకౌశల

మున్నది కదిగాక ఆయా యుదంతములను తెచ్చిపెట్టినట్లుగ గాక వానికి సహజోత్పత్తిగల్పించి ఈశ్వరసృష్టిలోనున్న భవితవ్యతను నిరూపించుటలోగూడ కాళిదాసు కడు ప్రౌఢముగ సంచరించుచున్నాడు. ఈరెండు ప్రక్రియలను మనము 'ఘటనాశిల్పము' అనుపేరుతో వ్యవహరించుకొందును. స్థూలదృష్టికి అసంభవములుగ గన్పించు ఉదంతములకు సహజోత్పత్తిని ప్రసాదించి అవియెంతయు సంభవములేయని విశ్వాసము చదువరి కుదయింపజేయుట కావ్యకళలో నొక యుత్తమ ప్రక్రియ ఈ ప్రక్రియలో షేక్సిపియరువలె కాళిదాసుకూడ కడు విదగ్ధుడనుటకు ఆతని ఘటనాచాకచక్యమే సాక్ష్యము

ఈ ఘటనాచాకచక్యమంతయు ఒకే తరగతికి జెందునదికాదు. కొంత మధ్యమతరగతికి చెందును. మిగిలినది ఉత్తమతరగతికి చెందును. ద్వితీయాంకమును గైకొందము. ఇందు ఒక దుస్సాధ్యమైన సన్నివేశము తటస్థించినది పరివార సహితముగ దుష్యంతుడాశ్రమమున చిరకాలము వసించినచో శకుంతలాదుష్యంతుల ప్రణయమున కవరోధము మాట యటుండగ తరువాతి కథాకల్పనమునకుగూడ అడ్డువచ్చును. ఎందుచేతనన, తక్కిన పరిజనులలో నెవ్వరక్కడ నున్నను రాజునకు శకుంతలా వివాహమునుగూర్చి జ్ఞప్తిచేసియుందురు కావున దుష్యంతుని ఒక్కనిని రహస్యవివాహము జరిగించుటకు ఆశ్రమమున నుంచవలెను. తక్కిన పరివారమునంతను బంపివేయవలెను దుష్యంతునకు ఆశ్రమమున కొంతకాలము నిలుచుటకైనను అవకాశము కల్పించుటకూడ దుర్ఘటమే కణ్వునియెడ తనభక్తి ప్రకటింప వచ్చినవాడు "సైవ విదిత భక్తిం మాం సుహృన్తేః కరిష్యతి" అని పలికినవెనుక నిక ఆశ్రమములో దీర్ఘకాలము నిలుచుట కవకాశమెద్ది? అందుచే సవనరక్షణార్థమై అక్కడ నుండవలసినదిగ ఋషులచే ప్రార్థింపజేసినాడు రాక్షసులబాధ మిక్కుటముగ తటస్థించినదట అయితే యీ రాక్షసులబాధ అప్పుడే తటస్థించినదా? ఇదివరలో తటస్థించినపుడెల్ల దుష్యంతుడే వచ్చి రక్షిం

చుచున్నాడా? అను ప్రశ్నలు వచ్చును దానికి "కణ్వస్య మహర్షే రసాన్నిధ్యాత్" అని సమాధానము అదివరలో మహాప్రభావుడగు కణ్వుడున్నంతకాలము వేరొకరి సాయ మక్కర లేకపోయినది.

సరే, ఋషిసవన సంరక్షణమునకు పరిజనమంతయు నున్నచో మరింత మంచిదికాదా? ఈపరిజనమును వదల్చుకొనుట యెట్లు? దీనికి వ్రతోద్యాపనవృత్తాంత మావశ్యకమయినది ఈ వృత్తాంతమువలన విదూషకసహితముగ పరిజనమునంతను వదల్చుకొనుటకు వీలిచ్చినది. ఇట్టి ఘటనములలోకూడ చాకచక్యము ప్రకటిత మగుచున్నది గాని ఈ మాత్రపు చాకచక్యము మధ్యతరగతి కవులుకూడ ప్రకటింపగలరేమో

శకుంతలా దుష్యంతుల ప్రథమసమావేశమును గైకొందము. చెలికత్తెలతో పూలమొక్కలకు నీళ్ళుపోయుచున్న శకుంతలను చెట్ల చాటునుండి రాజు చూచినాడు ఈరాజు ఆసందర్భములో స్త్రీలయెదుట బడుట అనుచితముగదా. తన బుద్ధివైభవముచే కవి దాని కవకాశము కల్పింపవలసి యున్నది ఇచ్చట భ్రమరవృత్తాంతమును గల్పించుటలో కాళిదాసుని ధీనైశిత్యమేమని కొనియాడవచ్చును? నాయికానాయకుల శృంగార సమావేశమున కిదియెంత అభ్యుచితమైన సుకుమార ప్రయోగము. విక్రమోర్వశీయమునందలి ఊర్వశీ సంరక్షణఘట్టమునకును (ప్రథమాంకము), దీనికిని గల వ్యత్యాసము చూచినచో కాళిదాసుని ధీపరిణామము గోచరించును ఇట్లే పరస్పరాసక్తులయియున్న నాయికా నాయకులను విడదీయుటకు వనగజవృత్తాంతమువంటి కరినోదంతమును గల్పించుటలోని యుచితజ్ఞతకుగూడ మెచ్చుకొనవలసి యున్నది. ఈతరగతికి చెందినదే విరహమగ్నుడగు రాజును వీరరసోన్ముఖుని గావించుటకు మాతలి యవలంబించిన యుపాయము కూడను (౬-వ అంకము)

ఇంకొక సన్నివేశమును గైకొందము. శరీరమును సయితము మరచిపోయి శకుంతల భర్తనుగూర్చి యాలోచించుచున్నది. ఆ సమ

యమున దుర్వాసుఁడు వచ్చి శాపమిచ్చి చక్కఁబోయినాఁడు శకుంతలకు ఈశాపవిషయము తెలిసినచో ఆమె యంగుళీయక విషయమున నశ్రద్ధ వహించియుండదు అందుచే నామెకీవృత్తాంతము తెలియనీయక పోవుట కథాకల్పనమున కెంతో ముఖ్యము శరీరమే మఱచిపోయిన శకుంతలకు దుర్వాసుడు వచ్చినాఁడో - శాపమిచ్చినాఁడో - మరల వెళ్లి పోయినాఁడో తెలియకపోవుటలో నాశ్చర్యములేదు కాని ఆమె చెలి కత్తెల కీవిషయము తెలియునుగదా - అంగుళీయకము శాపమోక్షణ సాధన మనికూడ వారికి తెలియునుకదా? వా రెందులకు శకుంతలతో చెప్ప లేదు?

"అనసూయా—పిఅయంవదే! ద్వయోరేవ ణౌ ముఖే ఏష వృత్తాంత స్తిష్ఠతు. రక్ఖ ణీయాఖలు పకిృతిపేశలా సఖీ

ప్రియం వదా—క ఇదానీ ముష్ణోదకేన నవమాలికాం సించతి?"

ఎంత సొగసైన సమాధానము!

సానుమతీ ప్రవేశమును గైకొందము ఇది ఎంతటి సునిశితప్రయోగము! ఈ సానుమతీ ప్రవేశముననున్న పరమార్థమేమో గ్రహింపకుండ మనము నాటకమును తిరగవేయుచుందుము శాపమువలన తటస్థించిన మోహము నశించిన వెనుక దుష్యంతుని మనఃపరిణామమును శకుంతలకు ప్రత్యక్షము గావించుటకయి కవి యీకల్పన మొనర్చి నాఁడు. శకుంతలను దుష్యంతునియొద్దకు దీసికొనివచ్చుటకు వీలు లేదు. కాని ఆమెకు దుష్యంతుని మనస్థితి చక్కఁగ విస్పష్టము కావలయును. సానుమతిని ప్రవేశపెట్టుటవలన శకుంతలను ప్రవేశపెట్టిన నేప్రయోజనము సిద్ధించునో ఆప్రయోజనమే సిద్ధించినదిగదా! సానుమతి నావహించి శకుంతల చూచుచున్నట్లయినది గదా! నికృష్టకవు లయినచో తమ ప్రయోజనములను ప్రకటించుటలో గాంభీర్యము కొఱనడునట్లు చేయుదురు. కాళిదాసన్ననో కల్పించిన వృత్తాంతములకు సహజముగ ప్రవృత్తి నొసగుచు వానిచే తానుద్దేశించిన ప్రయోజనములను నిగూ

ఢముగ సాధించుకొనుచుండును Art lies in concealing Art అను సిద్ధాంతమునకు కాళిదాసుని శాకుంతలము ప్రశస్తలక్ష్యము. ఉదంతములు స్థూలదృష్టికి నెరవేర్చు ప్రయోజనము వేరు, సూక్ష్మదృష్టికి నెరవేర్చు ప్రయోజనము వేరు ఈ రెండిటికిని పరస్పర విరోధము లేకుండ చూచుకొనుటలోనే గడుసుదనమున్నది!

పాత్రీకరణమును పరిశీలించునపుడు శార్ఙ్గరవ శారద్వతుల చిత్రణము యథార్థీకరణమున కుదాహరణగ గైకొని యానందింతుము. కాని పాత్రీకరణ వైదగ్ధ్యమునకు ముగ్ధులమై అట్టి పాత్రీకరణమువలన కథాసంవిధానమున కెట్టి మహోపకారము జరిగినదియు గుర్తింపకుండ నుండరాదు శార్ఙ్గరవశారద్వతులేమాత్రము లోకజ్ఞానము కలవారైనను శకుంతలా దుష్యంతులకు చిరవియోగము తటస్థించుట కవకాశము లేదు "కణ్వుడుమాత్రము మహర్షి కాడా? ఎన్నడు మొగమే యెఱుగని స్త్రీని స్వీకరింపవలసినదిగ నిన్ను నియోగించునా" అను నీరీతి యనునయవాక్యములకు దిగియుండినచో కొంచెము కొంచెముగ దుష్యంతుని ప్రత్యాదేశ హేతువు గోచరించియుండెడిదేమో! దుష్యంతుడు "వినిపాలము" కాంక్షించుచు శకుంతలను నిరాకరించుచున్నాడను నిశ్చయమునకు వచ్చుటవలన వారు తీవ్రస్వభావులని తేలుచున్నది లోకము నంతను దుర్మార్గులుగ ననుమానించుటయు, తామొక్కరే సత్యసంధులమని భావించుకొనుటయు గూడ ప్రాపంచికజ్ఞాన శూన్యతచేతనే. ఇంత ప్రపంచజ్ఞాన శూన్యులుగను, తీవ్రస్వభావులుగను వారిని చిత్రించుట వలన కాళిదాసు పాత్రీకరణమున యథార్థమునకు సన్నిహితముగ బోయి ఒక కళాప్రయోజనమును సాధించినవాడగుచున్నాడు అంతటితో నాగక ఘటనాశిల్పమునగూడ కథను చక్కగ సంవిధానమొనర్చుకొనుటకు దీని నుపకరణముగ గైకొని మహత్తరమైన కళాప్రయోజనము సాధించినవాడగుచున్నాడు ఇట్టి గాంభీర్యము కాళిదాసునకే చెల్లినది.

## ——♦ అంక నిర్మాణము ♦——

సంస్కృతి నాటకములలో అంకమును మరల రంగములుగ విభజించు నలవాటు లేదు ఇటీవలి పాశ్చాత్య నాటకములలోగూడ నీ యాచారమునే యవలంబించి అంకమునంతను ఏకరంగముగ జేయుచున్నారు ఒక్కొక్క యంకమునందలి ఉపాంశములను సంఘటించుటలోగూడ కాళిదాసు చక్కని శిల్పమును ప్రకటించుచున్నాడు దీనిని కూడ ఘటనాచాకచక్యములో నొకభాగముగనే గైకొనవలసియున్నది.

శాకుంతలమునందలి యంకములలో కెల్ల ఏది ఉత్తమమైనది అను ప్రశ్న రసజ్ఞులకు కలుగుట స్వాభావికము సంప్రదాయసిద్ధముగ చతుర్థాంకమున కుత్తమస్థానము లభించుచున్నది కాని నిర్మాణశిల్పమును బట్టి చూచినచో మొదటియంకమును, సప్తమాంకమును దాని కన్న మిన్నలు రససంచారమునందు మొదటియంకముకంటె నాలుగవ యంకము ఎక్కుడుపోయిని గూర్చుననుట నిర్వివాదమేగాని ఆ దృష్టిలో గూడ సప్తమాంకమున కున్న కళాగాంభీర్యము నాలుగవ యంకమునకు లేదు శాకుంతలమునందలి యంకములలో కెల్ల కిరీటధారణమున కర్హమైనది సప్తమాంకమే యని నిశ్చయించుటకు విశేషము సంశయింపవలసిన పని యుండదు

నిర్మాణ శిల్పమునందు చతుర్థాంకము వెనుకబడుచున్నదనుటకు ముఖ్యహేతువు ఇందలి యుపాంశములు చక్కని సంఘటనము నందకుండుటే శకుంతల తపోవనమునుండి సెలవు గైకొనుటయు, ఆసందర్భమున శకుంతలకు, కణ్వునికి, శకుంతల చెలికత్తెలకును గలిగిన లలిత విషాదమును ప్రదర్శించుటయు ఈయంకమునకు ముఖ్యలక్ష్యము మనుకొనుడు ఈసన్నివేశమును సావధానముగనే చిత్రించినాడు కాని శకుంతలను వివాహమాడి దుష్యంతుడు ఆమెను సగౌరవముగ తోడ్కొనివచ్చుటకయి పరివారమును బంపెదనని నమ్మించి యింతవరకు లేఖమైన వ్రాయకుండుటయు, ఆమె తదేకచింతానిమగ్న యగుటయు,

ఇంతలో దుర్వాసుడాశ్రమమునకువచ్చి యామెవలన సత్కారమును గానక శపించుటయు, సఖులిది గ్రహించి యాతని పాదములపై బడి కోపశాంతికయి ప్రయత్నించుటయు, ఆతడు శాప నిష్కృతి మార్గ ముపదేసించుటయు, కాశ్యపులు మరల ఆశ్రమమునకు వచ్చుటయు, అశరీరవాణివలన జరిగిన వృత్తాంతమంతయు దెలిసికొనుటయు, ఇంత లోనే శకుంతలను పతికడకు బంపుటకు ప్రయత్నమును మాంగల్య సమాలంభమును ఒకదాని వెనుక నొకటిగ గుదిగ్రుచ్చుటలో కాళిదాసు తొందరపడినట్లు తోచుచున్నది. కణ్వుడు శకుంతల వివాహమును గూర్చి తెలిసికొనుటకును, ఆమె నత్తవారి యింటికి బంపుటకును నడుమ కొంత యవకాశము కావలసియున్నది లేకున్న నాటకీయ విభ్రాంతి కృతార్థము కాజాలదు. అదిగాక గర్భవతిగా నుండగనే అత్తింటికి వెంటనేపంపుట కొంత అసహజముగ నున్నది.

ఉపాంశములను సంధించుటలో మొదటియంకమును, సప్త మాంకమునుగూడ మిక్కిలి ప్రౌఢములు. మొదటియంకమును గైకొం దము ఇందు (౧) మృగానుసరణము, (౨) వైఖానసాశీర్వాదము, (3) వైఖానసాహ్వానము, (౪) ఆశ్రమప్రవేశము, (౫) పరోక్షసం దర్శనము, రాగోదయము, (౬) ప్రత్యక్షీకరణము, (౭) శకుంతలా జన్మ కథనము, (౮) తాత్కాలిక వియోగము అను నుపాంశములున్నవి. ఈ యంశములన్నియు నొకదానితో నొకటి యతుకుపెట్టినట్లుగ లేకుండ వానికి సహజ పరిణామమును గల్పించుటలో కవిచాతుర్య మున్నది దుష్యంతుడును ఆతని సారథియు చేసిన వర్ణనములు, (రథ వేగ వర్ణనము, హరిణ వర్ణనము) కేవలము వర్ణనాసక్తిని నిగ్రహించు కొనలేక వ్రాసినవి కావు. వానివలన ఆశ్రమప్రవేశము యాదృచ్ఛికమని నిరూపిత మగుచున్నది. రాజు సారథిని రానీయకుండ వెనుకనే నిలది పొమ్మనుచున్నాడు. కపి కథాకల్పనకు రాజును ఒంటరిగనే ఆశ్రమ ప్రవేశము చేయింపవలసియున్నది. దీనికిసహజత్వమును ప్రతిపాదించుట

యెట్లు ? శకుంతలతో ప్రణయము సాగింపవలె నను నుద్దేశమే రాజు నకు మొదటినుండియు నున్నచో ఏదో మిషమీద సాగదీసి వారిం చినా డనిన నస్వాభావికముగ నుండదు. ఈ సన్నివేశమున నట్లుగా దే. శకుంతలను దర్శించువరకు కూడ ప్రణయ మంకురింపనేలేదు దీనికికవి "వినీతవేషప్రవేశ్యాని తపోవనాని నామ" అను దుష్యంతవాక్యములో చదువరికి సమాధానమిచ్చుచున్నాడు ఇట్లే సఖులు పలికిన "కే ఆవాం పరిత్రాతుం ? దుష్యంతమాక్రంద" అను వాక్యమును గైకొనుడు ఇది నాటకీయ రక్తి (Dramatic Irony) నిమిత్త ముద్దేశింపబడిన వాక్యము అయితే యిచ్చట దుష్యంతుని గూర్చిన ప్రసక్తి సహజముగ లేదని చదువరికి సందేహ ముదయింపవచ్చును దానికి కవి యిచ్చు సమాధానమిది "రాజరక్షితాని తపోవనాని నామ" దుష్యంతుడు రాజని శకుంతల చెలికత్తెలకు తెలియుటలో నాశ్చర్యము లేదుగదా ? అందుచే నాతడు సమీపమున నున్నాడని తెలియకపోయినను పరి హాసము నిమిత్తము "దుష్యంతునితో పోయి మొరపెట్టుకో. తపోవన మును రక్షింపవలసిన భారము రాజుదిగదా" యని పలికినారు. ఈకడ పటి వాక్యము సందర్భోచితముగ నుండుటయే కాక పరిహాసమునందలి స్వాభావికతను సమర్థించునదికూడ అయియున్నది. ఇట్లు స్థూలదృష్టికి అస్వాభివికములుగ గనవచ్చు నంశములను సూక్ష్మముగ సమర్థించు కొనుచు ఒక కెరటమునుండి ఇంకొక కెరట ముదయించునట్లుగ కథా కల్పనము సాగించినాడు

సప్తమాంకమును గైకొందము. ఇది మొదటినుండి చివరవరకు అద్భుతావహమయిన ప్రతిభతో నిండియున్నది. అంకావతరణమున స్వర్గమునుండి భూమికి దిగవచ్చుచున్న రాజును దివ్యరథముపై మాత లితో ప్రవేశపెట్టినాడు ఇక్కడ పైనుండి దిగివచ్చునపుడు భూగోళమెట్లు గనవచ్చునో చేసిన వర్ణనము మిక్కిలి ప్రశంసనీయము. మొదటియం

కములోని వర్ణనలవలె దీనికిని ఒకగొప్ప ప్రయోజన మేర్పడును. దుష్యంతుని శకుంతలతో సమావేశ పరుపవలెనను నుద్దేశము దేవతల కుండవచ్చును గాని శకుంతలా సమావేశము నిమిత్తము పోవుచున్నా నను స్పృహమాత్రము రాజునకు లేదు ఆస్పృహ లేదని నిరూపించుట కీవర్ణనము ప్రయోజనకారి అందుచేతనే " అనతి క్రమణీయాని శ్రేయాంసి " అనుటలో రాజునకు గోచరింపని యర్థమొకటి ప్రేక్షకు నకు గోచరించి నాటకీయ రిక్తని పెంపొందించుచున్నది ఈయంకమున కెల్ల ప్రాణపదము భరతదుష్యంత సమావేశము ఒకదానివెనుక నొక టిగ భరతుడు తనకుమారుడే యనుటకు దుష్యంతునికి ప్రబల నిదర్శన ములు లభించుటయును, లభించుచున్న నిదర్శనముల నన్నిటిని కాదని త్రోసివేయుటయు, తుదకు త్రోసివేయుటకు ఎంతమాత్రము వీలులేని ప్రమాణము లభించుటయు ప్రపంచించిన పద్ధతి చూడగ శబ్దమును, అను మానమునుగూడ నిరాకరించి ప్రత్యక్షమునేగాని ప్రమాణముగ నంగీ కరింపని సత్యాన్వేషకని మనస్థితి జ్ఞప్తికి వచ్చుచున్నది ఇంతటి వైద గ్ధ్యము ఈనాటకమున నైతము మరి యేసన్నివేశముననను గానము. ఇక్కడ నొక మానవస్వభావ రహస్యము గోచరించుచున్నది మానవ జీవితమున తప్పక శుభమే లభించునను నాశతో నెదురుచూచుచున్న పుడు ఘోరమైన కష్టములు ప్రత్యక్షము లగుటయు, సర్వవినాశమై పోవుచున్న దను నిస్పృహతో నెదురుచూచు చున్నపుడు అభ్యుదయ పరంపర తనంత తానుగవచ్చి వరించుటయు ననుభవైకవేద్యము

ఈ పట్టున దుష్యంతుని మనఃప్రవృత్తిని శ్రద్ధగ గమనింపవలసి యున్నది ధర్మపత్నియగు శకుంతలను, వంశోద్ధారకుడగు పుత్రుని అన్యాయముగ నిరాకరించితినే యను పశ్చాత్తాపములో నాతనిమనస్సు నిమగ్నమైయున్నది అందుచే 'సిరి రా మోకా లొడ్డువాని' వలె శ్రేయఃప్రాప్తి సూచనలు గనవచ్చుచున్నను వానిని నిరాకరించు చున్నాడు. అయితే ఇంకొక వైచిత్ర్యముకూడ నున్నది. పైకి అట్టి

సూచనలు నిరాకరించుచున్నాడే గాని ఆ మనస్సులోనే అంతర్భాగము నకు పోయినచో వానిని అంగీకరింపవలయు ననియే యున్నట్లు స్పష్ట మగును అయితే తీరా అంగీకరించిన తరువాత ఆశాభంగము సిద్ధించు నేమో యను భయముచే ప్రబల ప్రమాణము దొరకువరకు మాత్రము అంగీకరింపకూడ దనుకొన్నాడు. మిక్కిలి కష్టదశలో నున్నవారికి అభ్యు దయప్రాప్తి సూచనలు గోచరించినపుడు ఇట్టి మనఃస్థితి సహజమనుట అనుభవైకవేద్యము ఈ మనస్థితిని సోపానపరంపరగ ప్రదర్శించిన కవి ప్రతిభను గమనింతము

"మనోరథాయ నాశంసే కిం బాహో స్పందసే వృథా
పూర్వావధీరితం శ్రేయో దుఃఖం హి పరివర్తతే"

అనునది ఈ మనఃస్థితికి మొదటి సోపానము. నిరాకరించిన పత్నియు, పుత్రుడును, మరల తనకు లభించిన భాగ్యుండునని దుష్యంతున కున్నదనుటకు 'పూర్వావధీరితం శ్రేయో' అనువాక్యము నిదర్శనము. అయితే 'దుఃఖం హి పరివర్తతే' గాఢమైన ఆపదలో నిమగ్నుడయిన అతనికి మనోరథము నెరవేరుట అసంభవమను నిస్పృహ యున్నది. అందుచే 'కిం బాహో స్పందసే వృథా' యని ప్రశ్నించుచున్నాడు. సర్వదమనని చూచిన వెనుక "కిం ను ఖలు బాలేస్మిన్ ఔరసఇవ పుత్రే స్నిహ్యతి మే మనః" అని కలిగిన సందేహము రెండవమెట్టు సర్వదమనుని పుత్రునిగా నంగీకరింపుమని యంతరాత్మ ప్రోద్బలము చేయుచున్నదికాని బాహ్యాత్మ నావరించిన నిస్పృహ ననుసరించి "నూన మనపత్యతైవం వత్సలయతి" యని సమాధానము చెప్పుకొనుచున్నాడు. ఈ సమాధానముకూడ సారవంతమైనదే యనుట కవిప్రతిభకు నిదర్శ నము. కొసవరకు దుష్యంతుని మనస్సు రెండుతలల పామువలె వెనుకకు ముందుకుకూడ నడచుచున్నది. ఇట్లు నడచుటకు అవకాశమున్నదని నిరూపించుటలోనే కవియొక్క లోకజ్ఞత ప్రకాశించుచున్నది మూడవ సోపానము బాలకుడు అరచేతిని చాచినపుడు అందులో చక్రవర్తిలక్షణ

ములు గోచరించుట "కథం చక్రవర్తిలక్షణమ ప్యనేన ధార్యతే" అని దుష్యంతుడు ప్రశ్నించుకొనుచున్నాడు తనకు చక్రవర్తి యుదయించు ననికదా ఋషుల యాదేశము. అందుచే చక్రవర్తిలక్షణము లున్న యీబాలకుడు తన కుమారుడే అయియుండునని అంతరాత్మ ఘోషించు చున్నది అయినను దానిని నిరాకరించి ఆ బాలుని "మహర్షిపుత్ర" అనియే సంబోధించుచున్నాడు. మహర్షిపుత్ర అనగానే మొదటి యంక మున శకుంతల ఋషిపుత్రి గాదని తెలిసినట్లే—యీతడు మహర్షి పుత్రుడు కాడని తాపసీ వాక్యమువలన తెలిసినది

రాజా —ఆకారసదృశం చేష్టితమేవాస్య కథయతి స్థానప్రత్యయాత్తు వయ మేవం తర్కిణః"

అని చెప్పుచు బాలకుని స్పృశించినాడు. ఈ స్పర్శవలన తన దేహమున విద్యుచ్ఛక్తిసంచరించు (Electric Shock) నట్లుగ ఒక నూతనానుభవము గోచరమైనది ఈస్పర్శనసుఖ మేతరువాతిసోపానము

"అనేన కస్యాపి కులాంకురేణ స్పృష్టస్య గాత్రేషు సుఖం మమైవమ్
కాం నిర్వృతిం తస్య జనస్య కుర్యాత్ యస్యాయ మంకా త్కృతినః ప్రరూఢః"

అని యీ స్పర్శనసుఖమునుగూర్చి ఆత్మగతమున నాలోచించు చుండగా "ఆశ్చర్య మాశ్చర్యమ్" అని తాపసి యరచినది "అస్య బాలస్య తవ సంబంధసంవాదిన్యాకృతిరితి విస్మితాస్మి" అని తాపసి పలుకుట తరువాతి సోపానము అయితే ఆకారసాదృశ్యమునుబట్టియే అనుమానమును స్థిరపరచుకొనుట ప్రాజ్ఞలక్షణము కాదుగదా. అతడు పూరువంశజుడే యని తెలిసికొనుట ఇంకను పైమెట్టు. క్రమక్రమముగ బాలుడు గటికి బారెడు హెచ్చుతగ్గుగ చేరుకొనుచున్నాడు "అప్సర స్సంబంధేన అస్య బాలస్య జనన్యత్ర.. ప్రసూతా" అనునది యింకొక యాశాజననహేతువు. ఈ యప్సరసభర్తనుగూర్చి "ధర్మదారపరి త్యాగినః" అను తాపసినిందావాక్యము మరియొక సోపానము ఇన్ని ప్రబలమైన తార్కాణములు గోచరించుచున్నను ఇంకను బాహ్యాత్మలో

నాతడు "అన్యోన్యదారవ్యవహారః" అని వెనుదీయుచునే యున్నాడు. "శకుంతలాం వర్ణ్యాం పశ్య" అనినపుడు 'క్షుతవా మేఽంబా' అనిపించుటలో కవి శబ్దశ్లేషపై నాధారపడినాడు కాని ఇది తెచ్చిపెట్టి నట్లు లేక సహజముగనే యున్నది ఇక్కడికైనను రాజుసంశయము నివృత్తి కావలసియున్నది. కాని "సంతిపునర్నామధేయసాదృశ్యాని" అని సమాధానము చెప్పుకొనుటలో ఆతని నిస్పృహ ఎంత గాఢమైనదో తెలియుచున్నది ఇంతే కాదు "వయం తత్త్వాన్వేషా న్మధుకర హతా" అను వాక్యమువలన ప్రకటమగు నాతని స్వభావనైశిష్ట్యము కూడ నిరూపితమగుచున్నది. తుదకు రక్షాకరండకవృత్తాంతమువలన ప్రత్యక్షప్రమాణము లభించినది. ఇది యాయనస్థితిప్రదర్శనమునకు ఆఖరిమెట్టు దీనినైనను రాజు శోధింపక విడచిపెట్టుటలేదు "భవతీభ్యాం కదాచిదస్యా ప్రత్యక్షీకృతా విక్రియా ?" అని ప్రశ్నించి దానికికూడ సంతృప్తికరమగు సమాధానము లభించిన మీదట "కిమిదానీం పూర్ణమపి మనోరథం నాభినందామి" అని నిశ్చయాత్ముడగుచున్నాడు

ఇట్లే అంగుళీయకమును శకుంతలకు ప్రదర్శించిన విధానమున కూడ కవి చూపిన శిల్పము అనన్యసాధ్యము ఈపట్టున సాధారణముగ నితరకవులయినచో తొందరపడియుందురు శకుంతలాదుష్యంతుల పునస్సమావేశమునకు హర్షించి చదువరిహృదయ మన్యథాయత్తమై యుండుటచే "బాష్పం ప్రమృజ్య విగతానుశయో భవామి" అని దుష్యంతుడు పలికినపుడుకూడ అంగుళీయకప్రదర్శనమునకు దీనిని కవి సాధనముగ గైకొనబోవుచున్నాడని యూహింపనేరడు అందుచే 'నామముద్రాం దృష్ట్వా' అనగానే మనస్సొక్కసారిగ అద్భుతరస నిమగ్నమగును ఇట్టి యద్భుతావహశిల్పముతోడనే శాకుంతలము నందలి వస్తువంతయు సంఘటితమైనది

శాకుంతలము రసప్రధానమగు నాటకముగాని కథాప్రధానమగు

నాటకము గాదని గదా యనుకొంటిమి. కథను రసమునకు పాత్ర ప్రాయముగ చేయుటవలన కొన్ని యితర సంస్కృత నాటకములలో వలె ఇరువురు పాత్రలను ప్రవేశపెట్టి "తతస్తతః" అనుచు పరోక్ష కథనమును పెంచుకొనుచువచ్చుట ఇందు గానము శాకుంతలము రంగ భూమిపైనికూడ "జయశ్రీని" వరించుట కిది యొక హేతువు.

వివేకానందుడు శాకుంతలమునుగూర్చి ముచ్చటించుచు "It is the Taj Mahal of Dramatic Art" (శాకుంతల నాటకకళకు తాజ్‌మహాల్ వంటిది) అని ప్రశంసించెనట అట్టి ప్రశంసకు ఈ మహా ప్రబంధము ఎంతయు తగియున్నదని దాని నిర్మాణశిల్పమునకు తెప్పగ ననుసంధించిన సహృదయులు తలయూపకపోరు.



# శాకుంతల విమర్శనము

# రసవిచారము

## —♦ ప్రదర్శనసిద్ధి ♦—

ప్రాచీనసంస్కృతసాహిత్యము రెండు విభాగములు (1) వైదిక వాఙ్మయము (2) లౌకికవాఙ్మయము మొదటితరగతికి శిరోరత్నములు ఉపనిషత్తులు రెండవతరగతికి మకుటములు మహాభారతము రామాయణము మొదలగు ఇతిహాసములు ఈ రెండు విభాగములును జాతీయజీవితమున రెండు మహోద్యమములను ప్రతిబింబించుచున్నవి, ప్రథమతరగతి దర్శనోద్యమమును ద్వితీయతరగతి ప్రదర్శనోద్యమమును. మొదటితరగతిలో సత్యమును సందర్శించు తహతహకే ప్రాధాన్యము. దర్శించినసత్యమును వాక్కులకందినంతవరకు ఇతరులకు ప్రదర్శించు ప్రయత్న ముపనిషత్తులలో నున్నను దానిని సూటిగను స్పష్టముగను ప్రదర్శించుటయందే వారికి లక్ష్యముగాని ఆకర్షకముగ ప్రదర్శించు ప్రయత్న మెక్కుడుగ జరుగలేదు అందుచే దానిని దర్శనప్రధాన మనవలసి వచ్చినది 'దర్శించిన సత్యమును ప్రజాబాహుళ్యమున వ్యాపింప జేయుట ఎట్లు?' అను ప్రశ్న తరువాత నుదయించి తత్ఫలితముగ ఇతిహాసపురాణాదులు బయలుదేరినవి. రెండింటిలోను ఉత్తమ వాఙ్మయమునకు గాఢమగు సత్యదర్శనము సమానధర్మమే. ఉపనిషన్మంత్రద్రష్టల కెట్టి దర్శన మున్నదో రామాయణ రచయితకు భారత కారునికి అట్టిదర్శనమే యున్నదనుట నిశ్చయము. కాని ప్రజా బాహుళ్యమునకు సత్యమును ప్రదర్శించుసిద్ధిలో రెండవవారు పైచేయి అని చెప్పకతప్పదు.

శంకరుడు తన వ్యాఖ్యానములలో (అదే భాష్యములలో)

ఉపనిషత్తులను శ్రుతులనియు మహాభారతమును స్మృతి యనియు వ్యవహరించుచు స్మృతికంటె శ్రుతికి అధిక ప్రాధాన్యము నిచ్చినాడు. శాస్త్రదృష్ట్యా ఇప్పటికిని శ్రుతులే పరమప్రమాణములనుకొనుడు కాని కళాదృష్టితో జూచినపుడు శ్రుతులకంటె ఇతిహాసపురాణాది స్మృతిగ్రంథములే ప్రయోజనకారు లగుచున్నవి ఆంగ్లేయప్రోద్బలము ప్రారంభించుటకు పూర్వమున్న హైందవ సాహిత్య మంతయు- దేశ భాషలలోనే కానిండు- సంస్కృతములోనే కానిండు- ఇతిహాసపురాణముల మీదనే యాధారపడు చున్నది ముఖ్యముగ రామాయణము భారతము భాగవతము ఈమూడును తరువాతిసాహిత్య వంశవృక్షములకు కూటస్థు లగుచున్నవి

## —♦ ధ్వని, రసము ♦—

దర్శనసిద్ధితో తృప్తినందక ప్రాచీనమహర్షులు ప్రదర్శనసిద్ధికయి దీక్షవహించినపుడు రససిద్ధాంతము ధ్వనిసిద్ధాంతమునను రెండు అమూల్య విమర్శనసిద్ధాంతములను కనుగొనిరి ఇవి రెండును అన్యోన్యాశ్రయములు. ప్రదర్శింపదలచుకొన్న సత్యమును రమణీయముగ నొనర్చుటయే రస సిద్ధాంతమునకు పరమప్రాప్యము దానిని వ్యంగ్యమర్యాదయా స్థాపించుట అనగా రసమునకు సాంద్రత హెచ్చించుట ధ్వనిసిద్ధాంతమునకు ఉత్తమగమ్యము. ప్రత్యక్షోపదేశమును (Didactic preaching) నవీనవిమర్శకులు గర్హించుచున్నారుగదా! ప్రాచీనాలంకారికులుకూడ దాని నింతకంటెను తీవ్రముగ ఖండించిరి ఏ పరమార్థమునయిన వాచ్యముగ బోధించుటకంటె ధ్వనిప్రధానముగ సూచించుట పరమప్రయోజనకారి యని వారు ఏనాడో గుర్తించిరి సాహిత్యమును ప్రభుసమ్మితము సుహృత్సమ్మితము కాంతాసమ్మితము అని విభజించినపద్ధతి ఏనాటిదోకాని ఆనాటినుండియు వారీ యమూల్య రహస్యమును గ్రహించిరనియే నిశ్చయింప దగియున్నది.

## రామాయణ ప్రాముఖ్యము

మన కున్న కాంతాసమ్మితకావ్యములకెల్ల అగ్రేసర మని చెప్పదగినది వాల్మీకిరామాయణమే. భారతముకూడ అతిమానుష కావ్యమే యనుకొనుడు. కొన్ని కావ్యగుణములలో నిది రామాయణముకంటె మిక్కిలి గొప్పదికూడను కాని దీనిలో శాస్త్రభాగము కావ్యభాగము సరికిసరిగ తులతూగుచున్నవి. రామాయణమున నట్లుగాక కావ్యభాగమే అపారముగ విజృంభించి దానికి పూర్ణముగ కాంతాసమ్మితత్త్వమును జేకూర్చుచున్నది ఇప్పుడు వాల్మీకిరామాయణ మను పేర ప్రచారములోనున్న గ్రంథములోని వాచ్యకవిత చాలవరకు ప్రక్షిప్తమే యని నిర్ణయించుటకు ప్రబలాధారములున్నవి ప్రక్షిప్తము కాదని యంగీకరించినను ఇప్పటి గ్రంథములో కూడ వ్యంగ్యమర్యాదకే పరమప్రాధాన్యము.

## భరతశాస్త్రములు

'రస మనగా నేమి? దాని స్వరూపమెట్టిది? అను ప్రశ్నలు వచ్చినపుడు ఇప్పటికి మనకు లభ్యములగు గ్రంథములలో ప్రప్రథమమున రసమును కళాసిద్ధాంతముగ గ్రహించి ప్రచారమునకు తెచ్చినది భరతుల నాట్యశాస్త్రము. కొంతకాలమువరకు ఒక్కడే భరతు డున్నట్లుగను, అతడు వ్రాసిన నాట్యశాస్త్రముకూడ ఒక్కటే అయినట్లుగను వ్యవహరించుచువచ్చిరి. కాని 'భావప్రకాశిక' మున్నగు నాట్యశాస్త్రములను బట్టి చూచినచో భరతులు పెక్కుండ్రయినట్లును వారి నాట్యశాస్త్రములుగూడ అనేకము లయినట్లును స్పష్టమగుచున్నది - అందు కొన్ని కేవలము వచనములో నున్నట్లుకూడ తేలుచున్నది ఇపుడు భరతుని నాట్యశాస్త్రమని ప్రచారములో నున్న గ్రంథము వెనుకటి భారతీయనాట్యశాస్త్రములకు సంగ్రహరూపమనికూడ ఏర్పడుచున్నది.

"విభావానుభావ సంచారీభావ సంయోగాద్రస నిష్పత్తిః"

అనువాక్యము భరతనాట్యశాస్త్రము లోనిది. రససిద్ధాంతమున కంతకు మాతృస్థానము నలంకరించుచున్న దీవాక్యమే దీనికే తరువాతి యాలంకారికు లెన్నో విధముల నర్థముచెప్పుకొని ఎన్నోవాదములను లేవదీసిరి అనుమితివాద మని- భుక్తివాద మని- వ్యక్తివాదమని- ఒకటిరెండు కాదు, లెక్కలేనన్ని వాదములు బయలుదేరినవి అదృష్ట వశమున నీ వాదములన్నియు కాళిదాసుకు అర్వాచీనములేగాని ప్రాచీనములుగావు అందుచే నా వాదములను పరామర్శింపవలసిన బాధ్యత మనకు లేదు ఆ వాదముల పేరైన నాతడు వినియుండకపోయినను పోవచ్చును

## —♦ కాళిదాసు సిద్ధాంతములు ♦—

నాటకరచనమునుగూర్చి ఏవో కొన్ని సిద్ధాంతములు చేసికొనకుండగ కాళిదాసు నాటకరచనమున కుపక్రమింపలేదనుట సిర్వివాదము. ఆ సిద్ధాంతము లన్నిటినిగూర్చి సమగ్రముగ తెలిసికొనుట కాధారములు లేవు. "బలవదపి శిక్షితానామ్" అనుటవలన చిరకాల మాతడు నాటకరచనమునుగూర్చి యోచించి సాధనచేసి యుండవలె ననిమాత్రము నిశ్చయించి చెప్పవచ్చును

విక్రమోర్వశీయమునందలి తృతీయాంకప్రారంభమున నున్న విష్కంభమునుబట్టి భరతుడను నాట్యశాస్త్రాచార్యునిపయి కాళిదాసుకు పరమపూజ్యభావమున్నట్లు నిశ్చయింపనగును. కాని నాట్యశాస్త్రములు వ్రాసిన పెక్కండ్రు భరతులలో ఈ భరతు డెవ్వరో? కాళిదాసుని నాటికే నాట్యశాస్త్రాచార్యుడయిన భరతునినామము పుక్కిటిపురాణముల కాలవాలమయినట్లును దేవర్షిపదమును బ్రాపించినట్లునుగూడ ఊహింప దగియున్నది భరతునిమాట యెట్లున్నను ఈ విష్కంభమున నాటకప్రదర్శనమునుగూర్చి కాళిదాసుని విమర్శనసిద్ధాంత మొకటి ప్రత్యక్ష మగుచున్నది.

"గాలవ! న జానే ఆరాధితా న వేతి, తస్మిన్ పునః సరస్వతీకృత కావ్యబంధే
లక్ష్మీస్వయంవరే తేషు తేషు రసాంతరేషు తన్మయ్యాసీత్ "

ఇందులో "తేషు తేషు రసాంతరేషు తన్మయ్యాసీత్" అనువాక్యము ప్రకృతము ప్రధానము నాటకప్రదర్శనమును చూడవచ్చిన పరిషత్తును ఆయా రసములందు తన్మయము గావించుటే ప్రదర్శనమునకు పరమ గమ్యమని కాళిదాసుని సిద్ధాంత మని తెలుచున్నది సరస్వతీదేవి రచించిన "లక్ష్మీస్వయంవరము" అనునాటకమును భరతాచార్యుని శిక్షణము నందిన అప్సరసలు దేవసభలో ప్రయోగించినట్లును ఆ ప్రదర్శనమునుగూర్చి భరతుని శిష్యు లిద్దరు ముచ్చటించుకొను చున్నట్లును ఈ విష్కంభ మున్నది నాటకప్రదర్శనము దేవపరిషత్తుకు నచ్చినదా (పరిషత్తు లెస్సగ నారాధితమైనదా) లేదా అనుప్రశ్నకు పైవాక్యము సమాధానము ఇంకొకటి పార్వతీపరమేశ్వరుల వివాహమును వర్ణించు కుమారసంభవము సప్తమసర్గలో వివాహానంతరము నూతనదంపతులు అప్సరసలు ప్రదర్శించిన నాటకమొకటి చూచినారని వర్ణించుచు

తౌ సంధిషు వ్యంజితవృత్తిభేదమ్ రసాంతరేషు ప్రతిబద్ధరాగమ్,
అపశ్యతామప్సరసాం ముహూర్తే ప్రయోగమాద్యమ్ లలితాంగహారమ్.

అని యొకశ్లోకమును వ్రాసినాడు. ఇందు "సంధిషు వ్యంజితవృత్తిభేదమ్" "రసాంతరేషు ప్రతిబద్ధరాగమ్" "లలితాంగహారమ్" అని ప్రదర్శన వర్ణనమున మూడు విశేషణము లుపయోగించినాడు ఈ మూడును ప్రదర్శన మెట్లుండవలెనో సూచించునవియే యయినను నాటకరచనమున ఈ విశేషణములలో సూచించిన ప్రదర్శనలక్షణములకు అవకాశ మీయావలెనని కాళిదాసు సిద్ధాంత మైనట్లు నిర్ణయించుటకు ఎట్టి యాక్షేపణయు నుండజాలదుగదా ?

ఇదిగక మాళవికాగ్నిమిత్రమున మాళవికనృత్య మున్నదిగాని అది నాటకప్రదర్శనము గాకపోవుటచే నంత ప్రయోజనకారి కాదు "కాంతమ్ క్రతుమ్ చాక్షుషమ్" అనుటవలన నృత్యవిద్యయెడ

నాతని పూజ్యభావము మాత్రము వ్యక్తమగుచున్నది. అది నాటక ప్రదర్శనమునకుగూడ అన్వయించుకొనుట కాక్షేపణ యుండజాలదు. మాళవికలోని ప్రస్తావననుబట్టి భాసాదుల నాటకములపయి కాళిదాసుకు గౌరవ మున్నట్లు కనబడదు. ఇంతకుమించి కాళిదాసుకృతులలో నాటకరచననుగూర్చికాని ప్రదర్శనమునుగూర్చికాని అతని యభిప్రాయము లిట్టివి అని నిర్ణయించుటకు ప్రత్యక్షసాధనములు కానరావు.

పరిశోధనవలన దేలుచున్న దేమనగ రససిద్ధాంతము కాళిదాసునకు పరమప్రమాణమనియు దానిపయి నిటీవల బయలువెడలిన వాదములుమాత్ర మాతనిని స్పృశించి యుండకపోవచ్చుననియు కాళిదాసునికి పూర్వము ప్రచారములో నున్న నాట్యశాస్త్రములు ఇతరులు రచించినవికూడ ఉన్నను భరతశాస్త్రమునందే కాళిదాసునికి పూజ్యబుద్ధి యనియును.

ఇంతేకాక కాళిదాసుకు వాల్మీకిపట్ల నెట్టి గౌరవమున్నదియు రఘువంశమే ప్రత్యక్షముగ చాటుచున్నది. కవితాతత్త్వమునుబట్టి కాళిదాసును వాల్మీకి మానసపుత్రునిగ ఎంచినను ఎంచవచ్చును.

అనగా కాళిదాసు నాటకములలో-ముఖ్యముగ అతని యుత్తమ కృతియగు శాకుంతలమున- రససిద్ధాంతమునకు పరమాలంబనములగు భరతశాస్త్రసంప్రదాయములును వాల్మీకి కవితాసంప్రదాయములును సమ్మేళన మొందినవి.

## —♦ పూర్వోదాత్తము, ఉత్తరోదాత్తము ♦—

ఈ సందర్భమున రససిద్ధిలో వాల్మీకికి కాళిదాసుకు గల యపార తారతమ్యమును విస్మరింపరాదు. నన్నయభట్టారకులు సూచించినట్లు ప్రశస్తమైన కావ్యనాటకములు అన్నియు "ఉదాత్తరసాన్విత" ములుగ నుండవలెను కాని ఈ యుదాత్తతలో మరలభేదమున్నది, ఉత్తరోదాత్తత యని పూర్వోదాత్తత యని, శృంగారరసమునే గైకొందము

శాకుంతలమున శృంగారరస మున్నది భాగవతము దశమస్కంధమున శృంగారరసమున్నది శకుంతలాదుష్యంతుల ప్రణయమును రాధాకృష్ణుల ప్రణయమును ఒక్కటేనా? మన స్తత్త్వమునుబట్టి చూచినచో నీ రెండింటికిని అపార తారతమ్య మేర్పడుచున్నది. మొదటిది భోగ మయము, అనగా స్వార్థపరాయణము, రెండవది త్యాగమయము, అనగా స్వార్థశూన్యము. మొదటిది దేహాభిమాన కలుషితము రెండ వది దేహస్పృహయే లేని యాత్మికప్రణయము ఇట్టులే అతీత భూములనుండి చ్యుతినందని రామాయణమునందలి రసపోషణమునకును మానవభూముల నతిక్రమింపని రఘువంశమునందలి రసపోషణమునకును ఎంతో తారతమ్యమున్నది. ఈ తారతమ్యము అనుభవైక వేద్యము

ఈ తారతమ్యమునకు హేతువేమి అని ప్రశ్నించినచో వాల్మీ కికి సత్యము ప్రత్యక్షోపలబ్ధము. ఆతడు స్వయముగ నాత్మను అదే పరమాత్మను సందర్శించినాడు కాళిదాసు సందర్శించినట్లు కనబడదు, అనగా నాతనికి సత్యము పరోక్షోపలబ్ధము లేక విశ్వాసోపలబ్ధము అనియే చెప్పవలసియున్నది వేదశాస్త్రములను పఠించిగాని పెద్దలవలన విని గాని ఆతడు సత్యమును విశ్వసించుచున్నాడే గాని చిత్రించు సత్య మాతనికి ప్రత్యక్షోపలబ్ధము కాదు. సత్య సందర్శన మయిన వెనుక పోషించురసమును ఉత్తరోదాత్త మనియు అంతకుపూర్వము పోషించురసమును పూర్వోదాత్త మనియు పేర్కొనవచ్చును. కాళి దాసుకంటె వాల్మీకి పూర్వుడు గనుక నంధవిశ్వాసముచే నీ విభజ నము జరుగుటలేదు. కాళిదాసుకు తరువాత వచ్చిన కృష్ణకర్ణా మృతము కూడ ఉత్తరోదాత్తరసాన్వితమే. సంస్కృతమున నుత్తరో దాత్తరసాన్వితములలో కలంకారమయిన శ్రీమద్భాగవతము కాళిదాసుకు తరువాతి గ్రంథమే యని కొందరి మతము. దేశభాషలలో సహితము నుత్తరోదాత్తరసాన్వితము లున్నవి. తమిళములో ఆండాళ్లమ్మ తిరుప్పావై" హిందీలో మీరాబాయి "భజనావళి" తులసీదాసు

"రామాయణము" తెనుగులో తిక్కన భారతము నుత్తరోదాత్త రసాన్వితములే ఇంకను ఇట్టివి చాల కావ్యములున్నవి. ఉదాహరణకయి కొన్నిటినిమాత్రము పేర్కొనవలసి వచ్చినది

—♦ భావన, యౌగికదర్శనము ♦—

సత్యద్రష్టయయినకవికి యౌగికదర్శనము రసనిర్వహణసాధనము. దర్శనములేనికవికి భావనాబలమే యాధారము సాధనభేదమునుబట్టి ప్రయోజనసిద్ధిలో నెంతో తారతమ్యమేర్పడును ఉత్తరోదాత్తరచనములలో నున్న చైతన్యసాంద్రత పూర్వోదాత్తములలో నుండదు చైతన్య మనగా చిత్తమును కదలించేశక్తి రామాయణములో నొక్క శ్లోకమునకున్న చైతన్యశక్తి రఘువంశమునకంతకును లేదనిన నతిశయోక్తి గానేరదు పరిణతినందిన రసజ్ఞులు దీని యాథార్థ్యము నంగీకరింపగలరు.

—♦ రసనిర్వచనము ♦—

ఇంతకును రసనిర్వచనము తేలనే లేదని కొందరు శంకింపవచ్చును. రసము అనిర్వచనీయము అనుభవైకవేద్యము ననుటకంటె జేయగలిగినపని కనబడదు రసనిర్వచనమునుగూర్చి ఎందరో యాలంకారికులు కృషిచేసిరి కృతార్థులయినట్లుమాత్రము తోచదు.

"విభావానుభావ సంచారీభావ సంయోగాద్రస నిష్పత్తిః"

అనుమాత్రము రసనిర్వచనము అని పెక్కండ్రు భ్రమపడిరి నిజమునకు ఇది రసనిష్పత్తిక్రమమును పేర్కొనుచున్నదేగాని రసమును నిర్వచించుటలేదు. రంగభూమిపై విభావానుభావ సంచారీభావములు సమ్యక్ యోగము నందినపుడు సామాజికుని (ప్రేక్షకుని) హృదయమున రసనిష్పత్తి యగుచున్నదని పైవాక్యమునందలి అభిప్రాయము. నాటకప్రదర్శనమున కన్వయించు దీనిని దీసికొనిపోయి తరువాతివారు శ్రవ్యకావ్య విమర్శనములో జొప్పించుకొన్నారు శ్రవ్యకావ్యములలో ననుభావములను వర్ణించి చెప్పవలసినదేగాని నాటకప్రదర్శనములలో

వలె ప్రత్యక్షపరచుటకు వీలు లేదుకదా! నిజమునకు నాట్యకళ యంతయు ననుభావాశ్రయమేగదా!

"రసో వై సః" అను శ్రుతిలో నున్న రసశబ్దము లలితకళలలోని రసమునకు అన్వయింపదని కొందరి మతము. అన్వయించు ననుకొన్నను ఈ వాక్యము రసమాహాత్మ్యమును వర్ణించుచున్నదిగాని రసమును నిర్వచించుట లేదు

"యోగము" అనుపదమును సాధనము సాధ్యము అను రెండర్థము లందును వాడినట్లె రసమునుకూడ వాడుట కలదు "రసో వై స బ్రహ్మచారీ బ్రహ్మ" ఇత్యాది వాక్యములలో కావ్యజన్యానందమునకు పర్యాయపదముగ రసశబ్దమును వాడినట్లు గనవచ్చు చున్నది. కావ్యజన్యానందమునకు ఒక్క రసముమాత్రమే గాక పాత్రీకరణము వస్తు నిర్వహణము మున్నగు కావ్యగుణము లన్నియు సాధనము లగుచున్నవి అందుచే భరతాచార్యులమతము ననుసరించి విభావానుభావ సంచారీభావ సంయోగమున నుదయించు ననుభూతినే రసముగ గ్రహించుట యుక్తము అనగా రసమునకు కావ్యజన్యానందమునకు సాధనసాధ్యభేద మేర్పరచుకొని వ్యవహరించుటయే యనువుగ గనవచ్చుచున్నది రమణీయభావ సంయోగము రసమునకు ప్రధాన లక్షణముగ నిర్ణయింపవచ్చును

'రసమువలన నుదయించు నానందస్వరూప మెట్టిది?' అను ప్రశ్న వచ్చినప్పుడు కొందరు ఇది బ్రహ్మానందమునకు సన్నిహితమనిరి కాని మరికొందరు, "బ్రహ్మానంద మనిన నెవ్వరికో గాని గోచరింపని యనుభవము రసానందము సార్వజనీన మగుటచే విషయానందమునకు సన్నిహితము" అనిరి నిజమునకు ఉదాత్తనుబట్టియు ఉత్తేజకత్వమును బట్టియు ఇది బ్రహ్మానందమునకు సన్నిహితమనియు సార్వజనీనతనుబట్టి యిది విషయానందమునకు సన్నిహిత మనియు సమన్వయించుట సమంజసము

## —♦ రసము అలౌకికము ♦—

సన్నిహిత మనగనే విషయానందము నిదియు ఒక్కటేయని భ్రమింపరాదు. పెక్కండ్రు పాశ్చాత్యకవులును విమర్శకులును ఇటీవల నన్ని దేశములయందలి కొందఱు రచయితలును కావ్యరసమునకు లోకరసమునకు మన యాలంకారికులు నిర్ణయించిన స్వరూపభేదమును గుర్తింపనేరక తప్పుత్రోవలు త్రొక్కిరి, త్రొక్కుచున్నారు.

లోకమున పుత్రుని గోల్పోయిన తలిదండ్రులు విలపించుచుండగ నొక్కనిమిషమైన నక్కడ నిలువలేము. కావ్యమున నభిమన్యుని గోల్పోయిన సుభద్రార్జునుల విలాపమును పదేపదే చదువుకొని యానందించుచున్నాము. కవి ప్రపంచించుచున్నది లోకరసమే యైనచో నీయానందము రాదు. ఇది వాస్తవమేయని భ్రాంతిపుట్టించుటకయి లోకమునకు సన్నిహితముగ సంచరించినను అలౌకిక మైన చక్షువుతో దృశ్యము నతిక్రమించి సత్యము నుపలబ్ధినొంది ఆసత్యమును రసప్లుతము గావించి కవి మన కందిచ్చుచున్నాడు. అనగా కవిప్రతిభవలన లోకరసములోని జుగుప్స నశించి లోకరసము కావ్యరసముగా మారుచున్నది దీనినే యానందవర్ధనాచార్యులవారు

> దృష్టపూర్వాఽపిహ్యర్థా కావ్యే రసపరిగ్రహాత్,
> సర్వే నవా ఇవాఽభాన్తి మధుమాస ఇవద్రుమాః॥

అని చక్కగ సూత్రీకరించినారు.

లోకరసమును కావ్యరసముగ నెన్నడు భ్రమింపని కవిశేఖరులలో కాళిదా సొక్కడు షేక్స్పియరు పా వంటి యుపజ్ఞాశాలురే లోకరసమును కావ్యరసముగ గైకొని భ్రమించిన ఘట్టము లున్నప్పుడు కాళిదాసుని దెంతటి నిశితప్రజ్ఞయో విస్పష్టము కాగలదు. కాళిదాసు రచించిన మూడునాటకములలోను ఉదాత్తమైన కావ్యరసమే ఎల్లెడల ప్రత్యక్షమగుచున్నను మాళవికలో రసము కొంతవరకు

పలుచగ నున్నదని చెప్పకతప్పదు ఊర్వశీయమున నంతకంటె సాంద్ర మాగను ఉజ్వలముగను ఉన్నను శాకుంతలమునందలి రసముతో తుల తూగలేదు.

## — ♦ రసప్రయోజనము అపరిహార్యము ♦ —

మనస్సును ఉత్తమభూములకు గొనిపోయి నీచసంస్కారము లను నశింపజేయుటలో రసమున కున్నశక్తి అప్రతిమానమని ప్రాచీ నులు కనుగొనిన అమూల్యరహస్యములలో నొక్కటి. శాస్త్రము తిక్త మగు నౌషధము వంటిది కావ్యము రసప్లుతమగుటచే ఆస్వాదనీయమగు నాహారమువంటిది భవరోగము శాంతించినవెనుక శాస్త్ర మప్రయో జనమగుచున్నది ఈశ్వర సందర్శనమును బడసినవారికిగూడ రసము ఆస్వాదనీయ మగుచున్నది శ్రీకృష్ణుని యపరావతారమని బుధు లారాధించు శ్రీచైతన్యమహాప్రభువు చివరవరకు కావ్యరసము నభిమా నించుచునే యుండువాడు. దక్షిణయాత్రకు వచ్చినపుడు కృష్ణకర్ణా మృతమును గాంచి యాతడు పొందిన ఆనందమునకు మేరలేదు తిరిగి పూరీ (శ్రీజగన్నాథము) పోయినపుడు "మాకేమి దెచ్చితి" రని భక్తులు ప్రశ్నింపగ "కర్ణామృతమును దెచ్చితి" నని తాను వ్రాయించుకొని వచ్చిన ప్రతిని వారికి సమర్పించెను. ఇట్లే పరమభక్తులగు మహాప్రభువు శిష్యులు కూడ కావ్యరసము నభిమానించి "విదగ్ధమాధవము" "లలిత మాధవము" మున్నగు నాటకములను ప్రేమభక్తి యుదయించినవెనుక రచించిరి.

పూర్వోదాత్తములు ఉత్తరోదాత్తములంత ప్రయోజనకారులు కాంపోయినను మనస్సుకు ఆరోగ్యదాయకమగు వినోదమును గల్పిం చుటచేతను వినోదద్వారమున చిత్తము నున్నతభూములకు గొనిపోవుట వలనను ఇవికూడ మహోపకారు లగుచున్నవి

## —◆ ర సై క్య ము ◆—

శాకుంతలమున రసైక్యము అను నొకగొప్ప గుణమున్నది

"రసైక్యము" అనుశబ్దము వాడకున్నను ప్రాచీనాలంకారికులు కొందరు కవి రసవిరోధము రాకుండ జూచుకొనవలె ననుటలో రసైక్యమును కొంతవరకు సూచించినవా రగుచున్నారు అంగిరసమునకు అంగరసములకు పరస్పరసహిష్ణుత్వము లేకపోయినపుడు రసవిరోధము వాటిల్లుననియు సుకవి యిది పరిహరించుకొనవలెననియు వారి యాదేశము. అంగిరసస్వభావము అంగరసస్వభావము పరస్పర సహిష్ణుత్వము కలిగి యుండవలెననుట ఒకటి అంతేకాక పరిమాణ మందుకూడ అంగరసములలో నేయొక్కటియు అతిమాత్రముగ విజృంభించి అంగిరసమునకు భంగము తేకూడదనుట మరియొకటి. ఈ రెండును రసైక్యసిద్ధాంతమున నంతర్భూత మగుచున్నవి

ప్రకృతము ప్రతిపాద్యమగు రసైక్యగుణము ఇంకను దూరవ్యాప్తి నందుచున్నది. కావ్యమునందలి రసస్వరూపమునుబట్టి కావ్యమునందలి ఇతరగుణముల స్వరూపము నిర్ణీతమగుటయే యిందలి రహస్యము శాకుంతలమునందలి రసపోషణము బహులలితమయినది లాలిత్యమును కళాదృష్టినై కాళిదాసుని తాత్త్వికగుణముగ నిర్ణయింపవచ్చును లలితమయిన రసపోషణకు అనుగుణముగ వస్తునిర్వహణము పాత్రీకరణము పద్యరచనము వచనరచనము లాలిత్యమునే వహించినచో రసైక్యము సిద్ధించును. కళాపూర్ణోదయములో నున్నట్లు గంభీరవస్తువుగాని శకుంతలోపాఖ్యానమున నున్నట్లు శక్త (Vigour) మయ వస్తువుగాని ఈ నాటకమునందలి రసైక్యమునకు భంగము తెచ్చియుండును శకుంతలోపాఖ్యానమునందలి వస్తువును ఎంత లాలిత్యమయముగ కాళిదాసు మార్చుకొని వచ్చినాడో "శాకుంతలము శకుంతలోపాఖ్యానము" అను వ్యాసమున విపులీకృతమగును. భారత పాత్రీకరణమున నున్న యథార్థ

ప్రదర్శన మైనచో ఇంకలి రసలాలిత్యమునకు విరోధించి యుండును. అందుచేతనే కాళిదాసు ఆదర్శీకరణము నవలంబింపనలసిన వాడాయెను (పాత్రీకరణమను వ్యాసమును చూడనగును). ఇట్లే శైలివిషయమున గూడ కాళిదాసు పద్యరచనము వచనరచనము అత్యంత లలితములు అందుచే రసస్వరూపములో లెస్సగ లీనమగుచున్నవి. అన్వయకాఠిన్య మున్నట్టిగాని ఓజోగుణ ప్రధానమయినట్టిగాని శయ్య నాడినచో రసైక్యము సిద్ధించి యుండదు మయూరుని సూర్యశతకమునందలి పద్య రచనగాని కృష్ణరాయని ఆముక్తమాల్యదలోని పద్యశైలిగాని తుదకు తిక్కన భారతపద్యశైలిగాని శాకుంతలమునందు ప్రత్యక్షమగు రస లాలిత్యముతో నేకీభవింపదు వస్తునిర్మాణము పాత్రీకరణము పద్యరచ నము వచనరచనము మున్నగు నితర కావ్యగుణములన్నియు నదులు సము ద్రములో నంతర్భూతములయినట్లు తక్కిన రంగులన్నియు తెలుపురం గులో నంతర్భూతములైనట్లు రసమున లీనము కాజాలినప్పుడే రసైక్యము సిద్ధించుచున్నది

అట్టి రసైక్యము శాకుంతలమున పూర్ణసిద్ధివహించి ప్రత్యక్షమగు చున్నది ఇది యీ కావ్యమునకు ప్రత్యేక వైశిష్ట్యమును సంపాదించు గుణము శాకుంతలపరిశిలకు తక్కిన కావ్యగుణము లెవ్వి యర్థమైనను గాకున్నను రసస్వరూపము అర్థమైతీరవలెను. రసముమీదనే తక్కిన కావ్యగుణము లన్నియు ఆధారపడి రసములోనె అంతర్భూతము లగు చున్నవి కావున.

## —◆ సాత్త్వికము ◆—

షేక్స్పియరునాటకములలో ముఖ్యముగ నతని ట్రాజెడీలలో రసము ఝుంఝూమారుతమై విజృంభించును భవభూతి ఉత్తరరామ చరిత్రమునకూడ నంతే. కరుణరసము గావున నదియట్లు విజృంభించిన దనుకొనుటకు వీలులేదు. వాల్మీకి రామాయణమునగూడ కరుణరసము

ప్రత్యక్ష మగుటలేదా? అది షేక్స్పియరు చేతిలోను భవభూతి చేతిలోను నడచినట్లే నడచినదా?

శాకుంతలమునందలి రససంచారము మిక్కిలి సాత్త్వికము ఇది శృంగారరసము గనుక నట్లు సంచరించిన దని పొరపడరాదు శృంగారప్రధానములయిన కావ్యములలోగూడ రజోగుణప్రధానమైనట్టియు తమోగుణప్రధానమైనట్టియు రససంచారము లేదా? బిల్హణీయము తారాశశాంకము మున్నగు గ్రంథము లీయంశమును స్పష్టపరుపవా? హృదయగతులకు అనారోగ్యకరమైన భావ మొక్కటియు శాకుంతలమున ప్రత్యక్ష మగుటలేదు కాళిదాసుని రసము సహృదయుని రసమయతనువునకు మలయమారుతమువలె సోకి ఎంతో హాయిని గూర్చును ఇంత చక్కని సాత్త్వికసంచారముగలిగిన రసపోషణము మిక్కిలి అరుదు- ఉత్తమకృతులలోగూడ

## సుపుష్టము

సాత్త్విక మొనరింపవలెనను ప్రయత్నమున కొందరు రసమును దుర్బలముగ నొనరింతురు ఏమాత్రము శ్రమచేసినను శరీరము మోసెక్కిపోవు ననుభయముచే వ్యాయామ మేమియు లేక కృశించు నందగత్తెలవలె నట్టిరసము అస్థిరాస్థివిచికిత్సా హేతువగును కాళిదాసుని రసపోష మట్టిది కాదు అది సుపుష్టమై యలరారుచున్నది ఒకవంక సాత్త్వికతాసరిహద్దులను దాటకుండ జూచుకొనుచు ఇంకొక వంక దౌర్బల్యమునకు తావీయకుండ గాపాడుకొనుట కవికి అసిధారావ్రతమే

## రససంచరణసాధనములు

రససంచరణసాధనములు ఆయాకవుల ప్రతిభావైశిష్ట్యమునుబట్టి మారుచుండును. అందరికిని సామాన్యమార్గము లెవ్వరును నిర్ణయింపజాలరు

కాళిదాసు అవలంబించిన సాధనములు కొన్ని మిక్కిలి యద్భుతావహ మైనవి శకుంతలాదుష్యంతుల ప్రథమసమావేశమును గైకొందము నాయికను యించుమించుగ మూకీభావమును వహింపజేసి అతడు రససంచారము గావించినాడు

రాజా —(శకుంతలాభిముఖో భూత్వా) అపి నామ తపోవర్ధతే ?
శకుంతలా —(సాధ్వసా దవచనా తిష్ఠతి)
ఇట్లే తరువాతకూడ
అనసూయా —సనాథా ఇదానీం ధర్మచారిణః
శకుంతలా —(శృంగారలజ్జాం నిరూపయతి.)
మరికొంతదూరము పోయిన వెనుక
రాజా —ఉపపద్యతే
మానుషీషు కథం వా స్యాదస్య రూపస్యసంభవః
న ప్రభాతరలం జ్యోతిరుదేతి వసుధాతలాత్
శకుంతలా —(అధోముఖి తిష్ఠతి)
ఇంకను కొంతదూరము పోయిన వెనుక
ప్రియంవదా.—(సస్మితం శకుంతలాం విలోక్య నాయకాభిముఖీభూత్వా) కిం పునరపి వక్తుకాను ఇవార్యః ?
శకుంతలా —(సఖీమఙ్గుళ్యా తర్జయతి)

ఈ తీరుగ నీ ఘట్టమున శకుంతలపక్షమున రంగసూచనల మూలముననే రసపోషణము గావించుకొని వచ్చినాడు శకుంతల ఊర్వశివలె ముందుకు చొరుచుకొనివచ్చునది కాదు మాటగత్తెయు గాదు శృంగారభావములు మనస్సులో నుదయింపగనే ఇవి ఆశ్రమ జీవితమునకు విరుద్ధములని భయపడు నంతటి ముద్దరాలు. అట్టి యమాయకహృదయ నీ తీరున మూకీభావము వహింపజేసి చిత్రించుటలో నౌచిత్యము కృతార్థ మగుచున్నది ఈ యౌచిత్యము ననుసంధించినపుడు రసోదయ మగుచున్నది

శకుంతల మూకీభావమునహించుటలో నెంత యందమున్నదో

అనసూయాప్రియంవదలు వాచాలత ప్రకటించుటలోకూడ నంత యుండమున్నది వారుమాత్రము తపోవనవర్ధితలు గారా? ఒక్క చోటనే పెరిగినను అందరకు ఒక్కస్వభావ మలవడదుగదా! కొందరు మాటకారు లుందురు. మరికొందరు మౌనప్రియు లుందురు అంతేకాక శకుంతల కయిన భావోదయము వారికి కాలేదుగా! అందుచే చలాకిగా మాటాడుచున్నారు ఈపట్టున శకుంతలమౌన మెంతరసోద్బోధకమో పరిహాసములతోడను కుహనాకలహములతోడను వృత్తాంతకథనముల తోడను నిండిన వారి మాటకారితనమును అంత రసోద్బోధకమే

ఒక్కొక్కప్పుడు వక్రోక్తి ఎంతో రససంచరణసాధన మగు చున్నది మూడవయంకమున లతామంటపమున చెలికత్తెలతో ముచ్చటించుకొనుచున్న శకుంతలను రాజు సమీపింపగనే చెలికత్తె లిరువురును

ఉభే —(విలోక్యసహర్షం) స్వాగత మవిలమ్బితో మనోరథస్య.

అనుట ఎంతో రసోద్బోధకముగ నున్నది ఇచ్చట "ఆర్యులకు స్వాగతము" అనియో "ప్రియవయస్యునికి స్వాగత" మనియో సామాన్యకవి రచించియుండును దుష్యంతుని "విలంబనమొనర్పని మనోరథము" గా వర్ణించుటలో నెంత రసమున్నది! ఇట్టి రసవద్వాక్య ములు శాకుంతలములో పుంఖానుపుంఖములు

కాళిదా సుపయోగించిన రససంచరణసాధనములలో "ధ్వని" యగ్రస్థానమును వహించుచున్నది ఇంచుమించుగ శాకుంతలము నంతను దీనికి నిదర్శనముగ జేయవచ్చును ప్రతివాక్యమునందును వాచ్యార్థములకంటె వ్యంగ్యార్థములు బహుముఖముల సంచరించు చుండును

అనసూయాప్రియంవదే (సఖ్యౌ) —(ఉభయోరాకారం విదిత్వా) సఖి శకున్తలే
యద్యత్ర తాతః సన్నిహితో భవేత్.

శకున్తలా —(సరోషమ్) తతః కిం భవేత్ ?
సఖ్యౌ —ఇమం జీవితసర్వస్వేనా ప్యతిథిం కృతార్థీకరిష్యతి

ఇక్కడ "జీవితసర్వస్వ" మనుటలో వారిసర్వస్వమును ధారపోసి అతిథిని తృప్తిపరచియుందు రని వాచ్యార్థము వారి జీవితసర్వస్వము శకుంతల ("సకులపతే రుచ్ఛ్వసితమ్") ఆమెను అతిథికర్పించి యుందు రని వ్యంగ్యచమత్కృతి

అనౌచిత్యమును పరిహరించుపట్ల నీధ్వని కాళిదాసునకు పరమ బాంధవ్యము నెరపుచున్నది మూలములో శకుంతలజన్మకథను శకుం తలచేతనే దుష్యంతునికి చెప్పించినాడు అందులో కొంతవర్ణనము అసభ్యముగకూడ నున్నది. కాశ్యపులు వేరొక మునికి చెప్పినకథను శకుంతల "తుచ" లు తప్పకుండ ననువదించినదన్నను అనౌచిత్యము పరిహృతము కాలేదు నాటకములో చెలికత్తెచే చెప్పించుచున్నను

అనసూయా — తతో వసన్తోదారసమయే తస్యా ఉన్మాదయితృకం రూపం ప్రేక్ష్య
(ఇత్యర్థోక్తే లజ్జయా విరమతి)
రాజా — పరస్తాదవగమ్యత ఏవ.

అని ధ్వనిప్రధానముగ కాళిదాసు నిర్వహించినాడు ఈధ్వనివలన మేనకావిశ్వామిత్రుల సంభోగవర్ణనము పరిహృత మగుచున్నది

మూలమున "నా కుమారుని యౌవరాజ్యమిచ్చుట కంగీకరించి నచో నేను నిన్ను వివాహమాడెదను" అని దుష్యంతునితో శకుంత లచే ననిపించినాడు. అదియొక దృక్పథమున సమంజస మనుకొనుడు. కాని కాళిదాసు అట్లు వాచ్యముగ నడిగింపక తృతీయాంకమున

అనసూయా — వయస్య బహువల్లభాః రాజానః శ్రూయన్తే యథా నౌ ప్రియసఖీ బంధుజనశోచనీయా నభవతి తథా నిర్వాహస్వ

అని ధ్వనిప్రధానముగ నడిగించి దానికి దుష్యంతునిచేత

దుష్యన్తః — భద్రే కిం బహునా ?

పరిగ్రహబహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే
సముద్రరశనా చోర్వీ సఖీ చ యువయోరియమ్

అని ధ్వని ప్రధానముగనే సమాధానము చెప్పించినాడు ఔచిత్యభంగము వాటిల్లిన రసభంగ మగుననుట సువిదితమే కాదా. అందుచే నీ కావ్యమున ధ్వని రసమునకు జనకస్థాన మగుటయేగాక రక్షకస్థానము గూడ నగుచున్నది.

రసపోషణములో నిగ్రహముచూపి అత్యంతధ్వనిప్రధానముగను లలితముగను చిత్రించుకొనివచ్చినది శకుంతలాదుష్యంతుల రహస్యసమావేశమును ఔచిత్యము నతిక్రమించుటకు ఇది మిక్కిలి వాటమైన సన్నివేశము. ఎట్టి మహాకవినయినను లోలునిగా చేయజాలిన ఘట్టమది ఇది సూచనప్రధానముగనే చిత్రించుట కాళిదాసుని కళాకౌశలమునకు విజయభేరి

ముహురంగుళిసంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షరవిక్లబాభిరామమ్
ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమప్యున్నమితం న చుమ్బితం తు.
(అం. 3 శ్లో 22)

అంగిరసపోషణముననేగాక అంగరసపోషణముననగూడ నీ లాలిత్యము నీనిగ్రహము ఎంతో రమణీయములుగ ప్రత్యక్ష మగుచున్నవి. చతుర్థాంకమున "యాస్యత్యద్యశకుంతలేతి" "పాతుంనప్రథమమ్" ఇత్యాది సుప్రసిద్ధశ్లోకములమాట యటుండగా చిన్నచిన్న శ్లోకములలోగూడ విషాదమెంత లాలిత్యమును వహించుచున్నది!

శమమేష్యతి మే శోకః కథం ను వత్సే త్వయా రచిత పూర్వమ్
ఉటజద్వారనిరూఢమ్ నీవారబలిం విలోకయతః॥ అం. 4. శ్లో 20

ఇట్లే సప్తమాంకమున వాత్సల్యరసముగూడ.

అనేన కస్యాపి కులాంకురేణ
స్పృష్టస్య గాత్రేషు సుఖం మమైవమ్
కాం నిర్వృతిం తస్యక్షిజనస్య కుర్యాద్
యస్యాయమంగాత్ కృతినః ప్రరూఢః అం 7 శ్లో ౧౯

ఆలక్ష్యదంతముకులా ననిమిత్తహాసై
రవ్యక్తవర్ణరమణీయ వచఃప్రవృత్తీన్
అంకాశ్రయప్రణయి నస్తనయాన్ వహంతో
ధన్యాస్తదంగరజసా మలినీ భవన్తి అం 7. శ్లో 17

వివాదఘట్టమగు పంచమాంకమున, పశ్చాత్తాపము తీవ్రదశలో ప్రత్యక్షమగు షష్ఠాంకమునగూడ రసపోషణము తనలాలిత్యమును వీడకున్నది రసపోషణము అత్యంత లలితముగ నుండవలెనను నాదర్శము కాళిదాసునికి మన మారోపించుగుణము కాదనియు అది యాతనిచే పూర్ణముగ నుద్దిష్టమయినగుణమే యనియు నిరూపించుటకు వెనుక నుదహరించిన కుమారసంభవములోని శ్లోకములోని "లలితాంగహారమ్" అను విశేషణము ప్రబలాధారము రసపోషణము లలితముగ నున్నప్పుడే నటుని యంగవిక్షేపము లలితమగుటకు కవి యవకాశము కల్పించినవాడగుచున్నాడుగదా!

ఇంకొక్క విశేష మీ సందర్భమున గమనింప వలసియున్నది. భారతములోని శకుంతలోపాఖ్యానమునకు ప్రధానరసము వీరరసము. శృంగారరసము కాదు యుద్ధము సంభవించినపుడే వీరరసమునకు ప్రసక్తి యని స్థూలదృష్టులు భ్రమపడు చుందురు. ఉత్సాహము స్థాయిగాగల భావవిజృంభణ మెచ్చట నున్నను అది వీరరసమే ఈ తీరుగ జూచుకొన్నచో దేశాభిమాన పూరితములగుకృతులు వీరరస ప్రధానములే. పండితుల వాగ్యుద్ధములకుగూడ నాలంకారిక ముద్ర వైచుటకు గాబోలును పండితరాయలవారు "పాండిత్య వీర" మని వీరరసములో నొకవిభాగమును చేర్కొనుచున్నారు. శకుంతలోపాఖ్యానమున ప్రత్యక్షమగుచున్న ప్రధానరసము ధర్మవీరము

ఉపాఖ్యానములోని ప్రధానఘట్టము శకుంతలాదుష్యంతుల వివాదము గదా! అది వీరరసప్రధానముగ నుండుటలో నాశ్చర్యము లేదు గాని వారివివాహమునుగూడ మూలములో ధర్మవీరరస ప్రధానముగ చిత్రించినాడు.

యది ధర్మపథ స్త్వేష యది చాత్మాప్రభు ర్మమ
ప్రదానే పౌరవశ్రేష్ఠ శ్రుణు మే సమయం ప్రభో

శాకుంతలము శృంగారరసప్రధానమని స్థాపించుటకు శ్రమ మక్కర లేదు. విశేష మేమనగ వీరరసప్రధానముగ నుండవలసిన వివాద ఘట్టమునకు ప్రాధాన్యము లేకుండ జేయుటయే గాక ఉన్నంతవరకయి నను ఆ ఘట్టమునగూడ శృంగారరసోద్బోధకము లయిన భావములకే ప్రసక్తి గల్పించుచున్నాడు.

మయ్యేవ విస్మరణ దారుణచిత్తవృత్తౌ వృత్తం రహః ప్రణయమప్రతిపద్యమానే
భేదాద్భ్రువోః కుటిలయోరతి లోహితాక్ష్యా భగ్నం శరాసనమివాతిరుషా స్మరస్య.

శృంగారరసము ప్రాయికముగా కాళిదాసుని కృతులన్నిటిలోను ప్రాముఖ్యము వహించుచున్నది. మూడునాటకములలోను ప్రధాన రసము శృంగారరసమేగదా! ఋతుసంహారమున మేఘదూతనుగూడ శృంగారరసమే ప్రధానరస మనుట నిర్వివాదము. కుమారసంభవమున కాళిదాసు రచితభాగమున రతివిలాపాదులు కరుణరసమయముగ నున్నను ప్రధానరసము శృంగారరసమే యగుచున్నది. రఘువంశమున మాత్రము పెక్కురసములకు ప్రసక్తి గల్పించుకొన్నాడు అందు ఒక్కటేరసము ప్రాధాన్యము వహించు చున్నదని ఘంటాపథముగ నిర్ణయించుటకు వీలులేదు గాని మొగ్గుదల శృంగారరసము వంకకే యున్న దని యొప్పుకొనకతప్పదు ఇన్ని కావ్యములలో శృంగారరసము నింత విరివిగ బోషించుకొనుచు వచ్చినను ఎప్పటికప్పుడే వైశిష్ట్యమును నూతనరామణీయకమును సంపాదించుకొనుచువచ్చిన దాతనివాణి. ఇంత విశాలమయిన ఆతని రససామ్రాజ్యమునకు శాకుంతలములో

సూచించిన శృంగారరసము రాణి ఒక్క కాళిదాస కృతులకే యన నేల ? పూర్వోదాత్త శృంగారరసాన్వితములగు సంస్కృత కావ్యము లన్నిటికిని ఇది తలమానికమై యలరారుచున్నది.

ఇతరగుణము లెన్ని యున్నను ఏ ఒక్కగుణము లోపించినచో కావ్యము నిర్జీవ మగునో ఇతరగుణము లెవ్వియు లేకున్నను ఏయొక్క గుణము సుపుష్టముగ నున్నచో కావ్యము సజీవమగునో అది రసమే నని పూర్వాలంకారికులు కనుగొన్న యమూల్య సిద్ధాంతములలో నొక్కటి అంచుచే రసమును కావ్యమునకు ప్రాణముగ పరిగణింప వచ్చును కావ్యరచనకు ప్రాణపద మయిన రసమును పోషించుటలో కాళిదాసు అప్రతిమప్రభావుడు తననాటకములను రసప్రధానములను గావించుకొనుటవలన దేశకాలభేదముల నతిక్రమించి యవి చిరజీవి నులుగా నుండుట కనకాశము కల్పించుకొన్నాడు. కాళిదాసు కాల నిర్ణయ మెంత యర్వాచీన మనినిశ్చయింత మన్నను ఇప్పటికి రెండు వేలసంవత్సరములు దాటుచునేయున్నది. ఇంతకాల మాతని శాకుంతల మార్యావర్తవాఙ్మయమున పూర్వోదాత్తరసాన్వితముల కధ్యక్షపీఠ మువహించు చున్నదనగ రసపోషణమం దాతడు చూపిన నిశితప్రజ్ఞయే ముఖ్యకారణము. ఇటీవల పాశ్చాత్యపండితులు ఈ నాటకమును బఠింప నారంభించినదిమొదలు ప్రపంచవాఙ్మయమున దాని కొక ప్రముఖస్థాన మేర్పడుచున్నది ఈ స్థానము నది నిలబెట్టుకొనుటకు ఇతరకావ్యగుణము లన్నిటికంటెను నిత్యయౌవనమును నిర్వహించు కొను దాని రసపోషణమే ప్రబలాధారము కాదగియున్నది

---

# శాకుంతల విమర్శనము

## కాళిదాసుని శకుంతలా చిత్రణము

శాకుంతలనాటకమునందలి ఆకర్షకసాధనములలో శకుంతలాచిత్రణ మమూల్యమైనది. ఈ చిత్రణమున కవికులగురువు చూపిన ప్రాగల్భ్యము శాకుంతలమున కఖండవైభవమును చేకూర్చుచున్నది.

శాకుంతలనాటకము నొక యాలయముగ గ్రహించినచో అందు సుప్రతిష్ఠితమైన విగ్రహము శకుంతల ఇతర పాత్రములన్నియు ఈ విగ్రహమునకు అర్చకులు ఈవిగ్రహ సౌందర్యమునకు రసజ్ఞతాశూన్యములనదగిన నీచపాత్రములుసహితము చకితము లగుచున్నవి

"ఈ దృశంనామ సుఖోపనతం రూపం దృష్ట్వా కోఽన్యో విచారయతి" అని దుష్యంతుని పరిజనుడు శకుంతలాసౌందర్యమునకు నివాళు లిచ్చుచున్నాడు! మోదకఖాదనమే జీవితపరమార్థముగ గ్రహించిన విదూషకుడుకూడ.

"యైషా శిథిలబంధోద్వృత్తకుసుమేన కేశాంతే నోద్భిన్న స్వేదబిన్దునా వదనేన విశేషతోఽపసృతాభ్యాం బాహాభ్యాం అవసేక స్నిగ్ధతరుణపల్లవస్య చూతపాదపస్య పార్శ్వే ఈషత్పరిశ్రాన్తే వాలిఖితా"

అని చిత్రపటమునుండియే శకుంతలామూర్తి విశేషమును గ్రహించుటలో వైదగ్ధ్యమును ప్రకటించుచున్నాడు అట్టిచో "నను శకుంతలాయా సౌభాగ్యదేవతా అర్చనీయా" అని వివేకవతులగు శకుంతలసఖులు పూజ కుపక్రమించుటలోగాని, "అయే లబ్ధం నేత్ర నిర్వాణమ్" అని రసజ్ఞచక్రవర్తియగు దుష్యంతుడు దర్శనమాత్రముననే ఆనందలహరిపై నుయ్యాలలూగుటలోగాని ఆశ్చర్యము లేదుగదా!

శకుంతలాసౌందర్యోపాసనమునకు ఎవ్వో కొన్నిపూలను సేక

రించుకొని అన్ని పాత్రములును ఆయత్తము లగుచునేయున్నను అగ్ర తాంబూలముమాత్రము దుష్యంతునిదే. కాళిదాసు శకుంతల సౌందర్యమును వర్ణించుచు చెప్పిన శ్లోకములలో అత్యుత్తమములయిన వన్నియు దుష్యంతుని నోటనే వెలువడుచున్నవి సౌందర్యము సర్వజనసమ్మోహనకరమే యయ్యును ఉపాసకుని సంస్కారమును బట్టికూడ విశేషములు ప్రకటమగుచుండునుగదా!

ఈ చిత్రణమునందలి విశిష్టలక్షణము మూర్తిమత్త్వము. ఏ యవస్థ కాయవస్థలో ప్రతిని మేషము శకుంతల మన యెదుట ప్రత్యక్షమగుచున్నది ఇప్పటి బంగాళీచిత్రణములందువలె అస్పష్టముగగాని, ఆత్మైకప్రధానముగగాని గోచరింపక సుపుష్టమైన విగ్రహముతో కన్నులపండు వొనర్చుచున్నది వల్కలధారిణియైన శకుంతలవర్ణనము—

"సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి,
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం."

వృక్షసేచన మొనర్చుటకయి కేసరవృక్షకము చెంత నిలువబడినపుడు బాహ్యప్రకృతితో మానవసౌందర్యమును సమన్వయించుచు తీసిన ఫొటో —

"అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ
కుసుమమివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధమ్"

అంతలోనే మధుకరముచే కాతరీభూత యగుచున్న శకుంతలా విగ్రహము.—

"యతో యత షట్చరణో భివర్తతే తత స్తతః ప్రేరితలోలలోచనా
వివర్తితభ్రూ రియ మద్య శిక్షతే భయా దకామాపి హి దృష్టివిభ్రమం."

ఈ రీతిగ సినిమారీలు త్రిప్పినటులుగ ననుక్షణము వర్ణించుకొనుచువచ్చినాడు కాళిదాసు. "అహో! సర్వావస్థాసు రమణీయత్వమాకృతివిశేషాణామ్" అను వాక్యము వేరొక సందర్భమున జెప్పినదయినను శకుంతలావర్ణనమునకుగూడ ఎంతగ నన్వయించునో చూడుడు

మధురావస్థలలో మాత్రమే కాక

"ఇతః ప్రత్యాదేశా త్స్వజన మనుగన్తుం వ్యవసితా
స్థితా తిష్ఠేత్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే
పున ర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ ."

అని విషమావస్థలో చిక్కుకొన్నపుడును, "వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణీ" అని విరహవ్రతమును భరించుచున్నపుడును వేసిన విగ్రహములుగూడ ఎంత రమణీయము లుగనున్నవి !

సుపుష్టవిగ్రహ మనగనే స్థూలచిత్రణ మని భావింపరాదు. ఎక్కడను వ్యంగ్యమర్యాదను అతిక్రమింపకుండ కవి పూర్ణమైన యాత్మ నిగ్రహమును వహించుచున్నాడు గాని లౌల్యముతో చేసిన వర్ణన మెచ్చటను గానము. అంగప్రత్యంగవర్ణనము లున్నను కుమారసంభవ మున పార్వతీప్రథమవర్ణనమువలె దీర్ఘమైనవిగను, ప్రౌఢతా విహీన ములుగను విసుగు జనింపచేయునవిగను లేవు ఇంకొకటి. కొన్ని ప్రబంధములలో నాయికా వర్ణనములవలె గతానుగతికముగ లేక అవస్థా వైశిష్ట్యమును, ఆకృతి వైశిష్ట్యమును ప్రతిపాదించునవిగ నున్నవి

కాళిదాసుని నాటక నాయికలలో మాళవిక కేవలము మనుష్య స్త్రీ. ఊర్వశి కేవలము అప్సరస్త్రీ శకుంతలయన్ననో కేవలము మనుష్య స్త్రీ గాదు , కేవలము అప్సరస్త్రీగాదు. మేనకా విశ్వామిత్రుల సంబంధమును పురస్కరించుకొని మానవత్వము, దైవత్వమును ఈమె యందు లెస్సగ సమ్మిశ్రితములైనవి అందుచేతనే ఈమె వర్ణనమునందు కూడ కాళిదాసు అనురూపశిల్పమును గానబరచుచున్నాడు.

"అభ్యున్నతా పురస్తా దవగాఢా జఘన గౌరవాత్పశ్చాత్
ద్వారేఽస్య పాండుసికతే పదపఙ్క్తి ర్దృశ్యతేఽభి నవా,"

అని దృఢముగ పాదమును భూమిమీద మోపనిచ్చి నర్తించుచున్నను

"మానుషీషు కథంవా స్యా దస్య రూపస్య సంభవః
న ప్రభాతరళం జ్యోతి రుదేతి వసుధాతలాత్ "

అని యొక్కమారుగ గగనమున కెత్తివైచుచున్నాడు. కాళిదాసుని నాయికలలోగూడ ఏ యితర నాయికకును లేని వైభవము శకుంతలయందు నిరూపితమైనది

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా రూపోచ్చయేన మనసా విధినా కృతాను,
స్త్రీరత్న సృష్టిరపరా ప్రతిభాతి సా మే ధాతుర్విభుత్వ మనుచింత్య వపుశ్చ తస్యాః"

ఈ సౌందర్యమును నిష్కామవృత్తితో వీక్షించినను ఆత్మకొక యపురూప హర్షము సిద్ధించుచున్నది ఒక్క దుష్యంతుడు మాత్రమే కాక నాటకమును చేతబట్టిన ప్రతిపాఠకుడును,

"అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నమ్ మధు నవ మనాస్వాదితరసం,
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘం "*

అని గానము చేయవలసియున్నది

మాళవికపట్లను, ఊర్వశిపట్లను లభించని యవకాశమొకటి కాళిదాసునకు శకుంతలపట్ల లభించినది అది శకుంతల తాపసాశ్రమమున పెరుగుటయే. ఈ యవకాశము నాతడు పూర్ణముగ వినియోగించుకొన్నాడు సహజమయిన లావణ్యమును సహజమయిన పరిస్థితులందుంచి వర్ణించుట కెంతయో వీలిచ్చినది ఏ రాజాంతఃపురములోనో ఉన్న కన్యయైనచో ఆమె యెంతటి లావణ్యవతియైనను

---

* "కన్యను అనాఘ్రాతపుష్పమని వర్ణించుటలో విశేషమేమున్నది? మీదు మిక్కిలి అశ్లీలద్యోతకముగ కూడ లేదా?" అని కొందరు విమర్శకులు ప్రశ్నించుచున్నారు ఈ శ్లోకమునకు 'అనఘం' అను పదము ప్రాణపదము దుష్యంతుడిదివరలో సుందరుల నెందరినో చూచినాడు కాని ఎక్కడను వ్రేలుపెట్టి చూపుటకైన వీలులేని– ఏమాత్రము మాలిన్యములేని– రూపసంపద ఒక్కచో మూర్తీభవించి ఇచ్చట ప్రత్యక్షమైనది అందును అట్టి రూపసంపద ఉండుననుకొనుటకు వీలులేని ఆశ్రమమున ప్రత్యక్షమైనది ఒక నూతన జ్యోతిని సందర్శించిన శాస్త్రజ్ఞునివలె ఆతడు వివశుడయి వర్ణించుచున్నాడు ఉపమానముల మూలమున ప్రతిపాద్యమయినది సౌందర్యముయొక్క అకృత్రిమత్వము మాత్రమే నాగరకతా సంపర్కము కలుగగనే దానికి కృత్రిమత్వము (Artificiality) సంభవించునని దుష్యంతుని యాశయము ఈ సందర్భమున "శుద్ధాన్త దుర్లభ మిద" మను శ్లోకమునుగూడ జ్ఞప్తియం దుంచుకొనదగును

శకుంతలవలె మన చిత్తము నాకర్షింప లేకపోయెడిది. "అవ్యాజ మనో హర" మయిన లావణ్యము కావుననే శకుంతలా చిత్రణము దేశకాల పాత్రముల నతిక్రమించి సర్వకాలములయందు సర్వజనులను సమ్మో హింపజేయజాలి యున్నది. ఈమెకు అలంకారముగ కాళిదాసు సేక రించుకొన్న సామగ్రికూడ కడు మనోహరమయినది.

"కృతం న కర్ణార్పితబంధనం సఖే శిరీష మాగండ విలంబి కేసరం
న వా శరచ్చన్ద్ర మరీచి కోమలం మృణాలసూత్రం రచితం స్తనాంతరే."

ఇక ఈమె మాంగల్యసమాలంభనములు, తీర్థమృత్తిక. గోరో చనము దూర్వాకిసలయములు. అత్తవారింటికి ప్రయాణ మగునపుడు సఖులు ఈమె కొసంగు కానుకలు ఫోటోలుకావు, సెంటుబుడ్లుకావు, నగలుకావు, నాణెములుకావు నారికేలసముద్గకి నిక్షిప్తమగు కేసర మాలిక. ఇట్టి అత్యంత సులభసాధ్యమగు సామగ్రితో కాళిదాసు త్రిలోకసుందరి అయిన యీమె విగ్రహము నలంకరించినాడు

తాపసాశ్రమమునందలి బాహ్యప్రకృతికని, శకుంతలకును ఒకవిధ మయిన అన్యోన్యత, అవినాభావసంబంధము నేర్పడుచున్నవి. ఈ రహ స్యమును గుర్తించియే—

"కార్యా సైకతలీనహంసమిథునా స్రోతోవహా మాలినీ
పాదా స్తా మభితో నిషణ్ణహరిణా గౌరీగురోః పావనాః
శాఖాలంబితవల్కలస్య చ తరో ర్నిర్మాతు మిచ్ఛామ్యధః
శృఙ్గే కృష్ణమృగస్య వామనయనం కణ్డూయమానాం మృగీం"

అను శ్లోకములో కేవలము వ్యక్తిచిత్రణముమాత్రమే కాక ప్రాంత చిత్రణముకూడ ఎంత యావశ్యకమైనదియు విస్పష్టపరచినాడు ప్రథమాంకముననే "ఏతా స్తపస్వికన్యాః స్వప్రమాణానురూపైః సేచనఘటై ర్బాలపాదపేభ్యః పయో దాతు మితఏ వాభివర్తన్తే" అను వాక్యముతో చదువరి హృదయముపయి నొక సమ్మోహనా స్త్రము వేసిన ట్లగుచున్నది. "శుద్ధాంత దుర్లభ మిదం" అను దుష్యంతుని శ్లోకముగూడ ఈ సమ్మోహనశక్తికే సాక్ష్య మిచ్చు

చున్నది "న కేవలం తాతనియోగః అస్తి మమాపి ఖలు సోదరస్నేహ ఏతేషు" అను శకుంతలావాక్యము ఈ శక్తిని మరింత సాంద్ర మొనరించుచున్నది. దీనినిబట్టి ఆశ్రమవృక్షములపయి నామెకు విలాస వతులకు సాధారణముగా పూవుల మొక్కలపయి నుండు మొగ్గరము మాత్రమే కాక వానియందు సోదరస్నేహ మున్నదని వ్యక్తమగు చున్నది "సఖి శకుంతలే, ఇయం స్వయంవరవధూః బాలసహకారస్య త్వయా కృతనామధేయా వనజ్యోత్స్నేతి నవమాలికాఖలు ఏనాం విస్మృతాసి?" అను ప్రశ్నవలన మొక్కలకు ఆమె ముద్దుపేర్లు పెట్టు కొనుచు వానిలో నొండొంటికి వివాహములొనర్చుచు వినోదించు ననుట తేటపడుచున్నది దీనికి శకుంతల యిచ్చిన "తదా యది ఆత్మా నమపి విస్మరిష్యామి" అను సమాధానము ఆమెప్రేమను "సోదర స్నేహ" మనునంతరువునుకూడ దాటించి ఆత్మసాదృశ్య మను నంత రువును జేర్చుచున్నది

నాలుగవ యంకమున శకుంతలాచిత్రణము పరమావధి నందు చున్నది

"పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్"

అను తాతపాదుల వాక్యము శకుంతలాహృదయమును చక్కగ చిత్రించుచున్నది ఆమెప్రేమ ఎట్టి స్వార్థత్యాగబుద్ధిచే నుత్తేజితమయి నదియు నిరూపితమగుచున్నది. ఆశ్రమ మృగములయందుకూడ ఆమెకు ఎట్టి యగాధమయిన ప్రేమ మున్నదో తిలకింపుడు

"యస్య త్వయా వ్రణవిరోపణ మింగుదీనాం
తైలం న్యషిచ్యత ముఖే కుశసూచివిద్ధే
శ్యామాకముష్టిపరివర్ధితకో జహాతి
సోయం న పుత్రకృతకః పదవీం మృగస్తే"

ఇట్టి ప్రేమకు అడవిమృగముల హృదయములు సైతము సంచలించి ద్రవీభూతములు కావలసినదేగాని ఊరకుండగలవా?

"ఉద్గళితదర్భకబలా మృగాః పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృతపాండుపత్రా ముఞ్చ త్యశ్రూణీవ లతాః"

చతుర్థాంకము కాళిదాసు కల్పించిన ప్రత్యేకస్వర్గసీమ ఈ యంకము లేకున్న ఏ శకుంతలాచిత్రణములో నున్న సౌందర్యము సగమునకు పైగా లుప్తమయ్యెడిదేమో

శకుంతలకు బాహ్యప్రకృతిలో నున్న యన్యోన్యతను చిత్రించుటలో కాళిదాసు మూలమునందున్న యంశములే విపులపరచినాడు. కాని శకుంతలకు అనసూయా ప్రియంవదలను జతగూర్చుటలో క్రొత్తదారి త్రొక్కినాడు స్థూలదృష్టికి ఈ అనసూయాప్రియంవదలు శకుంతలను దుష్యంతునితో సంధానించుట కుపయోగపడు కథానిర్వాహణ సాధనములుగ మాత్రమే గోచరించుచున్నవి కాని సూక్ష్మదృష్టితో బరికించినచో శకుంతలాచిత్రణమునకుగూడ ఈ చిత్రణ మెట్టి యమూల్యసాధనమో బోధపడకమానదు కళాదృష్టిమై కొన్ని యపురూపసౌందర్యమయములగు వస్తువులమధ్య వాటినన్నిటిని మించిన ఇంకొక వస్తువునుంచి తిలకించినచో దాని రామణీయకము మరింత విస్పష్టముగ విరాజిల్లును "కవినాం కవిమండలే" అనినట్లు. ఇట్టి కళారహస్యములకు పుట్టినిల్లగు కాళిదాసు శకుంతలనొక్కతెనే చిత్రింపక ఆమెకు "తోడిపెండ్లికూతులు"గ నుండుటకయి మరి ఇరువురు సౌందర్యవతులను గూడ చిత్రించినాడు. అందువలన శకుంతలశోభ ఇనుమడించినది. ఈ రహస్యమును రసజ్ఞశేఖరుడగు దుష్యంతుడుకూడ గుర్తించియే "అహో! సమవయోరూపరమణీయం సౌహార్దం భవతీనాం" అని తబ్బిబ్బగుచున్నాడు

ఈ అనసూయా ప్రియంవదల చిత్రణమువలన శకుంతల కెట్టి శోభ చేకూరినదియు "అపి జానాసి కిం నిమిత్తం శకుంతలా వనజ్యో

త్మాన్న మతిమాత్రం పశ్యతి ।" అనునప్పటి నిర్మలపరిహాసములును, దుష్యంతుడు సమీపించినవెనుక "సఖి శకుంతలే, యద్యద్యతాతః సన్నిహితో భవేత్" అనునప్పటి నర్మగర్భిత పరిహాసములును, శకుంతలను దుష్యంతుని సన్నిధిని నిలుపుటకు వ్యాజముగ "వృక్షసేచనే ద్వే మే ధారయసి తస్మాద్దేహి తావదాత్మానం మోచయిత్వా తతో గమిష్యసి" అనునప్పటి కుహనాకలహములును విశదీకరింపగలవు. శకుంతలను దుష్యంతునితో సంధానించుటకు వారు చేటికలు గాంధర్వ వివాహమునకు వారు పెండ్లిపెద్దలు శకుంతల యావేదనలో సమభాగినులు శకుంతలా ప్రస్థానసందర్భమున బాలసహకారమును, నవమాలికను "ఏషా ద్వయోర్ద్వాం హస్తనిక్షేపః" అని శకుంతల వారికొప్పగించినపుడు "అయం జన స్త్వయేదానీం కస్య హస్తేఽర్పితః" అని వారు బాష్పములు విడుచుచు పలికినవాక్యము ఎంత హృదయంగమముగ నున్నది!

పాత్రపరిణామము (Evolution of character) అను ప్రక్రియకు శకుంతలాచిత్రణము చక్కని నిదర్శనము. నాటకమున ప్రవేశపెట్టిన పాత్రము మొదటినుండి తుదివరకు ఒకేతీరున నిలిచిపోవుట అసంభవము లోకములో ఏవ్యక్తియైన నొకొనుడు ఆతనిస్వభావమును బట్టి యాతనిజీవితము నడచుచుండును కాని ప్రపంచమున నాతడొక్కడేగాక ఇంకను ఎన్నో వ్యక్తులున్నవి, శక్తులున్నవి వీనివలన తలవనితలంపుగ కొన్ని యుదంతము లాతని జీవితమున ప్రవేశించుచున్నవి ఈ యుదంతములనుబట్టి యాతడును, ఆతనినిబట్టి ఈ యుదంతములును పరస్పర పరిణామము నందుచుండును. ఈ పరిణామమును నాటకపాత్రములలో నిరూపించు కళాప్రక్రియకు పాత్రపరిణామ ముందురు. శకుంతల మొదట ఆశ్రమవృక్షములను, ఆశ్రమమృగములను, ఆశ్రమవాసులను తప్ప ఎరుగని అమాయకహృదయ. మున్ముందు ఆమె ప్రేమము వీనినే ఆశ్రయించుకొని ప్రకాశించుచున్నది దుష్యంతుడు

ఆమె దృక్పథమున బడువరకు సరళమైన ఆమె హృదయమును కవి మొదట చిత్రించుకొని వచ్చినాడు. దుష్యంతుని ఆమె యాహ్వానింప లేదు అది యాదృచ్ఛికముగ—అదే దైవికముగ—నడచిన యుదంతము, ఈ యుదంతమువలన, అనగా దుష్యంతదర్శనమువలన ఆమెహృదయ మున నొకవికార ముదయించినది ఇది తపోవనవిరోధి యనికూడ ఆమె గ్రహింపకపోలేదు మూడవయంకము తుదివరకు ఈ వికారపరి ణామము చిత్రితమైనది వివాహమైనది దుష్యంతుడు స్వనగరమునకు పోయినాడు అది గాంధర్వవివాహమగుటచే గురుజనుల యనుజ్ఞ లేదు ఇటు కణ్వుడేమనునో అని ఒకభయము అటు దుష్యంతుని అనంతర ప్రవర్తన మెట్లుండునో అని ఒక ఆందోళనము. పంచమాంకమున దుష్యంత పునర్దర్శనమువరకు ఈ ఆందోళనము చిత్రితము తుదకు పతి వలన సిద్ధించినది ప్రత్యాదేశము ఈ ప్రత్యాదేశ సందర్భమున ప్రదర్శితమైనది—దైవశక్తియొక్క— దురూహ్యత—అనివార్యత "తావ ద్విధినా దర్శితం ప్రభుత్వమ్" ప్రతికూలముగ నున్న ఈ దైవశక్తిని ప్రసా దపరచుటకే దీర్ఘదృష్టిగల—అర్ధదృష్టిగల— కణ్వుడు సోమతీర్థమునకు పోయినది. ఏమయిననేమి ? ఈ దైవశక్తి దానిపని నది చేయకమానినది గాదు. అంగుళీయకము మాయమైనది. దుర్వాసుని శాపము ప్రకోపిం చినది. పతికి సమ్మోహము ముదయించినది. తనకు ప్రత్యాదేశము సిద్ధిం చినది ఇది శకుంతలాజీవితమున పెద్దఘట్టము ఆత్మహత్యకుగూడ ఆమెను పురికొల్పవలసిన—పురికొల్పిన—ఘట్టము. తరువాత మారీచాశ్ర మమున ఆమె విరహవ్రతమును భరించినది జీవితమునందలి భోగ వాంఛలు పటాపంచలైనవి ఈ కష్టాగ్నిలో గ్రాగుటవలన ఆత్మశోక నైర్మల్యము సిద్ధించినది దుష్యంతుడు మరల ఆమె నంగీకరించినను ఆమె కప్పటికే ఇహజీవితమునందలి మోజుతగ్గి ఆశ్రమాంతరమును స్వీకరించుటయందు ఆసక్తి హెచ్చియుండవలెను కాని ఈ యవస్థ యందుకూడ స్త్రీజనోచితమగు మాధుర్యము ఆమెను వీడలేదనుటకు

"జిహ్మేహ మార్యపుత్రేణసహ గురుసమీపం గంతుం" అను వాక్య ములో కాళిదాసు మిక్కిలి ప్రౌఢముగ నిరూపించినాడు తాపసకన్యగ వృక్షసేచన మొనర్చుచు ప్రవేశించిన శకుంతల ప్రణయినియై, పెండ్లి కూతురయి, గర్భవతియై, శాపోపహతయై, దుర్భరదుఃఖాగ్నిస్థితయయి, ఆత్మవధోద్యుక్తయయి, తుదకు మరల వ్రతవతియై, పతిసమ్మానితయై ప్రౌఢనిర్భరవయఃపరిపాకము ప్రత్యక్షము గుచున్నది.

కాని సూక్ష్మముగ విచారించినచో ఈ చిత్రణమున ఒక్క లోపముకూడ పొడకట్టుచున్నది, అది కవిసంస్కృతి ననుసరించినది. వాల్మీకియో, వ్యాసుడో ఈనాటకమును రచించి రేని వారి శకుంతలా చిత్రణము వేరుగనుండెడిది కేవలము మూలానుసరణ మొనర్చినను కాళిదాసు శకుంతలా చిత్రణము వేరుగ నుండవలసినది మూలమును బట్టి శకుంతలజీవితము రెండుభాగములుగ విడిపోవుచున్నది హస్తినగ రమున దుష్యంతుని మరల గలసికొనువరకును ఒకభాగము అటుతరు వాత, అశరీరవాణి ననుసరించి దుష్యంతుడామెను స్వీకరించువరకు రెం డవభాగము శకుంతల యాత్మవిశ్వాసమును, అనన్యదుస్సాధ్యమగు తేజ మును నిరూపింపజాలినది అనగా శకుంతలను భారతమహిళా మండ లిలో అగ్రస్థానమును చేకూర్చినది ద్వితీయభాగమే కాళిదాసు తన చిత్రణమున లాలిత్యనీయమగు మొదటిభాగమును ఎంతో మనోహర ముగ పెంచుకొనివచ్చి మహాత్మ్యఖనియగు ద్వితీయభాగమును మిక్కిలి కుదించివైచినాడు అత్తవారింటికి చేరుకొనువరకు, అనగా చతుర్థాంకాంతమువరకు ఆతనిచిత్రణము అతి మనోహరముగనున్నది. కాని తరువాత మిక్కిలి సంకుచితమైపోయినది పంచమాంకమున బాహాటముగ రాజసభలో జయభేరి మ్రోగింపవలసిన శకుంతల "నవ గుంఠనవతి" గ నొనర్చి పెరటిదారిని నిష్క్రమింపజేసినాడు.

---

# శాకుంతలవిమర్శనము

## కాళిదాసుని దుష్యంతుడు

నాటకమునకు "శాకుంతల" మని పేరు పెట్టినను పూర్ణచిత్రణము నందిన పాత్రము దుష్యంతునిదే. శకుంతలాచిత్రణము ఆకృతి ప్రధానమయినది. శీలపరిపోషణ మున్నను పూర్ణవికాసమును గాంచలేదు. కాని దుష్యంతునియందు సర్వతోముఖమయిన మాహాత్మ్యము ప్రతిపాదిత మగుటయేగాక నిరూపితమయినది. నాటకముఖముననే

> కృష్ణసారే దదచ్చక్షు స్త్వయి చాధిజ్యకార్ముకే,
> మృగానుసారిణం సాక్షాత్పశ్యామీవ పినాకినమ్

అని దుష్యంతునకు తన ఇష్టదైవమగు శివునితో సాదృశ్యమును దెచ్చుటచేతనే ఈతనిని ఆదర్శప్రాయునిగ చిత్రింపవలెనను నాశయమును కాళిదాసు ప్రస్ఫురింప జేయుచున్నాడు. ఈయుపమానముపయి కాళిదాసునకు మిక్కిలి పక్షపాతము అతడు దీనిని వాడిన వేరొక సందర్భమునుబట్టికూడ దీని ప్రాముఖ్యమును మనము గ్రహింపవచ్చును.

> తత్ప్రసుప్త భుజగేంద్రభీషణం వీక్ష్య దాశరథి రాదదే ధనుః
> విద్రుతక్రతుమృగానుసారిణం యేన బాణ మసృజ ద్వృషధ్వజః

రఘువంశము సర్గ 11 శ్లో 44.

దుష్యంతుని ఆకృతివిశేషము పలుతావులందు సూచితమైనను మొత్తముమీద నిది శీలప్రధానమైన చిత్రణము. ఆకృతివర్ణనలున్నతావులను సూక్ష్మముగ బరిశీలించితిమేని అట్టి వర్ణనలుకూడ శీలనిరూపణకు ఉపకరణములుగానే కనవచ్చుచున్నవి. ఈ యంశమును స్థాపించుటకు పైనుదాహృతమైన "కృష్ణసారే" ఇత్యాది పద్యమొక యుదాహృతి. అదిగాక

ప్రియంవదా — అనసూయే ! కోను ఖ శ్వేష చతురగంభీరాకృతి ర్మధురం ప్రియమాల
పన్ ప్రభురివ దృశ్యతే'

అనువర్ణనలో "చతురగంభీరాకృతిః" అనుటలో ఆకృతివర్ణన మున్నది కాని ఈ ఆకృతివర్ణనమునకు గాంభీర్యనిరూపణము లక్ష్యము. అట్లనే "ప్రభు రివ దృశ్యతే" అనుటలో ఆకృతినిబట్టి ప్రాభవము స్థాపితమగు చున్నది. అనగా గాంభీర్యము ప్రాభవము ఇత్యాది శీలవిశేషములను నిరూపించుటకు ఆకృతివర్ణనము సాధనమగుచున్నది ఇట్లే ద్వితీయాంక మున

ప్రథమః — అహో ! దీప్తిమతో౽పి విశ్వసనీయతా వపుషః

అనియున్న ఆకృతివర్ణనముగాని

ప్రజాః ప్రజాః స్వా ఇవ తంత్రయిత్వా నిషేవతే శాంతమనా వివిక్తమ్,
యూథాని సంచార్య రవిప్రతప్తః శీతం దివాస్థానమివ ద్విపేన్ద్రః

అను పంచమాంకమునందలి ఆకృతివర్ణనమును గాని పరిశీలించినచో పైని సిద్ధాంతీకరించిన రహస్యమే గోచరించుచున్నది

అన్నిరేకులును వికసించిన శతపత్రమువలె దుష్యంతుని స్వభావమునందలి అన్నియంశములు స్పష్టముగ నిరూపితములగుటచే ఈ దుష్యంతుని శీలచిత్రణము ఎంతయు ఆహ్లాదజనకముగ నున్నది వ్యక్తిగత మాహాత్మ్యమునుబట్టి చూచినచో కులపతియగు కణ్వుడును ప్రజాపతియగు మారీచుడును దుష్యంతునికంటె ఉన్నతపదస్థులేగాని వారి పాత్రపోషణము రేఖాచిత్రణము మాత్రమే యగుచున్నదిగాని పుష్టి వహింపకున్నది

మూలమునందు వేట వర్ణించుచున్నపుడు దుష్యంతుని పరాక్రమము వర్ణితమయినది గాని నాటకములో నంతకంటె నెన్నియో మడుంగులు విస్పష్టముగ దుష్యంతుని పరాక్రమము ప్రదర్శితమయినది ఇందు మొదటినిదర్శనము ఋషిసవనరక్షణము ఇది కేవలము కాళిదాసకల్పితము. దీనివలన కాళిదాసు సాధింపదలచిన ప్రధానప్రయోజనము—

శకుంతలాదుష్యంతుల ప్రణయము కొంతవరకు పెరుగుటకు తగిన సావ కాశమును సంపాదించుటయే కాని అప్రధానముగనైనను దుష్యంతుని పరాక్రమముకూడ ప్రస్ఫురితమగుచున్నది

అహో? మహానుభావః ఖలు పార్థివో దుష్యన్తః యత్రప్రవిష్టమాత్ర ఏవాశ్రమ పదం తత్రభవతి రాజని నిరుపప్లవాని నః కర్మాణి సంవృత్తాని,

కా కథా బాణసంధానే జ్యాశబ్దేనైవ దూరతః
హుంకారేణేవ ధనుషస్సహి విఘ్నానపోహతి

ఇక రెండవనిదర్శనము శక్రసాహాయ్యము ఇదికూడ కేవలము కాళి దాసకల్పితమే. దీనికిగూడ అన్యప్రయోజన ముద్దిష్టము కాకపోలేదు ("యజ్ఞభాగ పర్యుత్సుకా దేవా ఏవ తథానుష్ఠాస్యన్తి - షష్ఠాంకము) గాని ఇందలి ప్రధానప్రయోజనము- లేదా- ప్రత్యేక ప్రయోజనము దుష్యంతుని పరాక్రమనిరూపణయే యని యొప్పుకొనక తప్పదు దేవేం ద్రునియంతటివాడు దుష్యంతుని సాహాయ్య మర్థింపవలసివచ్చిన దనగ దుష్యంతునిపరాక్రమ మెంతటిదో మనకు విస్పష్టమగుచున్నది అతని యశశ్చిత్రణమునకుగూడ నిది పరమావధి

సఖపరస్య హరేరుభయైః కృతం త్రిదివముద్ధృతదానవకంటకమ్
తవ శరైరధునా నతపర్వభిః పురుషకేసరిణశ్చ పురా నఖైః
విచ్ఛిత్తిశేషైః సురసుందరీణాం వర్ణైరమీ కల్పలతాంశుకేషు
సఞ్చిత్య గీతిక్షమ మర్థబన్ధమ్ దివౌకస స్త్వచ్చరితం లిఖన్తి

కాని దుష్యంతుని పరాక్రమమునం దొకవిశేషము గోచరించు చున్నది. ఇది బహుశః హైందవనాగరికత కుఁగలకును ప్రత్యేకలక్షణ మేమో! తనపరాక్రమమును క్రూరముగగాని నిరంకుశముగగాని విజృం భింపజేయుటకు దుష్యంతుడు ఎన్నడు అంగీకరింపడు రాజ్యతృష్ణకు అధికారమదమునకు అది యెన్నడు నాలవాలము కారాదు సజ్జనులకు సేవ జేయుటవలననే అది చరితార్థము కావలసియున్నది. ఇటు ఋషుల యాజ్ఞను శిరసావహించి సవనరక్షణ మొనర్చినపుడును అటు శక్రుని

నిదేశము ననుసరించి దానవభంజన మొనర్చి లోకకల్యాణము చేకూర్చి నపుడును దుష్యంతుడు తనపరాక్రమమును ఎట్టి పవిత్రాదర్శములకు వినియోగించినదియు సువ్యక్తమైనది. నాటక ముఖమున

ఆర్తత్రాణాయ వశ్శస్త్రం నప్రహర్తు మనాగసి

అను ప్రబోధమున నీ యర్థముచే వైఖానసులు సూత్రీకరించినారు "అపారమైన పరాక్రమమున్నచే లాభము లేదు దాని నత్యంత నిగ్రహముతో సజ్జనుల పాదసేవకయి వినియోగింపవలెను అప్పుడే అది క్షాత్ర ధర్మమునకు సార్థక్యమును సంపాదింప జాలియున్నది" అను రహస్య మును కాళిదాసు దుష్యంతునిలో నిక్షిప్త మొనర్చినాడు దీనినే అతడు "రక్షాయోగము" అని ప్రత్యేక మొకయోగముగ (ఈశ్వర సాక్షాత్కృతికి సాధనముగ) పరిగణించుచున్నాడు అంతేకాదు. సమ్యగను ష్ఠితమగు రాజధర్మము సమ్యగనుష్ఠితమగు బ్రాహ్మణధర్మమున కెంత మాత్రము తీసిపోదనికూడ కాళిదాసుని యభిప్రాయము రాజర్షికి-ఋషికి రాజశబ్దమాత్రము చేతనే భేదమనియు ఇతరభేదము లేదనియు ఋషిచేతనే పలికించుటలో ఈఅభిప్రాయము నిరూఢ మగుచున్నది

అధ్యాక్రాంతా వసతిరమునాఽప్యాశ్రమే సర్వభోగ్యే
రక్షాయోగాదయమపి తపః ప్రత్యహం సఞ్చినోతి,
అస్యాపి ద్యాం స్పృశతి వశినశ్చారణద్వంద్వగీతః
పుణ్యశ్శబ్దో మునిరితి ముహుః కేవలం రాజపూర్వః

ఇట్టి యభిప్రాయమును శాకుంతలమునందేగాక ఇతరకావ్యములలో గూడ పునఃపునః వ్యక్తకరించుటచే కాళిదాసునకు అది యెంతగా నభిమతమో విశదమగుచున్నది.

ప్రప్రచ్ఛ కుశలం రాజ్యే రాజ్యాశ్రమమునిం మునిః (రఘువంశము సర్గ 1 శ్లో 58)

కాళిదాసుడు తన దుష్యంతుని "యుక్తభోగము" అను నుత్తమ గుణమునకు లక్ష్యభూతునిగ చిత్రించుకొని వచ్చినాడు ఈనాడు పాశ్చాత్యవ్యామోహమున మునిగిన యువకులు సనాతనధర్మమున

త్యాగమునకేగాని భోగమునకు తావులేదనియు హిందువులు ఎంతసేపును ఆధ్యాత్మికచింతలో మునిగి సన్న్యాసధర్మమునకే ప్రాముఖ్యమునిచ్చి ఐహికముల నుజ్జగించిరనియు అందుచేతనే ఆధ్యాత్మికముగ నెట్లున్నను ఐహికదృష్టిలో దేశ మధోగతికి వచ్చినదనియు తరచు విచారించుచుందురు కాని ఈ విచారము ఎంత యవిచారమూలకమో సనాతనధర్మస్వరూపమును ప్రాచీనదేశచరిత్రమును లెస్సగ ననుసంధింపజాలినవారు గ్రహింపలేకపోరు ధర్మార్థ కామమోక్షము లని పురుషార్థములను చతుర్విధముగ భాగించి యంగీకరించుటలోను వర్ణాశ్రమోచితములగు ధర్మములను నిర్ణయించుటలోను సనాతనధర్మము ఐహికములకుగూడ నెట్టి యథోచితప్రాముఖ్య మిచ్చినదియు సువ్యక్తము గాకపోదు.

దుష్యంతుడు గృహస్థాశ్రమమునందున్న క్షత్రియుడు అందుచే నిహభోగముల ననుభవించుటకు వర్ణమునుబట్టి ఆశ్రమమునుబట్టి అతనికధికారమున్నది. భోగమునకు వలయు సాధనములు రెండు (1) దృఢమైన గాత్రము, ఇప్పటివలె పాతిక సంవత్సరములే పరమాయుర్దాయముగాగల వారును తాపాకి పేరుచెప్పగనే మూర్ఛిల్లువారును భోగించునదేమి? (2) సునిశితమగు- అదే లెస్సగ సంస్కృతమగు- నంతరంగము. అనగా దేనికైనను ఆనందింపవలెననిన ఆనంద మనునది మనోవ్యాపారము గావున మనస్సునకు తగినసంస్కారము లేనినాడు గాత్రమెంత దృఢమైనదైనను ఆనందముమాత్రము దుర్లభము. దుష్యంతునకు పై రెండు సాధనములును సమగ్రముగ నున్నవి పై నుదాహృతమైన పరాక్రమమునుబట్టి అతని దేహమెంత బలిష్ఠమైనదియు నూహించుకొనవచ్చును ఇక అతని మానసిక సంస్కారమునుగూర్చి ఇంచుక విపులీకరింప వలసియున్నది. శ్రీకృష్ణరాయునివలె దుష్యంతుడు దృఢగాత్రుడును, రసజ్ఞుడును. రసజ్ఞుడుకానివానికి ఆనందము అసాధ్యము సంగీతమును అతడెంత చక్కగ నానందింపగలడో "అహో! రాగపరివాహినీ గీతిః" అను నాతని విమర్శనవాక్యమువలన వ్యక్తమగుచున్నది. అట్లనే

చిత్రకళయం దాతనికి విశేషనై పుణ్యముస్నట్లు నిరూపించుటకు

> అహో! ఏష రాజర్షే ర్వర్తికానిపుణతా జానే సఖీ మే అగ్రతో వర్తతఇతి

అని అప్సరస్త్రీయగు సానుమతియిచ్చిన సాక్ష్యము చాలును "కార్యా సైకతలీనహంసమిథునా" అను శ్లోకమునుబట్టికూడ ప్రాంతచిత్రిణము చిత్రకళలో పొందదగిన ప్రాముఖ్యము ఆతనికి విశదమనుట స్పష్టము దీనివలనగూడ ఆతని కాకళారహస్యము లెంతచక్కగ పట్టుబడినవో తెలియనగును

అన్నిటికంటెను శకుంతలా సౌందర్యమును ప్రశంసించుచు ఆతడు చేసిన వర్ణన లాతని రసజ్ఞతకు ప్రబలనిదర్శనములు రసజ్ఞులలో అతీంద్రియులయిన రసజ్ఞులుకూడ కలరు భగవద్భక్తులలో సిద్ధపురుషులను అతీంద్రియరసజ్ఞులనుగ మనము పరిగణింపవచ్చును. రాధాదేవి అపరావతారమని పేరుగాంచిన మీరాబాయినిగాని కృష్ణకర్ణామృతకారుడగు లీలాశుకునిగాని గైకొనుడు. మీరాబాయి సంగీతమునందు కవిత్వము నందు అపారప్రజ్ఞగలది లీలాశుకుడుగూడ ఉత్తమకవి. కాని ఈయిరువుర రసజ్ఞతయందును ఇంద్రియభోగేచ్ఛ లేదు అతీంద్రియమగు కృష్ణప్రేమయే వీరి యాలంబనము. వారు గోపిలజూచుసౌందర్యము సాధారణమర్త్యులకు అసాధ్యము. దుష్యంతునిరసజ్ఞతమాత్ర మట్టిదికాదు. అది ఇంద్రియతర్పణముచే యాశించుచున్నది అంతేకాదు, ఇంద్రియతర్పణము గాశించుటలో ఆశ్రమ నియమములపైనను ధర్మములపైనను ఒకవిధమగు నసూయనుగూడ ప్రకటించుచున్నా యనిపించుచున్నది. చూడుడు

> అసాధుదర్శీ ఖలు తత్రభవాన్ కాశ్యపః య ఇమా మాశ్రమధర్మే నియుఙ్క్తే.
> ఇదం కిలావ్యాజమనోహరం వపు స్తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి,
> ధ్రువం స నీలోత్పలపత్రధారయా సమిల్లతాం ఛేత్తు మయుం వ్యవస్యతి.

అయితే పైశ్లోకమున శకుంతల నాశ్రమధర్మమున నియోగించుటలో నున్న యనౌచిత్యముమాత్రమే విమర్శితమగుచున్నది. కాని దాని

వలన దుష్యంతుని రసజ్ఞత ధర్మవిరోధిని యని సాధించుట కొంతమాత్రము వలనుపడదు మీదుమిక్కిలి అది యధర్మభీరువనుటను కవి యెంతో నిపుణముగా పోషించుకొని వచ్చినాడు. చూడగనే శకుంతల యందు దుష్యంతుని కభిలాష యుదయించినది. కాని శకుంతలయాశ్రమ వాసిని యగుటచే తనకోరిక యధర్మదూషితమేమో యని అతడుపడిన ఆందోళనకు మితిలేదు "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః" అని సమాధానము చెప్పుకొన జూచుచున్నాడు గాని ఆమెజన్మకథనము పూర్తి యగువరకు నిశ్చయమునకు రాజాలకపోయెను * శకుంతలా ప్రత్యాదేశమున నీయంశము మరింత విపులముగను విస్పష్టముగను చిత్రితమయినది మూలమున నున్నట్లుగ ఎఱిగియుండియు శకుంతలను నిరాకరించినాడనినచో రాజునకు అధర్మస్పర్శ కలుగునేమోయని భయపడి దుర్వాసుని శాపవృత్తాంతమును కవి కల్పించినాడు శకుంతల యవగుంఠనమును తొలగింపగనే ఆమె సౌందర్యమునకు రాజు చకితుడైనను ధర్మాసనమునుండి ఇంచుకయైన చలింపక కులపతియందలి గౌరవమును కులపతి శిష్యులవచనములందలి యాదరమును శకుంతల యమాయకాగ్రహమువలన జనించిన భయమును అన్నిటినికూడ తృణీకరించి శకుంతలను నిరాకరించి ధర్మమునే శరణుజొచ్చుచున్నాడు

> యేన యేన వియుజ్యన్తే ప్రజాః స్నిగ్ధేన బన్ధునా
> స స పాపాదృతే తాసాం దుష్యన్త ఇతి ఘుష్యతామ్

అనుశ్లోకమున "పాపాదృతే" అని జాగరూకతను వహించుటనుబట్టి కూడ ధర్మముపట్ల నాతనికున్న అచంచలభక్తి విద్యోతమాన మగుచున్నది కావున దుష్యంతునిరసజ్ఞత అతీంద్రియము గాకపోయినను పూర్ణముగ ధర్మబద్ధ యనిమాత్రము గ్రహింపవగియున్నది అందు

---

* భవ హృదయ! సాభిలాషం సంప్రతి సందేహనిర్ణయో జాతః
ఆశఙ్కసే యదగ్నిం తదిదం స్పర్శక్షమం రత్నమ్ (అం. 1 శ్లో 26.)

చేతనే ఆతని భోగమును "యుక్తభోగ" మని వర్ణింప దగియున్నది. ధర్మార్థకామమోక్షము లనుటలో నార్యులు అర్థకామములను ఇటు ధర్మము అటుమోక్షమునను నంకుశములచే నిగ్రహించుచున్నారనిగదా పెద్దలు వచింతురు ఇది సనాతనధర్మమునకు ప్రత్యేక సంప్రదాయము గదా! ధర్మావిరుద్ధములగు నర్థకామములు తుదకు మోక్షవాహినిలో అదే త్యాగవాహినిలో గలియవలసి యున్నవిగదా! ఈ సత్యమును గూడ కాళిదా సెంతచక్కగ ప్రదర్శించినాడో!

భవనేషు సుధాసితేషు పూర్వం క్షితిరక్షార్థ ముశన్తి యే నివాసమ్,
నియతైకపతివ్రతాని పశ్చాత్ తరుమూలాని గృహీ భవన్తి తేషాం

ఇటు ధర్మమునకు అటు మోక్షమునకు ఎంతమాత్రము భంగము రానీయకుండ రసజ్ఞతను నిర్వహించుకొనవలె నను ఆశయము దుష్యంతుని తీవ్రవిచారశీలునిగ గానవచ్చుచున్నది దుష్యంతుడు గొప్పవిమర్శకు డనుటను ఆతని విశిష్టలక్షణములలో నొకటిగ మనము పరిగణింప వలసి యున్నది

"తద్యది యామనుమతం తథా వర్తేథాం యథా తస్య రాజర్షే రనుకమ్పనీయా భవామి. అన్యథా సించతంమే తిలోదకమ్"

అని శకుంతల పలికినపుడు "విమర్శచ్ఛేది వచనం" అనుటలో దుష్యంతుడు తనశీలమునకు కీలకమును వెల్లడించుచున్నాడేమో అతని విమర్శనాశక్తిని నిరూపించుటకు జాలిన ఘట్టములు రెండుచక్కనివి నాటకములో గానవచ్చుచున్నవి అందు మొదటిది ప్రథమాంకమున శకుంతలపయి తనకు జనించిన అనురాగము ధర్మవిరుద్ధమేమో యని భయపడి చేసికొనిన యంతరంగవితర్కము రెండవది సర్వదమనుడు తనకుమారుడే యని యంగీకరించుటకు ముందు (సప్తమాంకమున) నడపిన గాఢపరిశోధనము ఈ విమర్శనమును అతిమాత్రముగ గావించు లోపముగూడ తనకున్నదని గ్రహించి, "వయం తత్త్వాన్వేషా న్మధుకర హతాః త్వం ఖలుకృతీ" యనుటలో ఆత డాత్మవిమర్శకుడనికూడ తేటపడుచున్నది.

విమర్శకున కుండదగిన లక్షణములలో రసజ్ఞతయు పూర్వాపరవిచారము మాత్రమేగాక ఉచితజ్ఞతగూడ ఆతనియందు నిబిడమయి ప్రత్యక్షమగు చున్నది ప్రథమాంకమునను తృతీయాంకమునను శకుంతలకు ఆమెపఖు లకు తన్ను ప్రత్యక్షమొనరించుకొనిన తరుణములను బట్టి విధానమును బట్టి ఈ ఉచితజ్ఞతను స్థాపింపవచ్చును కణ్వశిష్యులకు అగ్న్యగారమున దర్శనమిచ్చుటగూడ ఈగుణమున కొకసాక్ష్యము.

శాకుంతలమునందలి పురుషపాత్రములలో మూడుమూర్తులు ఉజ్జ్వలము లయినవి (1) దేవర్షియైన మారీచుడు (2) బ్రహ్మర్షియైన కణ్వుడు (3) రాజర్షియైన దుష్యంతుడు. ఈ మూడును దేనికదే పరిశస్త ముగ గనపట్టుచున్నను మొదటిరెండు సాధారణమర్త్యులకు తేజోమహి మచే దుర్నిరీక్ష్యములు ఎందుచేతనో చెప్పలేముగాని రాజర్షులను చిత్రిం చుటలో కాళిదాసునకు అపారమైన యుత్సాహము నన్నయభట్టమహా కవి కాశ్రయ మొసంగిన రాజనరేంద్రునివలెనే కాళిదాసున కాశ్రయ మొసంగిన విక్రమాదిత్యుడో మరియొక నృపాలుడో పవిత్రచరితుడైన గానలయును. లేదా విదేశీయుల దండయాత్రలు పుంఖానుపుంఖను లయి ఆర్యధర్మములకు గ్లాని కలిగించుచున్న ఆకాలములో మూర్తీభ వించిన ధర్మదేవత లనదగిన నరపతుల చరిత్రములపయి ప్రజలకు భక్తి పుట్టించుట అత్యావశ్యకమైన గావలయును. కారణమేమయిన గానిండు. ఈ రాజర్షుల చరిత్రములలో కాళిదాసున కొకవిధమయిన అపురూప సౌందర్యము గోచరించుచు వచ్చినది ఆ సౌందర్యమునందు భౌతిక మానసికాధ్యాత్మికశక్తులు లెస్సగ సమన్వయమొంది పరిపూర్ణతను ప్రతిపాదించుచున్నవి యథోచితములును యథాక్రమములును అగు జీవితములపట్ల కాళిదాసునకు అఖండమైన భక్తి

> శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్
> వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్.

ఇటీవలి కొందరు విషయలోలురవలె గాక ఆనాటి రాజులు స్వార్థత్యాగ

బుద్ధితో రాజ్యపరిపాలనము నిర్వహించి యుండవలెను

స్వసుఖనిరభిలాషః ఖిద్యతే లోకహేతోః
ప్రతిదిన మథవా తే వృత్తిరేవంవిధైవ,
అనుభవతి హి మూర్ధ్నా పాదపస్తీవ్రముష్ణం
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానామ్

నియమయసి విమార్గప్రస్థితా నాత్తదణ్డః
ప్రశమయసి వివాదం కల్పసే రక్షణాయ,
అతనుషు విభవేషు జ్ఞాతయః సన్తు నామ
త్వయి తు పరిసమాప్తమ్ బన్ధుకృత్యం ప్రజానామ్

“ఆపన్నాభయ సత్రదీక్షితు” లగు నిట్టి రాజన్యమార్తాండుల యాస్థాన ములనలంకరించి వ్యంగ్యమర్యాదయా వారి సుగుణసంపదను గ్రంథస్థము గావింప నోచిన కవికులతిలకులు ధన్యులు ఇట్టి మహాకవుల లేఖినీముఖమున అజరామరము యి తమయశస్సు నృత్యముసల్పుచుండ మహావైభవోపేతులును, నిర్వక్రపరాక్రమ ధుర్యులును, ప్రజాహిత సేవాతత్పరులును, విమర్శకశేఖరులును విశేషించి అధర్మభీరువులును అయి ప్రకాశించునట్టి పాలకులు మరింత ధన్యులనుట వేరుగ వ్రాయవ్వ వలెనా? వివేకము గౌరవము జతగూర్చుకొని కవులవిశేషము గ్రహింప నేర్చి కవులను వారాదరించి పోషించి ప్రోత్సహింప కుండినచో జగత్తున నేటి మహాకావ్యము లెన్ని లుప్తమయ్యెడివో!

---

# శాకుంతలవిమర్శనము

## పాత్రీకరణము

(CHARACTERISATION)

### —♦ పాత్రీకరణ ప్రాముఖ్యము ♦—

పాత్రీకరణము ప్రత్యేకము సముద్రమంత విద్య. కవికి బ్రహ్మత్వమును ప్రతిపాదించు శక్తి ఇదియే మానవస్వభావమునందలి రహస్యములనెల్ల అనుసంధించి కవి తనపాత్రల ముఖమున సృష్టికి ప్రతిసృష్టి చేయుటయే ఈవిద్యకు పరమావధి పాశ్చాత్య విమర్శకుల మతమున పాత్రీకరణశక్తి లేనివాడు నాటకరచనమునందనధికారి యనియే. కాని మన యలంకారశాస్త్రములందీ శక్తినిగూర్చిన ప్రసక్తియే కానరాకుండనున్నది

### —♦ ప్రాచ్యకవుల పాత్రీకరణశక్తి ♦—

అంతమాత్రమున మన కవులకీవిద్య యపరిచితమని భావింపరాదు. దృశ్యప్రబంధములందును, శ్రవ్యప్రబంధములందును గూడ ఈ విద్య నత్యుచ్ఛదశకు గొనిపోయిన 'కవిబ్రహ్మ' లెందరో తెనుగునను, సంస్కృతముననుగూడ ఉన్నారు. ఆంగ్లకవులలో షేక్స్పియరు ఈ విద్యకు అందెవేసిన చేయి బెర్నార్డుషా మున్నగు నవీనవిమర్శకులు షేక్స్పియరు నెంత నిరసింపజూచినను ఇప్పటికిని పాత్రీకరణశక్తిలో షేక్స్పియరునుమించిన చేయి ఆంగ్లసారస్వతమున నుదయింపలేదు అయితే ఈ షేక్స్పియరుకు ఎంతమాత్రము దృష్టిమైన ప్రసరింపని దివ్యభూములలో సంచరించుచు 'బాణోచ్ఛిష్ట మిదం జగ' త్తనినట్లుగ పాత్రీకరణవిద్యయను సముద్రము నాపోశనముపట్టిన యగస్త్యులు సంస్కృతములో వ్యాసుడు, తెలుగులో తిక్కన. ఈ యిరువురు షేక్స్పియరుకు

ఏయే శక్తులలో నతీతులో నిరూపించుటకు సాధనములున్నవి. కాని ఇది యదరుకాదు మొత్తముమీద వ్యాసుడు, తిక్కన, షేక్స్పియరు- ముగ్వురును ఒకేజాతికి చెందిన పాత్రీకరణకారులు అనగా ఈముగ్వు రికిని యథార్థపరిదర్శనము (Objective presentation) అనునదియే గమ్యస్థానము నేను చదివినంతలో సంస్కృతదృశ్య ప్రబంధకారులలో పాత్రీకరణమున యథార్థపరిదర్శనమునే తలపెట్టినవాడు మృచ్ఛకటికము రచించిన శూద్రకుడు ఈతనికిని, పైముగ్వురకును ఎంతో యంతర మున్నను మొత్తముమీద జాతిమాత్ర మొకటి

## —♦ పాత్రీకరణమునందలి తరగతులు ♦—

యథార్థపరిదర్శనమని ఆదర్శీకరణ (Idealisation)మని, జాతి లక్షణారోపణ (Typification) మని మన మెరిగినంతవరకు పాత్రీకర ణము మూడుజాతులుగ గానవచ్చుచున్నది.

### 1 యథార్థపరిదర్శనము

యథార్థపరిదర్శన మనగా మానవప్రకృతిని ఉన్నదున్నట్లుగ చిత్రించి యానందింపవలెనను నుద్దేశముతో చేయబడు పాత్రీకరణము. ఏమనుష్యునియందుగాని గుణదోషములు రెండును మిశ్రితములయి యుండునుగాని కేవలము గుణమేగాని, కేవలము దోషమేగాని మూర్తీ భవింపదు. కైవల్యము నిరుపాధికము. అందుచే నుపాధిలోనున్న పాత్ర మును—అవతారపురుషుడు మొదలుకొని అణువువరకు—దేనిని చిత్రిం చినను గుణదోషమిశ్రితముగనే చిత్రింపవలసియుండును. అట్లు చిత్రిం చుటచే యథార్థప్రదర్శనమందురు

### 11 ఆదర్శీకరణము

ఇదిగాక మరిరెండు తరగతుల పాత్రీకరణము కూడ మహాకవు లలో గానవచ్చుచున్నది. అందు ఆదర్శీకరణ మను విద్యకు కాళిదాసు లక్ష్యము.

"సోహ మాజన్మశుద్ధానా మాఫలోదయకర్మణామ్
ఆసముద్రక్షితీశానా మానాకరథవర్త్మనామ్
యథావిధిహుతాగ్నీనాం యథాకామార్చితార్థినామ్
యథాపరాధదండానాం యథాకాలప్రబోధినమ్
త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణాం
యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినాం
శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్"

అను శ్లోకములలో ఆదర్శీకరణమే తన కభిమతమైనట్లు కాళిదాసే వ్యక్త పరచుచున్నాడు తన పాత్రములలో నెక్కడను లోపములు లేనట్లుగ సంస్కరించి లోకమున కాదర్శప్రాయముగ చిత్రించుటయే ఈతరగతి పాత్రీకరణమునకు ప్రధానము కాళిదాసుని నాటకత్రయమునందును రఘువంశ కుమారసంభవములందునుగూడ ఈ యాదర్శీకరణమే ప్రత్యక్షమగుచున్నది

## 111 జాతిలక్షణారోపణము

జాతిలక్షణారోపణమని వేరొకతరగతి పాత్రీకరణమునకు ప్రత్యేకమొక జాతినంతను గైకొని దూషించుటగాని, భూషించుటకాని అభిమతము. ఒక సోషలిష్టు నాటకము వ్రాయుచున్నా డనుకొనుడు. అందు ఒక పాత్రమును క్యాపిటలిష్టుల లక్షణముల నన్నిటిని నిరూపించుదానినిగను, వేరొక పాత్రమును సోషలిష్టుల లక్షణముల నన్నిటిని నిరూపించుదానినిగను చిత్రించి క్యాపిటలిష్టులందు ద్వేషమును, సోషలిష్టులపట్ల అనురాగమును ఉదయింపచేయుటయే కవి ముఖ్యోద్దేశమై యుండును.

ఆదర్శీకరణము, జాతిలక్షణారోపణము గూడ సాధారణముగ యథార్థమునకు దూరముగ నుండును తమ కభీష్టములగు నాదర్శములను ప్రతిపాదించుటకయి ఆయాకవులు ప్రకృతిని అతిశయోక్తి తావలముగ చిత్రింతురు క్యాపిటలిష్టులని కవి యనుకొను జాతియంతయు

పిశాచగణమై, పాపలిప్తు లనుకొన్న వారందరు దేవగణమై ప్రవర్తిం
పరు సమ్యగ్దృష్టివిహీనులకు మనస్సులోని భావములు ప్రకృతిలో
నధ్యాసితము గుచుండునుగాని వాస్తవముగ కవి నిష్పాక్షికముగ పరి
శీలించు సమచిత్తుల దృష్టికి గోచరింపవు. అందుచే ఈ రెండుతరగతుల
పాత్రీకరణమును అంతగ ప్రశస్తము కానేరదు.

## శకుంతలా దుష్యంతులు

పరికృతము విమర్శనీయమగు శాకుంతలమున నున్న పాత్రీకరణ
ములో ముప్పాతికమూడువంతులు ఆదర్శీకరణమే శకుంతలాదుష్యంతు
లను గైకొందము నాటకమునందలి పాత్రములను భారతమునందలి
పాత్రములతో పోల్చిచూచినచో నాదర్శీకరణ మననేమో మనకు
మరింత విస్పష్టమగును కాళిదాసు నాటకమునకు మూలము భారతము
నందలి శకుంతలోపాఖ్యానమేకదా! అయినప్పుడు శకుంతలోపాఖ్యానము
నందలి పాత్రములను యధామాతృకముగ తన నాటకములో చిత్రించి
నాడా? లేదు అట్లు చిత్రించియుండినచో దుష్యంతునియందు దోష
మారోపితము కావలసివచ్చుచున్నది మూలమున కణ్వాశ్రమము
నుండి శకుంతల రాజసభకు వచ్చినపుడు ఆమె నెఱిగియుండియు ఎరు
గనివానివలె నటించి వాక్పారుష్య మవలంబించినాడని యున్నది.
ఎంతో నమ్మించి గాంధర్వవివాహమున కొడబరచిన శకుంతలను ఎవ్వ
రును సాక్ష్యము లేరుగదా యనిన యంశమును ఆధారముగా గైకొని
ప్రజాభిప్రాయమునకు వెఱచి "నీ వెవ్వతెవో నేనెఱుగనుపో" మ్మను
టలో దుష్యంతుని వర్తనము మిక్కిలి నీచముగా గనవచ్చుటలేదా?
మొదట నామెను తనతో సంగమమున కొడబరచుటలో కేవలము
స్వలాభముమాత్రమే చూచుకొన్నాడు. లోపల తొందరపెట్టుచున్న
కామమును కాదనలేకపోయినాడు "కరుణానిరతులయిన మాజనకుల
నడిగి నన్ను పాణిగ్రహణము చేసికొను" మని వివేకవతియగు శకుంతల
యెంతచెప్పినను వినకపోయినాడు తీర నలువురిలోనికి వచ్చుసరికి తన

గాంధర్వవివాహము నొప్పుకొనుటకు ధైర్యము లేకపోయినది. శకుంతల యెట్లును తనమాహాత్మ్యముచే సత్యమును నిరూపించుకొనగలదు గదా యనిన ధైర్యముతో నట్లు వర్తించినాడని సమర్థింపవచ్చును గాని ఆ సమర్థనమైనను దుష్యంతునిపాత్రమున కెంతగౌరవప్రదముగ నుండునో చదువరులే గ్రహింపగలరు. కాళిదాసునకు దుష్యంతునియం దీలోపము నిరూపించుట యిష్టము లేకపోయినది అందుచే దుర్వాసుని శాప వృత్తాంతము గల్పించినాడు శాపవశమున సమ్మోహితుడై శకుంత లను నిరాకరించినాడే గాని లేకుండిన అతడిట్టిపని కొడంబడని ఆదర్శ పురుషుడని చిత్రించుటయే కాళిదాసుని యుద్దేశము అందుచే దుష్యం తుని పాత్రచిత్రణమున ఆదర్శీకరణ మనువిధానము విస్పష్టమగు చున్నది. దుష్యంతుని సమర్థించు సందర్భమున శకుంతలను నెపపెట్టుట కూడ కాళిదాసున కభిమతము కాదు అందుచే ఆమెపై కూడ దోష మారోపితము కాజాలని ప్రక్రియ వెదకవలసివచ్చినది పతినిగూర్చి ఆమె శరీరమే మరచిపోయి తదేకదృష్టితో నాలోచించుచున్నట్లు చిత్రించినాడు. అట్టిస్థితిలో దుర్వాసుడు వచ్చినాడో పోయినాడో చూడకపోవుటలో నామెకు స్వాతంత్ర్యమేమున్నది ? ఇక ఆమెయందు మాత్రము దోష మెట్లు నిరూపితము కాగలదు ? ఇట్లు —

"త్వ మర్హతాం ప్రాగ్రసరః స్మృతో౾సి నః శకుంతలా మూర్తిమతీవ సత్క్రియా,
స మానయం స్తుల్యగుణం వధూవరం చిరాయ వాచ్యం నగతః ప్రజాపతిః"

అను కణ్వవాక్యమున కనుగుణముగ కాళిదాసు శకుంతలాదుష్యంతు లను చిత్రించుకొనివచ్చినాడు

"ఈ శకుంతలాదుష్యంతుల చిత్రణము మూలమునందలి యనౌ చిత్యములను పరిహరించుచున్న"దని మాత్రము చెప్పరాదు మూల మున ననౌచిత్యము నారోపించుటకే వలనుపడదు చిత్రించు పాత్ర ములో — అది నాయకపాత్రమే కానిండు — ఎక్కడను ఏలోపమును లేకుండ చిత్రింపవలె నను బాధ్యత కవి కెన్నడును లేదు భారతము

నందలి పాత్రీకరణము స్వభావమునకు సన్నిహితముగ నున్నది జగన్మోహన మూర్తియగు శకుంతలనుజూచి దుష్యంతు డుద్రిక్తుడగుటయు, తరువాత కణ్వాశాసనమునకు ప్రజాభిప్రాయమునకు వెరచి విపరీత వర్తనుడగుటయు సహజము అది పాత్రములో, అనగా దుష్యంతుని శీలమునకు లోపమేకావచ్చును కాని పాత్రీకరణములోమాత్రమనౌచిత్యము కానేరదు. దుష్యంతుడు సద్గుణసముద్రుడే కాని ఈ యొక్క యంశమునమాత్రము విపరీతముగ వర్తించినాడు అని నిరూపించుటయే భారతకారుని యాశయము. అతనిచిత్రణము యథార్థమునకు సన్నిహితముగ నున్నది కావున దానిని యథార్థ ప్రదర్శనమంటిమి కాళిదాసు శకుంతలాదుష్యంతులలో లోపలేశమైనను లేకుండ చిత్రించుటకు పాటుపడినాడు కావున అతని చిత్రణమును ఆదర్శీకరణ మనవలసివచ్చుచున్నది

ఈ యాదర్శీకరణ మింకొక ఘట్టమునగూడ ప్రత్యక్షమగుచున్నది అది శకుంతలాపాత్రమునకు సంబంధించినది మూలములో ప్రత్యాదేశించినపుడు శకుంతల దుష్యంతుని అనరాని మాటలన్నది "ఇట్టి యనృత మాడుచున్నందులకు నీతల వేయిచెక్కలుగావలదా ?" అని శపించునంతదూరముకూడ పోయినది కోపము వచ్చినపుడు ఒడలుమరచి మాటాడుట యథార్థమునకు సన్నిహితము. కాని కాళిదాసు ఈఘట్టమున శకుంతలచే దుష్యంతు నంత పరుషముగ తిట్టింపలేదు తన భాగధేయమునే నిందించుకొనుచు, "భగవతి వసుమతి దేహి మే వివరమ్" అని యామె సభనుండి వెడలిపోయినది పతివ్రతయయిన శకుంతలచే భర్తను దూషింపజేయుటకు కాళిదాసు ఒప్పుకొనలేదు ఈ యంశమునుగూర్చి నాటకమును మూలముతో సరిపోల్చు ఘట్టమున నింకను దీర్ఘముగుచర్చ యున్నదిగాన ప్రకృతము విరమింతము. ఈ ఘట్టమునగూడ "భారతమునందలి యనౌచిత్యమును కాళిదాసు పరిహరించినా"డని మాత్రము వ్రాకున్వరాదు శకుంతలలో

పాఖ్యానమునందలి పాత్రీకరణము ఒకపద్ధతి నవలంబించినది, కాళి దాసుని పాత్రీకరణము వేరొకమార్గమున బోయినది

## — ఆదర్శీకరణమున కాళిదాసుని విశిష్టత —

ఈ యాదర్శీకరణమున ముఖ్యముగ సిద్ధించు ననర్థ మేమనగా, నది విశ్వాసమును గోలుపనేరదు చిత్రణమును చూచినపుడు "ఇది నిజమే" యనిపింపదు కాని కాళిదాసుని విశేష మేమనగా, ఆదర్శీ కరణముకూడ యథార్థప్రదర్శనమా యను విభ్రాంతి యుదయింప జేయజాలిన కౌశలముతో నాత డాదర్శీకరణము నిర్వహించినాడు. ఒక్క శాకుంతలమునందే కాదు—కుమారసంభవమునందు, రఘువంశ మునందుకూడ నంతే చిత్రించిన పాత్రములందు ఆదర్శీకరణము నిరూ ఢము. కాని ఆస్వాదించు చదువరికిమాత్ర మవి సజీవములయి చైతన్య సంపదతో నలరారుచుండును ఇట్లు చేయగల్గుట మిగుల నపురూపమే

## — ఆదర్శీకరణమునందలి యనర్థములు —

### 1 విశ్వాసరాహిత్యము

కాని ఒక్కొక్క ఘట్టమునమాత్రము కాళిదాసుని చిత్రణ ములనుగూర్చికూడ విశ్వాసరాహిత్య తీర్మానమును ప్రవేశపెట్టవలెనని బుద్ధిపుట్టుచుండును అట్టిఘట్టములు శాకుంతలములోకూడ లేక పోలేదు

"శిష్యః —అహో ! మహానుభావః ఖలు పార్థివో దుష్యంతః, యత్ప్రవిష్టమాత్రఏ వాశ్రమపదం తత్రభవతి రాజని నిరుపప్లవాని నః కర్మాణి సంవృత్తాని

కాకథా బాణసంధానే జ్యాశబ్దేనైవ దూరతః

హుంకారేణేవ ధనుషః స్వహి విఘ్నా నపోహతి"

అనుభాగమును చదువునపుడు మనకెంతమాత్రము నమ్మక ముదయిం చుటలేదు. ఇట్లే—

"కంచుకీ — నకిల శ్రుతం యువాభ్యాం యథా వాసంతికై స్తరుభిరపి దేవస్య శాసనం ప్రమాణీకృతం, తదాశ్రయిభిః పత్రిభిశ్చ ? తథాహి—

చూతానాం చిరనిర్గతాపి కలికా
బధ్నాతి న స్వం రజః
సన్నద్ధం యదపి స్థితం కురవకం
తత్కోరకావస్థయా
కంఠేషు స్ఖలితం గతేఽపి శిశిరే
పుంస్కోకిలానాం రుతం
శంకే సంహరతి స్మరోఽపి చకిత
స్తూణార్ధకృష్టం శరమ్ ”

అను భాగముకూడ విశ్వాస ముదయింప జేయునది గా లేదు శకుం
తలాపాత్ర చిత్రణమునకూడ—

“క్షౌమం కేనచి దిందుపాండుతరుణా
మాంగల్య మావిష్కృతం
నిష్ఠ్యూత శ్చరణోపభోగసులభో
లాక్షారసః కేనచిత్,
అన్యేభ్యో వనదేవతాకరతలై
రాపర్వభాగోత్థితై
ర్దత్తా న్యాభరణాని తత్కిసలయో
ద్భేదప్రతిద్వంద్విభిః”

ఇత్యాదిభాగములు విశ్వాసజనకములుగ లేవు. కాని మొత్తముమీద
నవి దుష్యంతపాత్రచిత్రణము నందలి కొన్ని యతిశయోక్తులు పట్టు
బడునంత సులభముగ పట్టుబడుటలేదు. ప్రధానపాత్ర చిత్రణముననే
కాదు—

“సహజంకిల యద్వినిందితం
నఖలు తత్కర్మ వివర్జనీయమ్
పశుమారణకర్మదారుణః
అనుకంపామృదురేవ శ్రోత్రియః”

“ఇది పల్లెవాడు పలికినవాక్కు కానేరదు. ఇందు కాళిదాసు
సులభముగ దొరకిపోవుచున్నాడు” అనిపించుచున్నది. కవి యెప్పు
డును తన పాత్రముల ద్వారా మాటాడుచు నుండునే యనుకొనుడు.

కాని పట్టుబడరాదు. అందులోనే కళాప్రాగల్భ్య మున్నది.

కాళిదాసు మానవమాత్రులగు దుష్యంతాదులను చిత్రించు టలోకూడ వారికి దైవమహిమ మారోపించి యాదర్శీకరించుచుం డగా వాల్మీకిమున్నగు మహర్షులు అవతారపురుషులను చిత్రించు టలోకూడ సాధ్యమగునంతవరకు వారి మహిమలను దూరముగ నుంచి వారిని మానవమాత్రులుగనే చిత్రించుటకు పాటుబడిరి అందు చేతనే వారు కాళిదాసుకంటె ఎన్నిరెట్లో మదుంగులు ప్రశంసింపదగిన ఉత్తమశిల్పు లగుచున్నారు ఆదర్శీకరణము విశ్వాస ముదయింపజేయు దను రహస్యమును వారు పూర్ణముగ గుర్తించినవా రగుచున్నారు

## 11 గాంభీర్యము కొఱవడును

ఆదర్శీకరణమునందు ఇంకొక అనర్థముకూడ గోచరించు చున్నది తాను ఉచిత మనుకొనిన యాదర్శమునకు సృష్టిలోని యుదం తములు అనుగుణముగ లేవనిగదా ఆదర్శీకరణకారుడు సృష్టియందలి నిమ్నోన్నతములను సవరింప జూచుచున్నాడు ? ధర్మరాజు అసత్య మాడినా డనుకొనుడు ధర్మరాజువంటి ఉత్తమునిచే నసత్యమాడించుట యనుచితముగ దోచి దానిని ఆదర్శీకరణకారుడు పరిహరింప జూచు చున్నాడు. అదే యథార్థ ప్రదర్శకుడగుసచో ఎట్టి యుత్తమస్వభా వము కలవాడుకూడ ఒక్కొక్కప్పుడు అబద్ధమాడుట లోకములో నున్న దేకదాయని యథాతథముగ చిత్రించుచున్నాడు. సృష్టియందలి నిమ్నోన్నతముల నున్నవాని నున్నట్లుగనే చిత్రించి వానిరహస్యములను కనుగొనబూనుటవలననే కళ సత్యమునకు సన్నిహితముగ నుండి ఎక్కుడు గాంభీర్యమును సాధించుచున్నది. ఆదర్శీకరణమునందలి యౌచిత్య నిర్వా హణ మొక్కొక్కప్పుడు కవిసమయము (Convention) కంటె నెక్కువస్థానము నాక్రమింపలేక పోవుచున్నది.

శాకుంతలమున ప్రధానపాత్రములు ఎక్కుడుగ ఆదర్శీకరణ

సూత్రమునకే లక్ష్యభూతము లగుచున్నను ఇతర పాత్రములు కొన్ని యథార్థప్రదర్శనములో గూడ జేరుచున్నవి.

### —♦ కణ్వుడు ♦—

కణ్వుని పాత్రచిత్రణమును గైకొందము ఈతడు కులపతి.

"రాజా — అథ భగవాన్ లోకానుగ్రహాయ కుశలీ కాశ్యపః?
శార్ఙ్గరవః — స్వాధీనకుశలాః సిద్ధిమంతః"

ఇత్యాది వాక్యములవలన గుణాతీతుడగు సిద్ధపురుషుడనుట స్పష్టము. కాని ప్రప్రథమమున మనకు ప్రత్యక్షమగుటలో లలితమైన విషాదముతో ప్రత్యక్షమగుచున్నాడు

"యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠః స్తంభితబాష్పవృత్తికలుష శ్చింతాజడం దర్శనమ్
వైక్లబ్యం మమతావ దీదృశమహో స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథంను తనయా విశ్లేషదుఃఖైర్నవైః"

ఈ లలితమైన విషాదమే ఈ పాత్రమునకు ప్రాణము ఈ మంగళవిషాదము కణ్వుని పాత్రమునకేగాక చతుర్థాంకమునకెల్ల ప్రాణపద మగుచున్నది శకుంతలకు తలిదండ్రు లుండియు లేనివారైరి. కాశ్యపులు శాశ్వతబ్రహ్మచర్య నిష్ఠితులగుటచే తలిదండ్రుల ఇరువురి ప్రేమను తమ హృదయమునుండియే స్రవింపజేయవలసినవారైరి. కేవలము సిద్ధపురుషులుగ — అనగా సామాన్యమానవులకు అతీతమగు భూములలో నుంచి — వారిని చిత్రింపక గృహస్థు లందరికిని అనుభవైకవేద్య మగు మంగళవిషాదభారముతో వారిని కాళిదాసు ప్రత్యక్షీకరించుచున్నాడు.

"శమ మేష్యతి మే శోకః కథంను వత్సే త్వయా రచితపూర్వమ్,
ఉటజద్వారవిరూఢం నీవారబలిం విలోకయతః"

"అర్థోహి కన్యా పరకీయ ఏవ తా మద్య సంప్రేష్య పరిగ్రహీతుః
జాతో మమాయం విశదః ప్రకామం ప్రత్యర్పితన్యాస ఇవాంతరాత్మా"

పెంచి పెద్దదానిని జేసిన కూతురి వియోగమునకై విషాదము కాని ఆమె పతిని జేరబోవుచున్న శుభసమయమున కంట తడిపెట్టరాదే

యును సంకోచము ఈ భావముల సంఘట్టనము గృహస్థులెల్లరకు అను భవవేద్యమేగదా! ఈ భావములను చతుర్థాంకమున కాళిదాసు మూ ర్తీ భవింపజేసి మానవహృదయమును చూఱగొనుచున్నాడు మానవ హృదయమును ఇంతగ నాకర్షించుఘట్టము వేరొకటి ఈ నాటకమున లేదు అందుచేతనే కొందరు విమర్శకులు చతుర్థాంకమునకును, శ్లోక చతుష్టయమునకును ప్రాముఖ్య మిచ్చుటకు కారణమైనది

## —♦ శార్ఙ్గరవ శారద్వతులు ♦—

శార్ఙ్గరవశారద్వతుల చిత్రణముకూడ యథార్థ ప్రదర్శనము ననే జేరుచున్నది వీరిరువురు బహుశః ఆశ్రమముననే పుట్టి పెరిగియుం దురు అందుచే నగరము ప్రవేశింపగనే—

> "తథాపీదం శశ్వ త్పరిచితవివిక్తేన మనసా
> జనాకీర్ణం మన్యే హుతవహాపరీతం గృహమివ
> అభ్యక్తమివ స్నాతః శుచి రశుచిమివ ప్రబుద్ధఇవ సుప్తమ్
> బద్ధమివ స్వైరగతి ర్జనమిహ సుఖసంగిన మవైమి"

అని పలుకుచున్నారు. పైనుదహరించిన శ్లోకములు వీరి పాత్రమునకు కీలకములు. నగరములో ప్రవేశించినది మొదలుకొని ఈనగరమును వీడి మరల ఎప్పుడు ఆశ్రమమును జేరుకొందమన్న యాత్రతయే కాని "వచ్చిన పనియేమి? దానికి తటస్థించిన యాటంకమేమి? దీనిని చక్క బెట్టుకొను నుపాయమేమి!" అను నాలోచనము వీరికి లేకపోయినది. అందుచే వీరు ఒకవైపు రాజును, ఇంకొకవైపు శకుంతలను చెడమడ దిట్టుచున్నారు: "కిము త్తరో త్తరేణ? అనుష్ఠితో గురుని దేశః. ప్రతిని వర్తామహే వయమ్" అని శకుంతలకాపురమును పొత్తుపరుపకుండ వెను కకు మరలుచున్నారు వీరు తొందరపడు న్యాత్రగాండ్రు కాకుండిన శకుంతలకాపుర మంత శీఘ్రముగ చెడిపోయియుండదేమో అయితే వీరి హృదయములు మంచివి. మాటమాత్రము పోటు. లోకజ్ఞానము

పూర్ణముగ శూన్యము—ఇట్టి పరస్పరవిరుద్ధగుణములను వీరిలో సంపుటీకరించి కాళిదాసు మనకు పార్శ్వపదు డగుచున్నాడు.

—♦ అనసూయా ప్రియంవదలు ♦—

ఇక శకుంతలచెలికత్తెలగు అనసూయా ప్రియంవదలను చిత్రించిన విధానమునుగూడ గొంత విమర్శింపవలసియున్నది శకుంతలపై గంభీరమైన యనురాగముతో ఆమెకు ప్రియసమాగమమును సంఘటించు నైపుణ్యముతో ఆమెతో లలితములగు, నర్మగర్భితములగు, ఆశ్రమవాసులకు అనుచితములుకాని హాస్యోక్తులతో క్రీడించు మానసికోల్లాసముతో — చమత్కృతితో వీరు ప్రత్యక్షమగుచున్నారు.

'సఖ్యౌ —సఖి శకుంతలే, య ద్యద్య తాతః సన్నిహితో భవేత్ . ..''

అను పరిహాసగర్భితవాక్యమును దిలకింపుడు. దీనికి శకుంతలకు కోపము రాగానే ఆవాక్యమునకు మొదట ఉద్దేశించిన గమనమును మార్చుకొని "ఇమం జీవితసర్వస్వే నాప్యతిథిం కృతార్థీకరిష్యతి" అని త్రిప్పివేయుటలో నున్న చమత్కృతిని గమనింపుడు ఇప్పటికిని అందులో గర్భీకృతమైయున్న ధ్వనిప్రాగల్భ్యమున కానందింపుడు యౌవనమునకు, సౌందర్యమునకు, చమత్కృతికి సార్వభౌమపదము నధిష్ఠించిన మదముతో—మానసికోల్లాసముతో ఈ పాత్రములు కందుకములవలె తూలుచున్నవి. "కే ఆవామ్ పరిత్రాతుమ్? దుష్యంత మాక్రంద రాజరక్షితాని తపోవనానినామ" అని కెవ్వున కేకలువేయుచు కేరుచున్నవి. ఇట్టి పాత్రచిత్రణ మప్రధానపాత్రముల నాశ్రయించినది గాని నాటకమంతయు నిట్టి పాత్రచిత్రణముతోనే నిండియుండిన శాకుంతలము ఇప్పటికంటెను మిక్కిలి మనోహరముగ నుండియుండెడిదిగదా!

—♦ కాళిదాసు-షేక్స్పియరు ♦—

ఒక పాశ్చాత్యవిమర్శకుడు కాళిదాసునిగూర్చి "He is the Shakespeare of the Indian Drama" అని పల్కినాడని మనవారు లబ్బిబ్బయి పోవుచున్నారు కాని, ఈవాక్యము సత్యసమ్మతము కాదను

టకు ఈ పాత్రీకరణపరిశోధన మొక యాధారము. కాళిదాసును, షేక్స్పి యరును ఒకజాతి కవులుగారు ఇరువురును నాటకములు రచించినవారే గదా యను స్థూలదృష్టి ననుసరించి ఇరువురను ఒండొరులతో పోల్చి జూచుట సాహసము తాత్త్వికముగ ఇరువురును ఒకజాతికి చెందిన కవు లయినపుడే ఒండొరులతో పోల్చి విమర్శించుటకు వలనుపడును. "Comparisons are always odious" అని కవుల నొకరితో నొక రిని పోల్పనేరాదను వాదము నాకు సమ్మతముకాదు. ఇకముందు వాఙ్మ యమునందును, లలితకళలందును జరగవలసినది సమవిమర్శనమే (Comparitive criticism) దీనివలన ఎన్నియో అమూల్యరహస్య ములు కళారాధకులకు గోచరింపగలవు కాని సరిపోల్చునపుడు ఏకజాతి కవులనే సరిపోల్చుట అభ్యుచితము ఏర్పరచుకొన్న ఆదర్శములందును, అవలంబించిన విధానములందును కాళిదాసును, షేక్స్పియరును భిన్న జాతికవులు. వారికంటె వీ రెక్కువయని కాని, వీరికంటె వారెక్కువ యనికాని నిరూపించుటకు వలనుపడదు పాత్రీకరణమున కాళిదాసు అవలంబించిన ప్రధానవిధానము ఆదర్శీకరణము షేక్స్పియరు అవలం బించిన విధానము యధార్థప్రదర్శనము అందుచే షేక్స్పియరు పాత్రీ కరణవిధానమును భారతకారునివంటి యధార్థప్రదర్శకుల పాత్రీకరణ ముతో సరిపోల్పవచ్చును గాని కాళిదాసుని ఆదర్శీకరణముతో సరి పోల్చుటకు వలనుపడదు

# శాకుంతల విమర్శనము

## పాత్రోచితభాష – ప్రత్యోత్తరకల్పనము

నాటకములలో పాత్రోచితభాష వాడవలెనను సిద్ధాంతము పాశ్చాత్యవిమర్శకులును, పూర్వాలంకారికులునుగూడ ఏకగ్రీవముగ నంగీకరించినదే. కాని ఈ సిద్ధాంతమునకు కొందరు నవీనులు విపరీతవ్యాప్తి గల్పించుచున్నారు. అందుచే దీనినించుక నావకాశముగ బరిశీలింప వలసియున్నది

### —♦ పాత్రోచితభాష—నవీనుల విపరీతకల్పనలు ♦—

వ్యక్తులకు ఉచితమైన భాషయే పాత్రోచితభాషయని కొందరు పొరబడుచున్నారు. 'శివాజీ' అను తెనుగునాటకములో ఔరంగజేబు పాత్రముచే మాటాడింపవలసి వచ్చినదనుకొనుడు. అప్పుడు ఔరంగజేబు వ్యక్తితః ఏభాష మాటాడియుండునో ఆభాషనే–అనగా ఉర్దూను గాని, పర్షియన్ భాషనుగాని– వాడవలెనని కొందరి మతము. ఈసిద్ధాంతమే యవలంబింపవలసి వచ్చినచో సిద్ధించు ననర్థములకు హద్దులేదు. శివాజీచేతను, అతని యనుచరులచేతను మహారాష్ట్రభాష మాటాడింపవలెనుగదా! ఔరంగజేబుచేతను, ఆయన యనుచరులచేతను పర్షియన్ గాని, ఉర్దూగాని మాటాడింపవలెనుగదా! ఇంక తెనుగుభాష కవకాశమేమున్నది? అది తెనుగులో రచించిన నాటకమెట్లగును? ఇంకను కొందరు విపరీతవాదులు అట్టి యితివృత్తములను గైకొని తెనుగులో నాటకములే వ్రాయరాదనుచున్నారు వీరి వాదమునే యంగీకరింపవలసివచ్చినచో ఇప్పుడు ప్రపంచమున నుత్తమనాటకములుగ పరిగణింపబడువాని నెన్నిటినో త్రోసిరాజనవలసి వచ్చుచున్నది 'హ్యామ్లెటు' నాటకమును గైకొనుడు ఇందలి యితివృత్తము డెన్మార్కు దేశమునకు

సంబంధించినది ఇందు పాత్రములుగ చిత్రింపబడిన వ్యక్తులెవ్వియును ఇంగ్లీషుభాషా పరిచయముగలవి యగుట కవకాశము లేదు అందుచే నీనాటకము నింగ్లీషులో వ్రాయనేకూడ దందుమా? ప్రకృతము విమర్శనీయమగు శాకుంతలమునే గైకొనుడు శకుంతలా దుష్యంతులు, కణ్వుడు ఏభాషలో మాటాడియుందురో ఎవరు చెప్పగలరు? ఇట్టివాదమునే యంగీకరించినచో ఇంకొక దేశమునగాని, ఇంకొక రాష్ట్రమునగాని ప్రసిద్ధములగు చక్కని నాటకీయ ఇతివృత్తముల నన్నిటిని వదలుకొని ఏకొలది సాంఘికేతివృత్తములతోనో, రాష్ట్రీయ చారిత్రకగాథలతోనో గుడుగుడుగుంచము లాడవలసివచ్చునుగదా!

## —♦ వాస్తవికార్థము ♦—

మన భాగ్యవశమున నైవాదములో నంతసారము సున్న. వ్యక్త్యుచితభాషకును, పాత్రోచితభాషకును ఎంతో తారతమ్యమున్నది పూర్వాచార్యులు నాటకములలోని పాత్రములను ఉత్తమ, మధ్యమ, అధమ (నీచ) తరగతులుగ విభజించుకొని ఆయా తరగతుల కనుగుణముగ సంస్కృతమునుగాని, కొన్నికొన్ని ప్రాకృతములనుగాని ఉపయోగింపవలసినదిగ సూచించియున్నారు ఈసూచనలో నంతర్యాభూతమైన సిద్ధాంతమును మనము గ్రహింపదగియున్నది

పాత్రోచితభాష యనగా పాత్రముల తరగతికి ఉచితమైన భాష యనిమాత్రమే అర్థముకాని ఆయాపాత్రములు వ్యక్తితః ఏభాష మాటాడియుండునో ఆభాషనే వాడవలెనని అర్థ మెన్నటికిని గానేరదు. అనగా పాత్రములు వ్యక్తితః ఏజాతికి చెందినను నాటకమును ఏభాషలో వ్రాయుచున్నామో ఆభాషనే మొదటినుండి చివరవరకు వాడవలెను పాత్రములు వ్యక్తితః మహారాష్ట్రజాతికి చెందినను తెనుగులో నాటకము వ్రాయునప్పుడు అన్నిపాత్రములకు తెనుగే వాడవలయునుగాని మహారాష్ట్రమో, మహారాష్ట్రముతో మిళితమైన తెనుగో వాడుట ఉచితముకాదు

## —♦ స్వాభావికతా సిద్ధాంతము - పూర్ణవ్యాప్తి శూన్యత ♦—

"నాటకకళ స్వభావవిరుద్ధముగ నుండరాదు స్వభావమునకు సన్నిహితముగ నుండవలెనన్న ఆయాపాత్రలు ఏభాషను మాటాడి యుందురో ఆభాషనే ప్రవేశపెట్టుట ఉచితము" అని కొందరి మతము. కాని గాఢముగ నాలోచించినచో ఈస్వాభావికతా సిద్ధాంతమునకు గూడ పూర్ణవ్యాప్తిలేదు ఉన్నచో నాటకరచనము అసంభవము. ముప్పది సంవత్సరములలో జరిగిన వృత్తాంతమును మూడు గంటలలో ప్రదర్శించుచున్నాము —ఇది స్వాభావికమేనా? వివిధదేశములలో నడచిన యుదంతములను సంకుచితరంగభూమిలో ప్రదర్శించుచున్నాము— ఇది స్వాభావికమేనా?

అయితే స్వాభావికతా సిద్ధాంతమునకు నాటకకళలో ప్రసక్తియే లేదా? పూర్ణవ్యాప్తి లేదగాని ప్రసక్తియే లేకపోయినదా? కొంతవరకు స్వభావమునకు విరుద్ధముగ నుండుట కంగీకరించినమీదట స్వాభావికతకు ప్రసక్తి కలుగుచున్నది స్వాభావికతను, అస్వాభావికతను సమ్మేళనము చేయుటలోనే కవిప్రతిభకు వినియోగము

## —♦ నాటకీయ విభ్రాంతియే ప్రధానలక్ష్యము ♦—

నాటక ప్రదర్శనపు ప్రధానలక్ష్యము నాటకీయ విభ్రాంతి (Dramatic Illusion) ముప్పది సంవత్సరములలో నడచిన యితివృత్తమును మూడుగంటలలో ప్రదర్శించుచున్నను ఆ ముప్పది సంవత్సరముల కాలము గడిచినట్లు చతురుడయిన కవి చతురుడయిన నటుని సాహాయ్యమున మూడుగంటల కాలముననే ప్రేక్షకుని మనస్సులో విభ్రాంతి కల్పింపగలడు. ఈ విభ్రాంతి కల్పించుటవలననే నాటకప్రయోజనము సిద్ధించుచున్నది భాషకాని, ఇతివృత్తముగాని, మరి యే యితర అంగముకాని యీవిభ్రాంతిని సాధించుటకే సాధనములు. ఈవిభ్రాంతికి భంగము కలిగినదా నాటకరచనము అపజయమందిన దనినమాట. ఈ

విభ్రాంతి మచ్ఛేద్యముగ నున్నదా నాటకరచనము పూర్ణముగ విజయ మందిన దనినమాట. సర్వథా ఈ సూత్రమున కపవాదము కానరాదు

ఆంధ్రమున శివాజీనాటకమును రచించితిమనగా శివాజీ ఆంధ్రుడయియుండినచో ఆతని తరగతినిబట్టి ఆతడెట్టి యాంధ్రమును వాడి యుండునో అట్టి యాంధ్రముచే యాతనినోట నుంచదగును. ఈ సూత్రమునుబట్టి ఉత్తమమైన తురుష్క పాత్రములచేకూడ ఉర్దూ, తెనుగు మిశ్రమముచేసి సంకరభాషను పలికించినచో నాటకకర్త అనౌచిత్య దోషమునకు గురియగును. నీచమైన 'గులామ్' వంటి పాత్రములచే నీ మిశ్రభాషను పలికించినచో తప్పులేదు మీదుమిక్కిలి రసోద్బోధకముగకూడ నుండవచ్చును కాని ఉత్తమపాత్రములచే మాత్రము మిశ్రభాష పలికింపరాదు. ఇంగ్లీషు-తెనుగే కానిండు, ఉర్దూ - తెనుగే కానిండు రెండుభాషలను సంకరపరచి వాడగనే హాస్యరసోద్దీపకమైన వాలకము (Comic effect) తయారగును. నాటకమున గౌరవభావమును సాధింపదలచిన కవికి ఈ హాస్యరసోద్దీపకమైన వాలకము రాకుండ కాచుకొనుట విధియైయున్నది నవీన ఇతివృత్తములు గల సాంఘిక నాటకములలోనైనను గౌరవము నాశించినచో మిశ్రభాషను వాడుటకు వలనుపడదు. ఉపయోగించు వ్యావహారికమునందుకూడ పాత్రము తరగతినిబట్టి యథోచితముగ భాష మారుచుండవలెను.

## —♦ పాత్రలతరగతి నిర్ణయము ♦—

పాత్రముల తరగతినిబట్టి భాష మారవలెనను సిద్ధాంతమును ప్రతిపాదించుటచే పాత్రముల తరగతి నిర్ణయమొనర్చుట యెట్లను క్లిష్ట ప్రశ్న యుదయించుచున్నది. నవీనులు కొందరు రాజుపాత్ర (King character) రాణీపాత్ర (Queen character) అని యీ తీరుగ సాంఘికస్థితినిబట్టి పాత్రముల తరగతి నిర్ణయించుచున్నారు. పూర్వాలంకారికులు ఉత్తమ మధ్యమ అధమ తరగతులను నిర్ణయిం

చుటలోకూడ వారి విభజనము నిర్దుష్టమని యంగీకరించుటకు వలను పడకుండ నున్నది. మొత్తముమీద నిరుత్తరంగుల విమర్శకులు స్థూల దృష్టినిబట్టియే తరగతి విభజన మొనర్చినట్లు కానబడుచున్నది పాత్రీకరణ మను విద్య మానసికతత్త్వపరిశీలనముపయి నాధారపడియుండుటచే పాత్రముల తరగతిని నిర్ణయించుటలో మానసికపరిణామమునే ఆధారముగ గైకొనుట యుక్తముగ నుండును సాంఘికస్థితినిబట్టి యొకరు రాజయినను మానసిక ప్రవృత్తినిబట్టి తమోగుణ ప్రధానుడే కావచ్చును అందుచే సాంఖ్యు లవలంబించిన మానసిక తత్త్వనిర్ణయము నవలంబించి (౧) గుణాతీతులు, (౨) గుణబద్ధులు అని రెండు తరగతులుగ పాత్రములను విభజించుకొని గుణబద్ధులలో మరల సత్త్వరజస్తమోగుణముల కలయికచే నుదయించు భేదముల నన్నిటిని గమనించి తదనుగుణముగ భాష మార్చుకొనుచుండుట తత్త్వతః నిర్దుష్టముగ నుండును.

ఇక్కడకు తేలిన సారాంశ మేమనగా— నాటకీయ విభ్రాంతికి పోషకముగ నుండు పద్ధతిని పాత్రముల మానసికసంస్కారము ననుసరించి భాషను వాడుటయే పాత్రోచితభాషాప్రయోగ మనిపించుకొనును. అంతేగాని ఆయాపాత్రములు వ్యక్తితః ఏభాషను మాటాడియుందురను ప్రశ్నతో నాటకకర్తకు ప్రసక్తి లేదు

**—♦ తాదాత్మ్యసిద్ధి యున్నచో ప్రయత్నమే అక్కరలేదు ♦—**

గాఢమయిన తాదాత్మ్యసిద్ధితో నాటకము రచించుచున్నపుడు కవికి ఈ పాత్రోచిత భాషాప్రయోగము అప్రయత్నముగ నలవడును వృత్తములను రచించుచున్నప్పుడు సిద్ధహస్తుడగు కవికి ఏతీరున గణములను గుణించుకొనవలసిన యగత్య ముండదో ఆ తీరుననే సాంద్రమయిన తాదాత్మ్యసిద్ధిగల నాటకరచయితకు ఆయాపాత్రములను పలికింపవలసినపుడు పాత్రముల మానసిక ప్రవృత్తులను, వానిని పురస్క-

రించుకొని మారవలసిన పాత్రోచిత భాషయు కరతలామలకములగును వానినిగూర్చి ప్రత్యేకించి శ్రమపడవలసిన యగత్యముండదు

— ♦ కాళిదాసు దృష్టాంతము ♦ —

పైని వివరించిన సిద్ధాంతములు కాళిదాసుని దృష్టిలో నుండక పోవచ్చును బుద్ధిపూర్వకముగ ననుసరించుటలో పాత్రోచితభాషా విరచనమున నాతడు పూర్వాచార్యులనే యనుసరించియుండవచ్చును. కాని సాంద్రమయిన తాదాత్మ్యసిద్ధితో పాత్రీకరణ మొనర్చివాడగుటచే నాతని పాత్రోచిత భాషాప్రయోగమున పైసూత్రము లన్నియు ప్రత్యక్షము లగుచున్నవి కణ్వుడు వాడిన భాషకును దుష్యంతుడు వాడిన భాషకును (రెండును పురుషపాత్రములే యైనను), శకుంతల వాడిన భాషకును అనసూయా ప్రియంవదలువాడిన భాషకును (మువ్వురును స్త్రీపాత్రములే యైనను), విదూషకుడు వాడిన భాషకును పల్లెవాడు వాడినభాషకును ఆయాపాత్రముల చిత్తసంస్కారమునందలి భేదమును పురస్కరించుకొని సిద్ధించిన పాత్రోచితభాషలో గల యౌచిత్యమును, శైలివిభేదమును గమనింపదగును ఒకేపాత్రమే మొదటినుండి తుదివరకు ఒకేభాషను వాడుటకుకూడ వలనుపడదు. ఆపాత్రముల మానసికస్థితిలో తటస్థించు అవస్థాభేదములనుబట్టియు, ప్రతిపాదింపబడు విషయౌదాత్త్యమునుబట్టియు భాష మారుచుండును. చూడుడు. అదివరలో ప్రాకృతములో మాటాడుకొనుచున్నారు అనసూయా ప్రియంవదలు కాని కణ్వునకు వినిపించిన అశరీరవాక్కును వివరింపవలసివచ్చినది అందుచే వెంటనే ప్రియంవదచే సంస్కృత మాశ్రయింప జేసినాడు —

“ప్రియంవదా —(సంస్కృత మాశ్రిత్య)
దుష్యంతే నాహితం తేజో దధానాం భూతయే భువః
అవేహి తనయాం బ్రహ్మన్నగ్నిగర్భాం శమీమివ.”

అశరీరవాక్కు గౌరవమును కాపాడవలె ననిన ఈ సంస్కృతా

శ్రయము ఒకసాధనము వాడిన అలంకారమునందుగూడ ఎట్టి యౌచి
త్యమున్నదో గమనింపుడు ఇది ప్రతిపాదింపదలచుకొన్న విషయము
నందలి ఉదాత్తతను పురస్కరించుకొని శైలిలో సిద్ధించిన భేదము
ఇట్టిదే శకుంతల నాశీర్వదించునపుడు కాశ్యపుడు ఋక్ఛందస్సు నా
యించుటలోని యౌచిత్యముకూడ

"అమీ వేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః సమిద్వంతః ప్రాంతసంస్తీర్ణదర్భాః,
అపఘ్నంతో దురితం హవ్యగంధై ర్వైతానాస్త్వాం వహ్నయః పావయంతు."

ఇక్కడ కణ్వుని మనస్సు ఉత్తమమైన ఆధ్యాత్మికభూములకు పోవు
చున్నది అందుచే సామాన్యముగ వాడు ఛందస్సు నుజ్జగించి ఋక్ఛం
దస్సు నాశ్రయించినాడు

కాళిదాసుని పాత్రోచితభాషాప్రయోగమునందలి ప్రావీణ్యము
ఎట్టి యల్పవిషయములలోగూడ నెంతగాఢముగ ప్రత్యక్షమగుచున్నదో
నిరూపించుటకు ఈక్రింది వచనము సాక్షి —

"సముద్రవ్యవహారీ సార్థవాహో ధనమిత్రో నౌవ్యసనే విపన్నః అనపత్యశ్చ
తపస్వీ రాజగామీ తస్యార్థసంచయః"

అమాత్యులు పెట్టిన office note లోని భాషయిది దీనిలోని వాక్య
నిర్మాణమును తిలకింపుడు. 'అనపత్యశ్చ తపస్వీ'—ఎంత సంగ్రహముగ
నున్నది? ఎంత ప్రస్తుతము ( relevant) గ నున్నది?

దుష్యంతుడు "వినీతవేషప్రవేశ్యాని తపోవనాని నామ ఇదం
తావ ద్గృహ్యతామ్ (ఇతి సూతహస్తే ధను శ్చాభరణాని చోపనీయ)
యావ దహ మాశ్రమవాసినః ప్రత్యవేక్ష్యోపావర్తే తావ దార్ద్రపృష్ఠాః
క్రియంతాం వాజినః" అని సేవకుని కాజ్ఞయిచ్చిన భాషలోని ప్రాభ
వము గమనింపుడు. "ఆర్ద్రపృష్ఠాః క్రియంతాం వాజినః"- ప్రథమపురుష
నుపయోగించుటయు, మధ్యమపురుష నుపయోగింపకుండుటయు ప్రాభ
వపోషకము ఈ ప్రాభవమును శకుంతలా వాక్యములలోని లాలిత్య
ముతో వ్యత్యాసనిరూపణ (Contrast) మొనర్చి చూడుడు.

వత్స ! కిం సహవాసపరిత్యాగినీం మా మనుసరసి? అచిరప్రసూతయా జనన్యా వినాపి వర్ధిత ఏవ ఇదానీమపి త్వాం మయా విరహితాం తాత శ్చింతయిష్యతి నివర్తస్వ తావత్”

పాత్రము మానసికావస్థనుబట్టి, ప్రతిపాదించు విషయౌ దాత్త్యమునుబట్టి, ఇంకను ఎన్నో యితర విశేషములనుబట్టి భాషా శైలి మారుచుండును. దానిలోని రహస్యములు సిద్ధహస్తులగు కవులకును, సహృదయులగు విమర్శకులకును అనుభవగోచరము కావలసినదే గాని ప్రతి స్వల్పాంశమును సూత్రీకరించుటకు వలనుపడదు

* * *

## —♦— ప్రశ్నోత్తర కల్పనము ♦—

సంభాషణమును నిర్వహించుటలో కాళిదాసు చూపిన ప్రాగల్భ్యము ప్రత్యేక మవలంబనీయము. శాకుంతలమునం దెంత వెదకినను దీర్ఘోపన్యాసములు గానరావు మూలమున దుష్యంతుడు ప్రత్యాదేశించినపుడు శకుంతలచే భారతకారు డుపన్యాసవేదిక నెక్కించినాడు. అట్టి తరుణమునగూడ కాళిదాసు సంక్షిప్తములగు ప్రశ్నోత్తరముల తోడనే సన్నివేశమును నిర్వహించుకొనుచున్నాడు ఇంకొక విశేషము. ప్రశ్నమునుండి ఉత్తరము, ఉత్తరమునుండి ప్రశ్న జడయల్లికగ నుద్భవింపజేయు విధమునకుగూడ కాళిదాసు డాచార్యపీఠము. ఈక్రింది యుదాహరణమును గమనింపుడు

“రాజా—భగవాన్ కాశ్యపః శాశ్వతే బ్రహ్మణి స్థిత ఇతి ప్రకాశః. ఇయం వ స్సఖీ తదాత్మజేతి కథమేతత్?

అన—శృణోత్వార్యః అస్తి కౌశిక ఇతి కృత గోత్రనామధేయో మహాప్రభావో రాజర్షిః

రాజా—అస్తి, శ్రూయతే, తతః?

అన—తం నౌ సఖ్యాః ప్రభవ మవగచ్ఛ తే నోజ్ఝితాయాః శరీరసంవర్ధనాదిభిః తాతకాశ్యపోఽస్యాః పితా

రాజా—ఉజ్ఝితశబ్దేన జనితం మే కౌతూహలం ఆమూలా చ్ఛ్రోతు మిచ్ఛామి”

అని యీతీరున ముత్యాలసరమును గ్రుచ్చినట్లు ప్రశ్నోత్తరముల నదుకు కొనివచ్చినాడు మరియొక కవియైనచో శకుంతలావృత్తాంతమునంతను అనసూయచే నొక్కగుక్కలో చెప్పించియుండును చదువరికి (ప్రేక్షకునికి) ఎక్కడను విసుగు జనింపకుండ రసమును పోషించుకొనుచు మాటిమాటికి ఉల్లాసమును, కుతూహలమును ఉత్తరోత్తరముగ పెంచుటయే ఇట్టి ప్రశ్నోత్తర నిర్వాహణములవలని ప్రయోజనము

---

# శాకుంతల విమర్శనము

## పద్యరచనము

నాటకములో పద్యము లుండరాదని వాదించువారి సంఖ్య నానాటి కధికమగుచున్నది. బెర్నార్డుషా ఈ వాదమునకు గురుపీఠము.

షేక్స్పియరు మొదట పూర్ణముగ పద్యములతోడనే నాటక రచన సాగించినను రానురాను గద్యపద్య మిశ్రితములగు నాటకములను రచించెను. సంస్కృతమున నున్న నాటకములుగూడ గద్యపద్య మిశ్రితములే.

కవిప్రతిభ నిరవధికము. కేవలము గద్యములోనే వ్రాయవలె ననికాని, కేవలము పద్యములలోనే వ్రాయవలె ననికాని, లేక మిశ్ర రచన చేయవలెననికాని అనుశాసించుటకు నెవ్వరికిని అధికారములేదు. అది ప్రతిభాశాలియగు కవికే వదలివేయుట యుక్తము. ఎక్కడను ఒక్క వచనమైన లేకుండ నున్న గ్రీకునాటకములును ఎంతో రమణీయములుగ నున్నవి. ఎక్కడను పద్యమునకు ప్రసక్తియే లేకుండ రచించిన Doll's House (బొమ్మరిల్లు) వంటి నాటకములును మనోహరముగ నున్నవి. గద్యపద్య మిశ్రితములగు షేక్స్పియరు, కాళిదాసు, శూద్రకుడు మున్నగువారి నాటకములును హృదయంగమములుగ నున్నవి. కవిప్రతిభను పురస్కరించుకొని కావ్యము లారాధ్యము లగును కాని అవలంబించిన నియమములనుబట్టి ఏగ్రంథమును ఎప్పుడును గానేరదు. "అయ్యా, నేను ఒక్క స్వగతమైన నా నాటకమున వ్రాయలేదు, ఒక్కపద్యమైన జొప్పింపలేదు. అందుచే మీరు నా నాటకమును శిరసావహింపవలసియుండును" అని వాదించు రచయిత ఎవ్వరు నుండరనుకొందును. ఉన్నను అట్టివారికి చెప్పవలసిన సమాధానమిది: "నీవు

కాగితముమీద కలమే పెట్టకపోయినచో ఈ వ్రాసినదికూడ వ్రాసి యుండకపోదువుగదా! అప్పుడు నిన్ను మరింతగ శిరసావహించియుందుమే" అని

## —♦ ప్రజాదరణ ♦—

తాత్కాలికోద్రేకములు ఎట్లున్నను మొత్తముమీద గద్యపద్య మిశ్రితములగు నాటకములకే అధికమగు ప్రజాదరణమును, సహృదయామోదమును లభించుచున్నవి గాఢముగ నాలోచించినచో నట్లు లభించుటే యుక్తమని తోచుచున్నది కొంతకాలము స్థానమున, అస్థానమున పద్యములు రచించిన నాటకములకు విసిగి నాటకమున పద్యములే లేకుండిన బాగుండుననియు, అట్టి తొట్టివైద్యపు పథ్యమువలె చప్పిడివచనములతో నిండిన నాటకములు చూచి నాటకమంతయు పద్యమయముగనే యుండిన బాగుండుననియు అప్పుడప్పుడు విసుగుదలచే తోచవచ్చునుగాని నిబ్బరముగ నాలోచించినచో నాటకమున పద్యమును పదభ్రష్టమొనరింపవలెనని చేయు ప్రయత్నము అవివేకజనితమని యొప్పుకొనకతప్పదు.

## —♦ నాట్యశాస్త్ర నిర్దేశము ♦—

మనకు లభ్యములయినంతలో ప్రాచీన నాట్యశాస్త్రము లెవ్వియును నాటకమున పద్యప్రయోజనమును నిరూపించినట్లు కానరాదు. కాని నాటకమున పద్యములుమాత్ర మవశ్య ముండదగినవని యంగీకరించుచున్నవి ఈ యంశమునుగూర్చి అప్పుడు వాదనయే లేకుండుటచే దానిని సమర్థింపవలసిన యావశ్యకత లేకపోయెనేమో!

## —♦ పద్యవైశిష్ట్యము ♦—

గద్యమునకు, పద్యమునకు గల గతిభేద మొకటి ముఖ్యముగ గమనింపదగినది. ఎంత కృతహస్తుడైన కవికైనను గద్యముకంటె పద్యము ప్రయత్నసాధ్యమనుట రెండవ విశేషము. చదువరికి పద్యము

ముఖస్థమైనంత సులువుగ గద్యము కాదు. ఈ రహస్యమును గ్రహించి ఇప్పుడు మనము గద్యములో వ్రాయు శాస్త్రములను పెక్కింటిని పూర్వులు పద్యములలోనే వ్రాసిరి అందుమూలముననైన తమ గ్రంథములు కొంతవరకు శాశ్వతముగ నిలచియుండు నను నమ్మకముతో. ముద్రాయంత్రము వచ్చిన వెనుక అట్టిశ్రమ యనావశ్యక మైనది.

## —♦ అస్వాభావికములు కావు ♦—

ప్రాచీనాలంకారికులను చక్కగ పరిశోధించినవారికి నాటకమున పద్యములు అస్వాభావికము లని యంగీకరించుటకు వలనుపడకున్నది మీదుమిక్కిలి అవి అత్యంతస్వాభావికము లని యంగీకరింపవలసి యున్నది.

యథార్థవాదులకును(Realists),ఆదర్శవాదులకును (Idealists) నేడు పశ్చిమఖండములలో నడచుచున్న వాఙ్మయయుద్ధములను కావ్యరసమునకు, లోకరసమునకు గల విభేదమును నిరూపించి పూర్వాలంకారికులు ఏనాడో పరిహరించిరి. కాని మనయువకులు సంప్రదాయమును వీడి పాశ్చాత్యరచయితల పాదసేవయే ప్రధానముగ జేసికొనుచుండుటచే మన దేశమున నేడుగూడ ఇట్టి విపరీతవాదము లింకను వినబడుచున్నవి.

పద్యము లుండవలె ననువారి వాదముపై నొక ఆటంబాంబు వేయుచున్నామనుకొని "ఎవరైన పద్యములలో నేడ్చెదరా?" యని కొందరు బుద్ధిమంతులు ప్రశ్నించుచున్నారు. ఈప్రశ్నకు సమాధానము మరియొక ప్రశ్నయే "ఎవరైన వచనములోమాత్ర మేడ్చెదరా?" ఏడుపు ఏడుపే. అది వచనములోను గాదు, పద్యములోను గాదు. కవి ఆ యేడుపునే తన నాటకములోనికి కాపీచేయవలసివచ్చినచో నదియెంత రసాభావముగ నుండునో యూహింపుడు. లోకమున పిల్లవాడు పోవగ నేడ్చుచున్న తల్లియొద్ద నొక్క నిముషమైన నిలువ లేము. అదే యభి

మన్యుని మరణ సందర్భమున సుభద్రావిలాప మయినచో పదేపదే చదివి యానందింతుము కావ్యరసమునకు, లోకరసమునకు గల తారతమ్యమే యది లోకరసములో నున్న జుగుప్సను పరిహరించి కవి యా భావముల నాస్వాదనయోగ్యముగ, ననగా కావ్యరసముగా మార్చుచున్నాడు ఇట్లు కరుణరసమునకుగూడ ఆనందమె ప్రయోజనముగు చున్నది కావ్యరసమునకు, లోకరసమునకు గల యీ విశేషమును గమనింపక షేక్స్పియరు, షావంటి ఉపజ్ఞాశాలులే ఒక్కొక్కచో పెడదారులను దొరిక్కుచు వచ్చిరి కావ్యరసము ఆస్వాదనయోగ్యముగ నొనర్చుటకును, కావ్యమునకు లక్ష్యమగు మహార్థమును మానవహృదయములో గాఢముగ హత్తుకొనునట్లు చేయుటకును విదగ్ధుడైన కవి అనేకసాధనముల నవలంబించును. అంగ పద్యరచనము, పదరచనము ముఖ్యములయినవి.

ఉత్తమ మానసికస్థితిలో భావములు తమంతతాముగ నొకవిధమయిన గతివిభేదముతో నుదయించును. దీనికొక చిన్న యుదాహరణ "నీవు బజారునకు పోవుదువా?" "ఆ" "పాపము పొరుగింటివారి పిల్లవాడు పోయినాడటరా?" "ఆః" రెండింటిలోను ఉచ్చరించునది "ఆ" యను నక్షరమే. కాని ఎంత స్వర (గతి) భేదముతో నుచ్చరింపబడుచున్నది? మనస్సు రసార్ద్రమయినప్పుడు మాటకుగూడ గతిభేదము తప్పదు ఈ రహస్యముచే యింకను సూక్ష్మముగ పరిశీలించినచో వేదములు మున్నగు మహోత్తమవాఙ్మయము స్వరప్రధాన మెందులకు కావలసివచ్చెనో విశదము కాకపోదు ఈ స్వరప్రాధాన్య సిద్ధాంతములోనున్న సత్యమే పద్యరచనమునందును పదరచనమునందును గానవచ్చుచున్నది మనస్సు భక్త్యావేశమున తన్మయ మయినపుడు పాటలు తమంతతాముగ భక్తునినోటినుండి యుదయించును అదివరలో నేమియు విద్యాగంధము లేని తుకారామువంటి భక్తులొక్కమారుగ వేనకువేలు 'అభంగము'లకు కర్తలయిరని వినుచున్నాముగదా !

పద్యము లస్వాభావికమని వాదించువారికి స్వభావమన నేమో తెలియదని చెప్పవలసివచ్చును పాము కరచినవానికి వేపాకు తియ్యగ నుండునట్లు, పైత్యించినవానికి పంచదార చేదుగనుండునట్లు విపరీత విమర్శకులకు నాటకమున గద్యము సహజము, పద్యము అసహజము అనిపించుచుండును

## —♦ స్థాయి త్రయము ♦—

పరిశోధించినచో నాటకమందలి భావసంచరణమునకు ముఖ్యముగ మూడు 'స్థాయిలు' కనుపించుచున్నవి సంగీతమునందువలెనే దీనిని మనము మంద్ర మధ్యమ తారకస్థాయులని పేర్కొందము వ్యవహారకాండకు, కేవల కథానిర్వాహణకు సంబంధించిన సంభాషణమంతయు మంద్రస్థాయిలోనిది. ఈ స్థాయిలో పద్యములకు ప్రసక్తి యుండదు. మొట్టమొదట రచించిన Comedy of Errors మున్నగు నాటకములలో నీస్థాయిలోకూడ షేక్స్పియరు పద్యము లుంచినాడు. కాని కాళిదాసు నాటకములలో మాత్ర మీ స్థాయిలో నెక్కడను పద్యములు కానరావు. ఇక రెండవస్థాయి మధ్యమస్థాయి. ఈ స్థాయిలో భావము ద్రవీభూత మగుచుండును. కథానిర్వాహణముకంటె రససంచారమే ప్రధానము. ఇట్టి స్థాయిలోనే కాళిదాసు పద్యములన్నియు నున్నవి ఈ స్థాయిని మనము మరల రెండుభాగములు చేసికొనవలసియున్నది: (౧) ద్రుతావస్థ, (౨) ద్రుతతరావస్థ ద్రుతావస్థలో పద్యములు ప్రయోజనకారు లగుచున్నవి ద్రుతతరావస్థలో పద్యములలో నున్న లయపరిపోదు ఇంక భావమింకను ఆర్ద్రమయి ద్రుతతరగతి నందును అందుచే పదములు (కీర్తనలు) కావలసి వచ్చుచున్నవి. ఇక్కడ సాహిత్యము లాస్యమునకో తాండవమునకో యనుగుణముగ నున్నగాని భావసంచారము నెరవేరదు విక్రమోర్వశీయము చతుర్థాంకము తిలకించితిమేని ఈ యంశము విస్పష్టము కాగలదు. ఊర్వశీవియోగమున నున్మాదమును బ్రాపించిన రాజు అవస్థను ప్రదర్శించుటకు

'చర్చరీ' మున్నగు నృత్యప్రధానములగు ప్రక్రియలు తరువాతివారు చేర్చుకొనిరి. భక్తుల భక్తికూడ ఉద్రేకావస్థను ప్రాపించినపుడు కీర్తనలుగాని, కృతులుగాని ప్రవేశపెట్టి తదనుగుణముగ నృత్యమున కవకాశ మీయవలసియున్నది. ఇట్టి ప్రక్రియల నన్నిటిని భరతనాట్యశాస్త్రము పూర్ణముగ నామోదించుచున్నది. ఇక మూడవది తారకస్థాయి. ఈ స్థాయిలో భావము మాటల కందదు. హిమరేఖను (Snow line) దాటిపోవుచుండును. ఇది రసమునకు ఉత్కంఠదశ. ఈ దశలో భావశబలత, భావసంఘట్టనము సహజములు. అందుచే కవి ఈ దశలో పద్యములు వాడక భావశబలతకు అనుగుణముగ సంక్షిప్తమగు వచనమునకో, అసమాపకములగు వాక్యములనో, లేక పూర్ణమగు మౌనమునో పాత్రముచే నాశ్రయింపజేయును. "'హా' యను 'ధర్మరాజతనయా' యను" అని ద్రోణపర్వమున నర్జునవిలాపమున నున్న తిక్కనగారి పద్యము ఈ తారకస్థాయికి చక్కని యుదాహరణము. "భగవతి వసుధే దేహి మే వివరమ్" అను పంచమాంకములోని శకుంతలావాక్యముకూడ ఈ తారకస్థాయికి చెందినదే. ఇక్కడ శకుంతలకు దుష్యంతునితో నిక వాదించి లాభములేదని తోచినది అప్పుడుదయించిన అగాధమగు నిస్పృహను ప్రదర్శించుటకు—అనగా తారకస్థాయిలోని భావసంచారమును ప్రదర్శించుటకు—కాళిదాసు "భగవతి వసుధే" అను నొక్క వాక్యమును మాత్రమే సాధనముగా గైకొనుచున్నాడు.

### —◆ శాకుంతలములోని పద్యరచనా ప్రాగల్భ్యము ◆—

వచనమును, పద్యమును ప్రయోజనమును గుర్తించి ప్రయోగించుటలో కాళిదాసు షేక్స్పియరుకంటె కుశలుడు. నాటకీయ పద్యరచనకు శాకుంతలము ఉత్తమనిదర్శనము. ప్రత్యేక ప్రయోజనమును నిరూపింపనిదే శాకుంతలమున నెక్కడను పద్యము రచింపలేదు. భావము మంద్రస్థాయివదలి మధ్యమస్థాయిని ప్రాపించినపుడే పద్యము

గానవచ్చుచున్నది తగినంత రససాంద్రత, ఉన్నతభావము లేనపుడు పద్యము రచితమగుటలేదు. ఒక్కొక్కప్పుడు లోకానుభవమును పురస్కరించుకొని మానవస్వభావమును మథించితీసిన యమూల్య రహస్యములను నిక్షిప్త మొనర్చుటకు గూడ, బంగారునగను దాచుటకు దంతపుబరణి నుపయోగించునట్లు, కాళిదాసు పద్యము నుపయోగించుచున్నాడు

> "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
> పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః,
> తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
> భావస్థిరాణి జననాంతరసౌహృదాని "

శాకుంతలము నెంత తీవ్రముగ పరిశోధించినను "ఇక్కడ పద్యమునకు మారువచన ముంచవలసినది" అని కాని, "ఇక్కడ వచనమునకు మారు పద్య ముంచవలసినది" అనికాని వేలుపెట్టి చూపుట కవకాశము గానరాదు.

## —♦ సౌ ల భ్య ము ♦—

శాకుంతలపద్యరచనమునందు గానవచ్చు విశిష్టలక్షణములలో సౌలభ్యమొకటి. నాటకీయపద్యరచనమునకు సౌలభ్యము ముఖ్యముగ నుండదగినది శ్రవ్యప్రబంధములలో నైనచో చదువరి పద్యమును పునఃపునః పఠించుకొనుట కవకాశముండును దృశ్యములలో చెవిని బడినంతనే పద్య మర్థముకావలసియున్నది. అయితే కొన్నికొన్ని రసములందు ఓజోగుణప్రధానమైన శైలి వాడవలసివచ్చునే యని ప్రశ్న రావచ్చును. రౌద్రరసము, భయానకరసము సంచారము గావింపవలసి వచ్చినపుడు సమాసపూర్ణమగు శైలి యావశ్యకమగుట లేదా ? ఆ సమాసములుగూడ భావమును పరిపోషించునవి యగుటచే ఎంతచదువురాని ప్రేక్షకునికైన రససంచారముగాకుండ మానదని సమర్థింప వచ్చును అయినను దీర్ఘసమాసముల మూలమున భావమును పోషించుకొనుటకంటె వీరరౌద్రభయానకాదిరసములలోగూడ సులభమైనభావ

నాడియే భావమును పోషించుకొనుట ఉత్తమకవి లక్షణము ప్రకృతము శాకుంతలము శృంగారరసప్రధాననాటకము గావున శైలియందలి సౌలభ్యము దాని కమూల్యాలంకారమగుచున్నది. అన్వయకాఠిన్యము మచ్చునకైన నీపద్యములలో గానరాదు.

—♦ రససాంద్రత ♦—

పద్యములన్నియు రససాంద్రములు ఇటీవల తెనుగున బయలు వెడలు నాటకములు కొన్నిటిలో ధారాశుద్ధి, సౌలభ్యము, ప్రసాదము మున్నగు గుణములున్నను రససాంద్రత లేకపోవుచున్నది. నాటక మంతయు బంగారుపునగవలె నుండవలెను. అందు యథోచితముగ రచించిన పద్యములు రత్నములవలె నుండవలెను ఒక్కొక్క పద్యమున ప్రత్యేకముగ నెంతో చెక్కడపుబని, రసపుష్టి లేనిదే కాళిదాసు పద్యమును రచింపడు. శాకుంతలమున పద్యశైలి, వచనశైలి రెండును మృదువులే యయ్యును పద్యశైలికి విసిష్టలాలిత్య మున్నది.

—♦ స మీ క ర ణ ము ♦—

శాకుంతల పద్యరచనమునుండి నవీననాటకకర్తలు నేర్చుకొనదగిన ఇంకొక ముఖ్యలక్షణము 'సమీకరణము' అనునది. ఇటీవల కొందరు సుప్రసిద్ధ నాటకకర్తలుగూడ—పిండివంటను ముందుగ సిద్ధముచేసికొని తరువాత సామాన్యభక్ష్యములను వండుకొనునట్లు—నాటకమునం దక్కరకువచ్చు పద్యముల నన్నిటిని ఒకేబిగిని ముందుగ రచించుకొని తరువాత సంభాషణలు నిర్వహించుకొనుచు ఆయా స్థానములందు పద్యముల నదుకుకొనుచున్నారు లేదా నాటకమునం తను ముందు వచనములో రచించి తరువాత ఉచితముగ నుండునని తోచినస్థలములలో పద్యములను జొప్పించుచున్నారు అట్లు చేసినచో 'సమీకరణ'మను గుణమునకు భంగముకలుగును

సాధారణ సంభాషణము వచనములో నడచునుగదా. పద్యము అనునది పైకిలేచు పర్వతశిఖరమువంటిది. ఈ పర్వతమునకు సమీప

మున నున్న వచనములు — అనగా పద్యమునకు ముందును, వెనుకను ఉన్న వచనములు — పర్వతసానువులవలె నుండి పద్యము మట్టముతో హత్తుకొనవలెను పద్యమునకు ముందున్న వచనము పద్యముమట్టము (level)నకు ఎక్కబాకుటకు సాయము చేయవలెను, పద్యమునకు వెనుకనున్న వచనము పద్యమునుండి దిగబాకుటకు సాయము చేయవలెను ఈ రహస్యమును గమనింపకయే తెనుగునాటకములలో సర్వసాధారణముగ పద్యరచనము సాగుచున్నది. అయితే ఒక్క ఇబ్బందిని కూడ మనము గమనింపవలసి యున్నది. సమర్థుడైన కవికిగూడ వచనధోరణిలో నున్నపుడు పద్యములు రచించుటయు, పద్యధోరణిలో నున్నపుడు వచనము రచించుటయు క్లేశసాధ్యమో, అసాధ్యమో యగుచుండును. నాటకరచనమున నున్నబాధయే యిది. వచనముపైని, పద్యముపైని ఒకేతరగతి స్వాతంత్ర్యమున్న సవ్యసాచులకు దక్క శాకుంతలమువంటి నాటకరచనము సాధ్యముగాదు

పైని వివరించిన 'సమీకరణము' అను గుణమునకు శాకుంతలములోని అన్నిపద్యములును ఉదాహరణములే. అయినను ప్రతిపాద్య విషయము విస్పష్టమగుటకు ఒక్కపద్యమును గైకొందము.

"ప్రత్యాదిష్టవిశేషమండనవిధి
ర్వామప్రకోష్ఠార్పితం
బిభ్రత్ కాంచన మేక మేవ వలయం
శ్వాసాపరక్తాధరః
చింతాజాగరణప్రతాంతనయన
స్తేజోగుణా దాత్మన
స్సంస్కారోల్లిఖితో మహామణిరివ
క్షీణోపి నాలక్ష్యతే"

ఉత్సుకుడయిన రాజువర్ణన మిది ప్రత్యేకముగ చూచినను వర్ణనము మనోహరముగ నున్నది. కాని యీవర్ణనమును నాటకమున స్థాపించుటలో కాళిదాసుచూపిన వైదగ్ధ్యము గమనింపదగియున్నది.

"కంచుకి — (రాజానమవలోక్య) అహో, సర్వావస్థాసు రమణీయత్వ మాకృతివిశేషాణామ్ తథాహి— ఏవముత్సుకో ఽపి ప్రియదర్శనో దేవః"

అనువచనము పద్యమున కారోహణ సాధనముగను,

"సానుమతీ — స్థానేఖలు ప్రత్యాదేశవిమానితాపి అస్యకృతే శకుంతలా క్లామ్యతి"

అనువచనము పద్యమునుండి అవరోహణ సాధనముగను ఉన్నవి ఈ రెండుసాధనములును పద్యమునకు ఈడుజోడుగ నుండకపోయినచో ఆరోహణావరోహణములు సుకరములుగావు "కూర్చుట నూత్నరత్నమునకుఁ గనకంబునకుఁ దగుఁ" అనినట్లుగ నాటకమునందలి పద్యరచన మంతయు సమీకరణ మందినది గావుననే శాకుంతలము జగత్తునందలి ఉత్తమనాటకములలో నొక్కటి యయినది

షేక్స్పియరు నాటకములలో —హ్యామ్లెటు మున్నగు నుత్తమ నాటకములలోఁగూడ—ఒక్కొక్కప్పుడు ముప్పదిపంక్తులు, నలువది పంక్తులు వరుసగా పద్యరచనముండును కాళిదాసులో నట్లుగాక వరుసగా రెండుపద్యములకిం౦టె నధికముగనుండవు రెండుపద్యములున్న తావులయినను మిక్కిలి యరుదుగనున్నవి. ఇట్లుండుటవలన పద్యరచన మెక్కడను విసుగు పుట్టించుటలేదు

## — ♦ వైవిధ్యము ♦ —

శాకుంతలమునందలి పద్యరచనములోని కొన్నివిశిష్టగుణములను గూర్చి ప్రత్యేకముగ ప్రశంసింపవలసియున్నది. విక్రమోర్వశీయమున పద్యరచనము ప్రశస్తమైనను అంతయు నొకేముద్రతో నున్నది ఎక్కడచూచినను ఇది కాళిదాసుని పద్యరచనయే అనిపించుచున్నదిగాని ఆయా పాత్రముల ప్రకృతినిబట్టి దానిశైలి మారుట లేదు శ్రవ్యకావ్యశైలికిని దృశ్యకావ్యశైలికిని ఈయంశమున నెంతో భేద మున్నది. కొన్నిశ్రవ్యకావ్యములలోఁగూడ ఘట్టమునుబట్టి శయ్య మారుచుండు నన్నకొనుడు. కాని దృశ్యకావ్యమున ఒకేఘట్టమున

ఒకేపాత్రము మాట్లాడుచున్నను ఆపాత్రము మానసికస్థితినిబట్టి శైలి మారవలసియుండును అనగా కవికి పాత్రముతో పూర్ణమైన తాదాత్మ్యసిద్ధి యున్ననేగాని ఇది సాధ్యము కాదు. శ్రవ్యకావ్యములలో శైలి ఆత్మీయతాప్రధానము (subjective) అనియు దృశ్యకావ్యములలో తాదాత్మ్యతాప్రధాన (objective) మనియు గుర్తించి పద్యరచనము చేయు నాటకకవులు మిక్కిలి అరుదు. తెనుగున భారతమునందలి తిక్కనపద్యశైలి నాటకరచయితలకు ఇంచుమించుగ నాదర్శప్రాయ మనిచెప్పవచ్చును. శాకుంతలములోని శైలి తాదాత్మ్యతాసిద్ధికి ఉత్తమ నిదర్శన మని చెప్పలేము గాని తక్కిన రెండు నాటకములందుకంటెను ఈనాటకమున నది వెక్కుడుగ బ్రత్యక్షమగుచున్నది దుష్యంతుని నోట నుంచిన శ్లోకములకును కణ్వుని నోట నుంచిన శ్లోకములకును గల వ్యత్యాసమును గమనించితిమేని ఈయంశము సువ్యక్తమగును.

యయాతేరివ శర్మిష్ఠా భర్తుర్బహుమతా భవ,
సుతం త్వమపి సమ్రాజం చక్రవర్తినమాప్నుహి
అమీ వేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః సమిద్వన్తః ప్రాన్తసంస్తీర్ణదర్భాః
అపఘ్నంతో దురితం హవ్యగన్ధై ర్వైతానాస్త్వాం వహ్నయః పావయన్తు.

ఇత్యాది యాశీస్సులలో నేగాక అతని నోట నున్న శ్లోకము లన్నిటియందును ఒకవిధమగు నార్షతేజము నార్షశైలి ప్రత్యక్షమగుచున్నవి

అర్థో హి కన్యా పరకీయ ఏవ తామద్య సంప్రేష్య పరిగ్రహీతుః,
జాతో మమాయం విశదః ప్రకామం ప్రత్యర్పితన్యాస ఇవాన్తరాత్మా.

ఈ శ్లోకములో నింకొక విశేషముకూడ గమనింపవలసి యున్నది. పద్యమునందలి ఆర్షశైలికి ఉపమానముకూడ సాక్ష్యమిచ్చుచున్నది. ఉపమాన మున్నను లేకున్నట్లుగ నొదిగి యున్నది సూత్రప్రాయముగ మితభాషావిరచన మవలంబించుట ఋషిలక్షణముగదా! అది యిచ్చట బ్రత్యక్షమగు చున్నది.

ఇతరకావ్యములలోని యుపమానములకును శాకుంతలములోని యుపమానములకును విశేషతారతమ్యమున్నది. ఇతరకావ్యములలో

కూడ కాళిదాసుని యుపమానములు ఎంతో హృదయంగమముగా నుండుననుట వాస్తవమే కాని వానియందు కొంత విన్యాసగుణ మున్నది "చూడుము నే నెంతసుందరముగా నున్నానో" అని చదువరిని ప్రత్యేకముగ పలుకరించుచున్నట్లుండును! శాకుంతలములో నట్లుగాక ఆ విన్యాసము తగ్గి వినయ మేర్పడినది. అలంకారము రసమునకు విధేయమైనప్పుడు దానియందు వినయగుణము నిరూఢ మగుచున్నది ఉపమాన పూర్ణములగు పద్యములు పెక్కులు దుష్యంతుని నోట నున్నవి ఇవి సాధించిన రసధ్వని అద్భుతావహము.

మానుషీషు కథం వా స్యాదస్య రూపస్య సమ్భవః,
న ప్రభాతరలం జ్యోతిరుదేతి వసుధాతలాత్

ఇందు ఉపమానమును గమనించితిమేని అది యెంత ప్రయోజనకారియైనదియు స్పష్టపడును. శకుంతలా దర్శనమాత్రముననే దుష్యంతుని కనులు మిరుమిట్లు గొన్నవని ప్రప్రథమున నాతని కుదయించిన చకితభావము వ్యక్తమగుటయేగాక అత్యంత కాంతిమత్త్వము ఆమె రూపసంపదకు విశిష్టగుణ మని ద్యోతమాన మగుచున్నది రూపసంపదయేగాక దానినిబట్టి నిర్ణయింపదగిన యాభిజాత్యమును గుణమాహాత్మ్యమునుగూడ వ్యంగ్యముగ ప్రత్యక్షమగుచున్నవి. ఈ ప్రకారము ప్రతిశ్లోకమును విమర్శించి చూచుకొనవచ్చును. అన్నిటికంటెను ముఖ్యమయినది పైని సూచించిన వినయగుణము ఇంచుమించుగ శాకుంతలమునందలి యుపమానముల కిది సామాన్యలక్షణ మని చెప్పదగును

"సంధిషు వ్యంజిత వృత్తిభేదమ్" అని నాటకప్రదర్శనవర్ణనమున (కుమారసంభవము) కాళిదాసొక విశేషణము నుంచినాడు సంధులు మారినపుడు వృత్తులు మార్చుట యాతని కభిమతము. వృత్తి మారినపుడు దాని కనుగుణముగ శయ్యకూడ మార్చి శయ్యవలన వృత్తిభేదము నిరూపించుట కవకాశ మిచ్చుచున్నాడు.

తురగఖురహత స్తథాహి రేణుర్విటపవిషక్తజలార్ద్రవల్కలేషు,
పతతి పరిణతారుణప్రకాశః శలభసమూహ ఇవాశ్రమద్రుమేషు.

వివిధవృత్తములను వాడుటలో కాళిదాసు కౌశలము మిక్కిలి ప్రశంసనీయము. తెనుగులో వివిధవృత్తరచనా కౌశలమునందు అగ్రతాంబూలము నన్నయభట్టారకులది. ఏ వృత్తము వ్రాసినను దానిమీద వారికి సంపూర్ణస్వాతంత్ర్య మున్నదనుట ప్రత్యక్షమగుచున్నది. సంస్కృత భాగవతకారుని వృత్తవైవిధ్యము ఇంచుమించుగ నతిమానుషమని చెప్పవచ్చును. ఎక్కడికక్కడ ఒక్కొక్క యద్భుతమైన స్తవము వ్రాయుచు నాతడు భాగవతమును స్తవార్ణముగ జేసివైచినాడు. ఈ స్తవములలో భావానుగుణముగ వృత్తములను మార్చి యాతడు సాధించిన రససిద్ధి యద్భుతావహము. ఆతనితో ఈడు రాకపోయినను వియోగినీవృత్తము మందాక్రాంతము ఇత్యాదులను తనకావ్యములలో రసానుకూలముగ ప్రయోగించి కాళిదాసు సహృదయులకు హర్షప్రదు డగుచున్నాడు. శాకుంతలమున శయ్యా వైవిధ్యమేగాక వృత్తవైవిధ్యముకూడ బాహాటముగ గనవచ్చుచున్నది. వాడిన వృత్తములన్నియు ఆతనిచేత మనోహరముగనే నడచినవి. అందును చిన్నవృత్తములు చిన్నిపూదేనెవలె మరింత మధురముగ నున్నవి.

సుభగ సలిలావగాహాః
పాటల సంసర్గ సురభి వనవాతాః
ప్రచ్ఛాయ సులభ నిద్రాః
దివసాః పరిణామ రమణీయాః



# శాకుంతల విమర్శనము

## ఆశ్రయ శిల్పము

ఇప్పటి సినిమాలలోను నాటకములలోను సన్నివేశమునకు అనుగుణ ముగ దీపపుకాంతిని హెచ్చించుట తగ్గించుట దీపములరంగును మార్చుట సన్నివేశమునకు సరిపడు సంగీతమును నేపథ్యమున ఆలపించుట (background music) మున్నగు ప్రక్రియలు జరపుచున్నారు ఇవన్నియు ఆశ్రయశిల్పమునకు సంబంధించిన ప్రక్రియలు. ఈ ఆశ్రయ శిల్పము ప్రధానవస్తువునకు చెలికత్తెవంటిది. ప్రధానవస్తువును చదువరులహృదయములలో హత్తించుటకు అనగా ప్రధానవస్తువునకు చదువరులహృదయమునకు సంధానము నెరపుటకు ఇది మిక్కిలి ఉపయోగపడును ప్రధానవస్తువుకు తగినఆశ్రయము నేర్పరచుకొనుటయే ఈ శిల్పలక్ష్యము గావున దీనిని ఆశ్రయశిల్ప మంటిమి

ఈ ఆశ్రయశిల్పము శ్రవ్యకావ్యములలోగూడ విరివిగ నుపయోగించుట గాననగును శ్రీకృష్ణుడు పుట్టుటకుముందు జలరాశులు పొంగిన వని దిక్కులు ప్రసన్నమైన వని తారలు మరింత ప్రకాశమానముగా వెలిగినవని చేయువర్ణనమును ఈ ఆశ్రయశిల్పమునందలి ప్రక్రియగానే భావింపవచ్చును భారతాదికావ్యములందలి శుభనిమిత్త దుర్నిమిత్తవర్ణనము లన్నియు దీనికి చెందినవే రానురాను ఇవి కేవలము కవిసమయములుగను గతానుగతికత్వనిదర్శనములుగను మారి పోయినవి పాశ్చాత్యకవులలోగూడ నీ శిల్పము ధారాళముగ నున్నది. షేక్స్పియరునాటకములలో నిది తరచు ప్రత్యక్షమగుచుండును

కాళిదాసుకు ఇది అభిమానవిద్య ఆతని శ్రవ్యకావ్యములలోను దృశ్యకావ్యములలోను ఇవి తరచు గాననగును. కాని ఎక్కడను

శాకుంతలములో చేకొన్న విజయమును చేకొనలేదు. ఈ కావ్యమున దానికి రెండుమూడు ప్రత్యేకలక్షణము లేర్పడుచున్నవి ఇదివరకే సూచించినట్లుగ తక్కిన రెండునాటకములలోను ఎక్కడనో ఒకటి రెండుచోట్ల మాత్రమే దీనికి ప్రసక్తి కలిగినది శాకుంతలములో నట్లు గాక ప్రతియంకమునందును ఇది ప్రత్యక్ష మగుచున్నది. ఇక రెండవ లక్షణము ఇది ధ్వనిప్రధానముగను అతిసూక్ష్మముగను ఉండి ప్రధాన వస్తువుతో ఎంతో చక్కగ సమ్మేళన మొందుచున్నది ! దీని స్వరూపము మిక్కిలి సూక్ష్మ మగుటచే ఇది ఎక్కడెక్కడ నున్నదియు ముందుగ నిరూపించుట యావశ్యకము.

ప్రతి సంస్కృతనాటకములోను నాందిలో ప్రధానకథను స్ఫురింపజేయుటయు ప్రస్తావనలో ఋతుగానము చేయుటయు ఒక యాచారము ఈ రెండును ఆశ్రయశిల్పమునకు సంబంధించిన ప్రక్రియలవలెనే గనవచ్చుచున్నవి. గతానుగతికముగ చేయు ఋతుగానము కొంతకాలమునకు కేవలము కవిసమయముగ మారిపోయిన దనుకొనుడు కాని కాళిదాసుచేతిలో మాత్ర మది సజీవమయిన శిల్పముగనే అలరారుచున్నది. ఈ ఋతుగానమునకు ప్రధానలక్ష్యము కావ్యమునకు కాలాశ్రయము నిర్మించుట కావ్యమునందలి ప్రధాన రసము వీరరసమయినచో శరత్సమయమును, శృంగారరసమయినచో గ్రీష్మవసంతములును ఆశ్రయముగ నేర్పడుట సంప్రదాయసిద్ధము. కాళిదాసు గ్రీష్మమును గైకొన్నాడు ఈ గ్రీష్మము చిరప్రవృత్తమయినచో ఉపభోగక్షమము కానేరదు. అందుచే "నాతిచిరప్రవృత్త ముపభోగక్షమమ్" అను విశేషణము లుంచినాడు ఇక సూత్రధారుని నోటనుంచిన

సుభగసలిలావగాహాః
పాటలసంసర్గసురభి వనవాతాః,
ప్రచ్ఛాయ సులభనిద్రాః
దివసాః పరిణామరమణీయాః

ఈషచ్చుమ్బితాని భ్రమరైః సుకుమారకేసరశిఖాని,
అవతంసయంతి దయమానాః ప్రమదాశ్శిరీషకుసుమాని

అన్నశ్లోకములు ఎంతచిన్నవో అంతమనోహరములు అత్యంతస్వాభావిక మును మధురమును రసవాహినియు నగు ఋతువర్ణన మిచట ప్రత్యక్ష మగుచున్నది

గ్రీష్మవసంతములలో గ్రీష్మమును గైకొననేల యనుప్రశ్న మేర్పడుచున్నది దీనికి తృతీయాంకము సమాధాన మిచ్చుచున్నది శకుంతల తాపజ్వరమునకు కారణత్రయము సంభవమగుట వసంతమున గానేరదు. ఆశ్రమవాసుల కది గ్రీష్మదోషమున నుదయించినట్లు కాన బడవలె దుష్యంతునకును శకుంతల చెలికత్తెలకును మదనదోషమున నుదయించినట్లు యథార్థము బోధపడవలె ఈ తీరుగ కథాసంఘ టనమున కానుకూల్యము గ్రీష్మముననే సిద్ధించును గాని మధుఋతు వున సిద్ధింపదు

ప్రథమాంకమున వైఖానసుల యాశీర్వచనము శకుంతలా దుష్యంతుల ప్రథమసమావేశము ప్రధానవస్తువు. రెండింటికిగూడ గాఢమయిన సంబంధమున్నది ఈరెండు ఉదంతములకు స్థలాశ్రయము తపోవనము. ఈ తపోవనము మూలములో నున్నదేగాని కాళిదాసు తెచ్చిపెట్టినది కాదు కాని తపోవనవర్ణనమున మూలమున కణ్వుని మాహాత్మ్యమునకే ప్రాధాన్యము శాకుంతలమున ప్రకృతిరామణీయ కమును చిత్రించు స్వభావోక్తి లెక్కడుగ నున్నవి కాళిదాసు క్రొత్తగ వృక్షసేచన మొకటి కల్పించినాడు ఈ వృక్షసేచనము శకుంతల స్వభావమును సౌందర్యమునుకూడ లెస్సగ చిత్రించుటకనుకూ లించినది వనపాదపములయెడను లతలయెడను ఆమె కెట్టి మక్కువయో ఇందు సువిదిత మగుచున్నది ఇది దుష్యంతుని యనురాగము నినుమ డింపజేయుటకు తోడ్పడుచున్నది కామప్రచారము బహుగతులు.

ఒకొక్కప్పు డది సాధర్మ్యము ననుసరించును మరియొక్కప్పుడు వైధర్మ్యము ననుసరించును కొందరు పట్టణవాసులు పట్టణవాసులతోనేగాని సంబంధముచేయుట కిష్టపడరు అట్లుగాక మరికొందరు పల్లెటూరివారు పట్టణజీవితమునకు ముగ్ధులగుటయు పట్టణవాసులు పల్లెటూరిజీవితమునకు మచ్చటపడుటయు జరుగుచుండును.

శుద్ధాంతదుర్లభ మిదం వపు రాశ్రమవాసినో యది జనస్య,
దూరీకృతాః ఖలు గుణై రుద్యానలతా వనలతాభిః

అనుటలో నాగరకుడయిన దుష్యంతుడు తపోవనవర్ధితయగు శకుంతల నెక్కుడుగ మెచ్చుకొనుటకుగల కారణము స్పష్టమగుచున్నది

న కేవలం తాతనియోగః మమాపి ఖలు సోదరస్నేహ ఏతేషు

అని శకుంతలచే పలికించుటలో ఆమెకు వనలతలయెడనున్న అనురాగమును వ్యక్తముచేయు ప్రత్యక్షప్రయోజనమే గాక కథాసంవిధానమున నొక పరోక్షప్రయోజనముకూడ సాధితమగుచున్నది

లతావలయ! సంతాపహార! ఆమంత్రయామి భూయోఽపి పరిభోగాయ

అనునామెవాక్కులు గౌతమికి "ఏమిది? పిచ్చిదానివలె శకుంతల స్థావరములతో మాట్లాడుచున్నది?" అని తలపోయకుండుటకు గల కారణము "మమాపి ఖలు సోదరస్నేహ ఏతేషు" అనుటలో నిక్షిప్తమయినది ఈపట్ల కేసరవృక్షకముకడ శకుంతలను నిలిపి ఆమెను లతతో పోల్చి వర్ణించుట ఆమె సౌందర్యచిత్రణమునకెంతో సహకారియయినది ద్వితీయాంకమున

న నమయితు మధిజ్య మస్మి శక్తో ధను రిద మాహితసాయకం మృగేషు
సహవసతి ముపేత్య యైః ప్రియాయాః కృత ఇవ ముగ్ధవిలోకితోపదేశః

అనుశ్లోకము ఆశ్రయశిల్పమునకు జెందినది దుష్యంతునికి శకుంతలాదర్శన మయినవెనుక వన మంతయు శకుంతలాసౌందర్యోద్బోధకముగనే యున్నది. అనురాగ మాతనిహృదయమున ప్రవేశించి దానినెట్లు విశాలము గావించుచున్నదియు ఈక్రింది శ్లోకమువలనగూడ స్పష్ట మగుచున్నది

గాహన్తాం మహిషా నిపానసలిలం శృంగై ర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదమ్బకం మృగకులం రోమన్థ మభ్యస్యతు
విస్రబ్ధం క్రియతాం వరాహతతిభి ర్ముస్తాక్షతిం పల్వలే
విశ్రామం లభతా మిదం శిథిలజ్యాబన్ధ మస్మద్ధనుః

కేవలము మృగయావినోదమునకయి వనమున ప్రవేశించిన దుష్యం తుని శకుంతలానురాగము వేటకు విముఖుని జేసివైచినది

తృతీయాంకమున ప్రధానవస్తువు నాయికానాయకుల పునస్సమాగమమును, అనురాగప్రకటనమును, వివాహనిశ్చయమును. వీనికి ఆశ్రయము మాలినితీరమున వేతసపరిక్షిప్తలతామణ్టపము ఈ లతామణ్టపము శకుంతలాచిత్రణమాధుర్యమున కెంతగ దోడ్పడినదియు

"ఆస్యే లబ్ధం నేత్రనిర్వాణమ్ ! ఏషా మే మనోరథప్రియతమా సకుసుమాస్తరణ శిలాపట్టమధిశయానా సఖీభ్యా మన్వాస్యతే"

అనువచనమునుబట్టియు

అథవా ఇహైవ ప్రియాపరిభుక్తముక్తే లతామణ్టపే ముహూర్తం స్థాస్యామి
తస్యాః పుష్పమయీ శరీరలులితా శయ్యా శిలాయా మియం
క్లాన్తో మన్మథలేఖ ఏష నలినీపత్రే నఖై రర్పితః,
హస్తాద్భ్రష్ట మిదం బిసాభరణ మి త్యాసజ్యమానేక్షణో
నిర్గన్తుం సహసా న వేతసగృహా చ్ఛక్నోమి శూన్యాదపి

అనుపద్యమునుబట్టియు విశద మగుచున్నది

ఇక చతుర్థాంకమున నీ యాశ్రయశిల్పము మాంత్రికశక్తివలె బనిచేయుచున్నది ఇది కణ్వశిష్యుని ప్రవేశపెట్టి

యాత్యేకతోఽస్తశిఖరం పతిరోషధీనా
మావిష్కృతోఽరుణపురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగప ద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇ వాత్మదశాన్తరేషు

అను శ్లోకమున శకుంతలకు రానున్న వ్యసనమును తరువాతియభ్యుదయమునుకూడ సూచిత మగుచున్నది.

అంతర్హితే శశిని సైవ కుముద్వతీ మే
దృష్టిం న నందయతి సంస్మరణీయశోభా,

ఇష్టప్రవాసజనితా న్యబలాజనస్య
దుఃఖాని నూన మతిమాత్ర సుదుస్సహాని

అనుశ్లోకము అప్పటి శకుంతల భర్తృవిరహమును చదువరి హృదయమున హత్తుకొనునట్లు చేయుటలో నెంత సహకారి యగుచున్నది!

అన్నిటికంటెను అద్భుతమైనది శకుంతలానిష్క్రమణము ఈ పట్టున ప్రధానవస్తువును ఆశ్రయశిల్పము వృక్షమును లతవలె విడదీయరాకుండ పెనగొనుచున్నది శకుంతలకు మంగళపరిధానము, లాక్షారసము, ఆభరణములు ప్రసాదించిన వనస్పతులును వనదేవతలును శకుంతలావియోగమును భరింపజాలని తపోవనతరువులును, వనదేవతల యనుమతిసూచక మగు పరభృతరుతమును, నాకాశభాషితమును ఇవన్నియు మనలనొక ప్రత్యేకస్వర్గమున ప్రవేశపెట్టుచున్నవి. ఈ ఘట్టమున మరపురానివి ముఖ్యముగ మూడంశములు.

ఉద్గలితదర్భకబలా మృగాః పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృతపాండుపత్రాః ముఞ్చ త్యశ్రూణీవ లతాః

అనువర్ణన మొదటిది శకుంతల 'వనజ్యోత్స్న' యను మల్లెచెట్టు నామంత్రణముచేయుట రెండవది ఆమె చీరచెరగు పట్టుకొని లాగు మృగపోతకవర్ణనము* మూడవది ఈ మూడును శకుంతలాస్వభావము నావిష్కృతము చేయుట కేర్పడిన అతిసూక్ష్మసాధనములు. ఇతరకవులకు అగమ్యములయిన శిల్పకళాసోపానములు ఇవిగాక సహచరుని గానక పరితపించు చక్రవాకివృత్తాంతము ప్రత్యేకము ఆశ్రయశిల్పమున కే పోషక మగుచున్నది.

పంచమాంకమునందలి ప్రధానవస్తువు శకుంతలా ప్రత్యాదేశము దీనికి ఆశ్రయముగ కంచుకిప్రవేశమువరకు రాజు మనోఽవస్థ

---

* యస్య త్వయా వ్రణవిరోపణ మింగుదీనాం
తైలం న్యషిచ్యత ముఖే కుశసూచివిద్ధే
శ్యామాకముష్టి పరివర్ధితకో జహాతి
సో ఽయం న పుత్రకృతకః పదవీం మృగస్తే

చిత్రితమయినది దీనిని అవస్థాశ్రయ మని పేర్కొనవచ్చును ఇది రస సాంద్రతకు చాల తోడ్పడుచున్నది. హంసపదిక పాడిన గీతము ఇందలి ప్రథమాలంబనము

అభినవమధులోలుప స్త్వం తథా పరిచుంబ్య చూతమంజరీం
కమలవసతిమాత్ర నిర్వృతో మధుకర! విస్మృతో స్యేనాం కథమ్.

తాను హంసపదికను వీడి వసుమతితో చెలిమి చేయుచున్నందులకు ఉపాలంభన మనిమాత్రమే అప్పటికి రాజు భావించుచున్నాడు కాని చదువరికిమాత్రము ఇది శకుంతలాపరముగ నర్థమగు చున్నది దుష్యంతుడు శకుంతలను పెండ్లియాడి మరల నామె మొగమువంకనైన చూడ లేదు ఆమెను పిలుచుకొనివచ్చుటకు పరిజనమును పంపలేదు ఈ మాటలు రాజదర్శనార్థమయి వచ్చిన శకుంతలనోట నుంచినను ఉచితముగ నుండదవే కేవలము వర్ణపరిచయము చేయుచున్న హంసపదికచే నీ మాటలు పలికించుటచే ఇందలి ధ్వని రాజోవృత్తాంతమునకు ఉచితమైన యాశ్రయ మగుచున్నది

కవి యంతతో నాగలేదు. ఈ సంగీతమును వినుటవలన రాజు చిత్తము ఒక వికారమునకు పాల్పడినది ఆ వికారమునకు కారణమేమో ఆతడు పోల్చుకొనలేకుండ నున్నాడు. అనగా దుర్వాసుని శాపమువలన నాతని చిత్తమున మత్తుమందు చల్లినట్లయినది.

రాజా — కింను ఖలు గీత మేవం విధార్థ మాకర్ణ్య ఇష్టజనవిరహా దృతేఽపి బలవ దుత్కంఠితోస్మి? అథవా

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి య త్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని.

ఇక్కడ వర్ణించిన చిత్తవికారము మిక్కిలి చిత్రమయినది. రమ్యవస్తువులను వీక్షించినపుడు మధురమైనశబ్దములు విన్నప్పుడు మనస్సుకు ఆహ్లాదము కలుగవలెను. అట్లుగాక తద్విపరీతముగా నౌత్సుక్యము కలుగు

చున్నది. దానికి జననాంతర సౌహృదములే కారణమని దుష్యం తుడు సమర్థించుకొనుచున్నాడు. కాని నిజమున కిచ్చట జననాంతర సౌహృదములు కాదు ఈజననములోని సౌహృదమే కారణము. "ఇతి పర్యాకుల స్థ్సితి" అను రంగసూచనవలనకూడ అప్పటి రాజునవస్థ స్థాపితమగుచున్నది ఈ పర్యాకులావస్థను చిత్రించి దానిపయి శకుం తలా దుష్యంతసంవాదమును తదుపరి శకుంతలా ప్రత్యాదేశమును చిత్రించుట ఎంతయు విదగ్ధముగనున్నది

షష్ఠాఙ్కమునకు ప్రధానవస్తువు పశ్చాత్తాపము

దీనికి ఆశ్రయము ఉద్యానవనవర్ణనము శకుంతలను నిరాక రించితినను పశ్చాత్తాపముచే రాజు వసంతోత్సవములను నిషేధించి నాడట. ఆ నిషేధమును జడప్రకృతికూడ శిరసావహించినదట.

చూతానాం చిరనిర్గతాపి కలికా బధ్నాతి న స్వంరజః
సన్నద్ధం యదపిస్థితం కురవకం తత్కోరకావస్థయా
కణ్ఠేషు స్ఖలితంగతేఽపి శిశిరే పుంస్కోకిలానాం రుతం
శఙ్కే సంహరతి స్మరోఽపి చకితస్తూణార్ధకృష్టంశరమ్

ఇట్టి మహిమ సంభవమా అసంభవమా అనునది ప్రశ్నకాదు జడ ప్రకృతికిని మానవప్రకృతికిని ఒక విధమయిన సామరస్యమును గల్పిం చుటే ఇందలి ప్రయోజనము ఇట్టి ఆశ్రయవర్ణనము మనస్సును ప్రసన్న పరచి ప్రధానవస్తువును లెస్సగ నాస్వాదించుటకు యోగ్యత కలి గించును

కాళిదాసుకు ఆశ్రయశిల్పము మన యారోపణము కాదనియు అది యాతనుద్దేశించిన కళాప్రక్రియయే యనియు నిరూపించుటకు తగినసాధనము ఈ యంకమున లభ్యమగుచున్నది రాజు శకుంతల చిత్రమును లిఖించినాడు అప్పటికి సఖీజనసమేతయగు శకుంతలామూర్తి చిత్రణముమాత్రమే పూర్తియైనది. ఇంకను చిత్రణము పూర్తికాలేదని రాజు పలుకగా "అపరం కిమత్ర లేఖితవ్యమ్?" అని విదూషకుడు ప్రశ్నించుచున్నాడు అందుకు

రాజా — శ్రూయతాం
కార్యా సైకతలీనహంసమిథునా స్రోతోవహా మాలినీ
పాదాస్తామభితో నిషణ్ణహరిణా గౌరీగురోః పావనాః
శాఖాలంబితవల్కలస్య చ తరోర్నిర్మాతుమిచ్ఛామ్యధః
శృఙ్గే కృష్ణమృగస్య వామనయనం కణ్డూయమానాం మృగీం

అని రాజు ప్రత్యుత్తరమిచ్చుటలో ప్రాంతచిత్రణమున కెట్టి ప్రాముఖ్యమున్నదియు కాళిదాసు గ్రహించినట్లు స్పష్టమగుటలేదా?

సప్తమాంకమున దుష్యంతుని సతీసుతులతో నేకముచేసి నాటకమునకు భరతవాక్యము చెప్పుచున్నాడు ఈ యుదంతముల కాశ్రయము హేమకూటశిఖరము ఈ హేమకూటశిఖరమునుగూర్చిన ప్రసక్తి విక్రమోర్వశీయమున గూడ వచ్చినది కాని ఇంత నావధానవర్ణన మందులేదు దేవేంద్రుని యర్ధాసనమున గూర్చుండి మందారమాలాలంకృతుడగు దేవకన్యలు తనయశస్సును గానముచేయుచుండగా స్వర్గమునుండి హేమకూటశిఖరము చేరుకొని దుష్యంతుని వర్ణించినపట్ల కాళిదాసుని భావనాశక్తి దివ్యవిజృంభణము గాంచినది. ఈ చిత్రణమునందలి ఒక్కొక్క రేఖ ఒక్కొక్క కళాప్రపంచమును సాధింపజాలియున్నది.

విచ్ఛిత్తిశేషైః సురసున్దరీణాం వర్ణైరమీ కల్పలతాంశుకేషు,
సఞ్చిత్య గీతక్షమమర్థబన్ధం దివౌకసస్త్వచ్చరితం లిఖన్తి

ఇచ్చటి పరివహావర్ణనము, ఇచ్చటినుండి చేసిన భూగోళవర్ణనము ప్రత్యేకప్రశంస కర్హములు అన్నిటికంటెను

యత్కాఙ్క్షన్తి తపోభిరన్యమునయస్తస్మింస్తపస్యన్త్యమీ

అని హేమకూటశిఖర వైశిష్ట్యమును మారీచాశ్రమ మాహాత్మ్యమును నిరూపించుటలో మనకు తెలియకుండగనే మనలను కవి మరియొక దివ్యభూమిలో బ్రవేశపెట్టినాడు. నాటకప్రారంభమున నిర్మించుకొన్న యాశ్రయమే మనోహరముగనుండి విభ్రాంతి గల్పించుచుండ నాట

కాంతమున నిర్మించుకొన్న యాశ్రయము అంతకంటెను హృదయంగ
ముగనుండి దిగ్భ్రమము గొల్పుచున్నది.

యత్క్రాంతా స్సన్తి తపోభి రన్యమునయః తస్మి స్తపస్యత్యమీ

అనుటలో శకుంతలాదుష్యంతుల ప్రథమసమావేశమున కేర్పడినయాశ్ర
యమునకిది పై యంతరువులోనిదని వ్యంగ్యముగ సూచితమయినది

ఈ ఆశ్రయశిల్ప మంతయు హృదయంగమముగనే యున్నను
రెండు తావులలో నిది అత్యంతవిస్మయకరమును మనోహరమును అయి
ఒప్పారుచున్నది నాటకమునందలి మొదటి యర్ధభాగమునకు ప్రధాన
వస్తువు శకుంతలాదుష్యంతుల స్వయంవర వివాహముకదా దీనికి ఎట్టి
అనురూపాశ్రయమును మహాకవి కల్పించుకొనుచున్నాడో చూతము.

అనసూయా — సఖి శకుంతలే! ఇయం స్వయంవర వధూ బాలసహకారస్య
త్వయా కృతనామధేయా వనజ్యోత్స్నేతి నవమాలికాఖలు? ఏనాం విస్మృతాసి?

ఆశ్రమవనమున నొక బాలసహకారవృక్షమును తనంతతానుగ నొక
నవమల్లిక యల్లుకొన్నది. అందుచే నావృక్షమున కది స్వయంవర
వధువయినది మల్లిక తెల్లగనుండును గావున దానికి "వనజ్యోత్స్న"
అని శకుంతల ముద్దుపేరు పెట్టుకొని తన బహిఃప్రాణముగ జూచికొనుచు
నీళ్ళుపోసి పెంచుచున్నది

సఖి! రమణీయే కాలే ఏతస్య లతాపాదపమిథునస్య వ్యతికరః సంవృత్తః యన్న
వకుసుమయౌవనా వనజ్యోత్స్నా బద్ధపల్లవ తయోపభోగక్షమ ఏషబాలసహకారః.

శకుంతల పలికిన వాక్యములివి. త్వరలో దుష్యంతుని గలిసికొన బోవు
చున్నది. అతని స్వయంవరమున పెండ్లాడ బోవుచున్నది దానికి
ముందుగ నామెచే నీవాక్యములు పలికించుటలో నెంత కళాకౌశల
మున్నది! శకుంతలాదుష్యంతుల స్వయంవర వివాహమునకు ఈ లతా
పాదపమిథునము స్వయంవరవివాహ మెంతచక్కని యాశ్రయము! కవి
ప్రతిభ యంతతో నాగినదా? దీని నింతతో విడిచిపెట్టకుండ మరల
చతుర్థాంకమున ప్రసక్తి కల్పించుకొనుచున్నాడు. అత్త వారింటికి బోవు

నపుడు శకుంతల వనజ్యోత్స్నను సెలవు అడుగుటకు వచ్చినది.

శకుంతలా — (లతాముపేత్య) వనజ్యోత్స్నే! మాతసంగతాపి ప్రత్యాలింగ మామితో గతాభిః శాఖాబాహాభిః అద్యప్రభృతి దూరవర్తినీ ఖలు తే భవిష్యామి

అని శకుంతల పలికినపుడు

సంకల్పితం ప్రథమమేవ మయా తవర్ధే
భర్తారమాత్మసదృశం సుకృతైర్గతాత్వమ్,
చూతేన సంగతవతీ నవమాలికేయ
మస్యామహం త్వయి చ సంప్రతి వీతచిన్తః.

అను తాతపాదుల ఈ ముగింపువాక్యము శకుంతలాదుష్యంతుల వివాహమునకేగాక ఆశ్రయశిల్పసాధనమగు లతాపాదపమిథునవివాహమునకుకూడ స్వస్తిచెప్పుచున్నది ఈపోకడ కాళిదాసుని ఆశ్రయశిల్పమును అనన్యసాధ్యముగ నిరూపించుచున్నది

శాకుంతలగాథ ఈనాటివారికేగాక కాళిదాసునాటి ప్రజకుగూడ ప్రాచీనోదంతమే తన సమకాలికులను దీసికొనిపోయి పురాణగాథకు ఆశ్రయమయిన వాతావరణమున గూర్చుండబెట్టవలయుట కవికి విధియగుచున్నది భావనాబలము నూతగాగొని శకుంతలాదుష్యంతులను ప్రత్యక్షపరచుటయేగాక వారు సంచరించిన ప్రదేశములను ఆనాటియాచారవ్యవహారములను ప్రత్యక్షపరచవలసియున్నది స్కాట్టునవలలోవలె దీర్ఘవర్ణనములు చేయుటకు నాటకమున వీలులేదు రెండుమూడుసూచనలతో నానాటి ప్రపంచమంతయు ప్రత్యక్షము కావలసియున్నది. అతికష్టసాధ్యమయిన యీ వ్యవసాయమునందు కాళిదాసుని బుద్ధి ఇంద్రజాలమువలె బనిచేసినది నాటకమును చదువుచున్నప్పుడే లేడిపిల్ల పరుగెత్తుచున్న మాలినీతీరమునందలి కులపతి యాశ్రమవనమును — శకుంతలసోదరస్నేహమున కాలవాలములగు లతాపాదపమిథునములును — శకుంతలాదుష్యంతుల గాంధర్వవివాహమున పుష్పాక్షతలు చల్లిన వేతసపరిక్షిప్తలతామంటపమును — నృత్యములు చాలించి శకుంతల నత్తవారింటికి బంపుచు కన్నీళ్ళు నించుచున్న వనమయూరము

లును—దర్భకబళములను వీడి పరుగెత్తుకొనివచ్చు మృగపోతకములును—నిలువున నీరయిపోవుచున్న లతలును — ఆశీస్సులిచ్చి పట్టుచీరలు కానుకలు పెట్టుచున్న వనదేవతలును—దుష్యంతుని పశ్చాత్తాపమును పంచుకొనుచు మధుమాసమునసహితము పుష్పింపకున్న నగరోద్యానమును — శకుంతలాదుష్యంతుల పునస్సమాగమునకు ఉప్పొంగుచు మిన్నుముట్టుచున్న హేమకూటశిఖరమును—ఈదృశ్యములన్నియు కన్నులకు కట్టినట్లు కాగా చదువరిమనస్సు ఆనందలహరిపై నుయ్యాలలూగుచున్నది. ఇక ప్రేక్షకుని యనుభూతి నెవరు వర్ణింపగలరు? అపురూపమును అత్యంతరమణీయమును నగు సౌందర్యమయప్రపంచమును ఈ నాటకమునందలి ప్రధానవస్తువుకు ఆశ్రయముగ కాళిదాసుని బుద్ధివైభవము సృష్టించుకొన్నది

కాళిదాసుని ఆశ్రయశిల్పముకూడ నాటకీయ విభ్రాంతిసిద్ధాంతమునే స్థిరపరచుచున్నది నిజముగ దుష్యంతునినాటి జీవితమును కాళిదాసుని కాలమున నున్నకవికి పూర్ణముగ చిత్రించుట యెన్నడును సాధ్యము కానేరదు. చరిత్రాత్మక నాటకరచనమునే గైకొందము ఈనాడు కృష్ణదేవరాయలకాలమునాటి యుదంతమును చిత్రింపవలసియున్నదనుకొనుడు రాయల సమకాలికవాఙ్మయమును అనగా—కావ్యములను చరిత్రములను శాసనములను అన్నిటిని ఎంతో శ్రమపడి చదివి కృషిచేసిన కవికిగూడ ఆనాటిజీవితమునుగాని భావనుగాని పూర్ణముగ పునరుద్ధరించుట అసాధ్యము ఎంత జాగరూకత వహించినను తన కాలమునాటి ఆచారవ్యవహారములు భావ ఇవన్నియు నాటకమున ప్రవేశించుచునే యుండును ఉన్నంతవరకయిన ఆధారములను ఎంత జాగరూకతతో ననుసరించినను ఆనాటిజీవితమును భావను పునరుద్ధరించుటలో స్వల్పాంశములలో ఏవో తప్పులు దొరలుచునే యుండును ఆతప్పులు ఈనాటివారు కనిపెట్టలేకపోవచ్చును గాని ఆనాటివాడెవ్వడయిన ఆనాటకమును చదువుట సాధ్యమయినచో సులువుగ

గుర్తించి నవ్వుకొనుట కవకాశమున్నది. ఏనాటి జీవితమునో పునరుద్ధరించుటమాట యటుండ ఈనాటి జీవితమునుకూడ ఇంకొక దేశమునకు సంబంధించినదయినచో నెంత జాగరూకత వహించినను ఏదో పొరపాటు వచ్చుచునే యుండును. బెర్నార్డుషా "On the Rocks" అను సమకాలిక నాటకములో నొక హైందవపాత్రను ప్రవేశపెట్టి "By Brahma" అని యాతఁ డొట్టుపెట్టుకొనినట్లుగ వ్రాసినాడు. ఇతర దేవతలపాదములపై నొట్టుబెట్టుకొను నాచారము మన దేశములో నున్నది "శ్రీమన్నారాయణమూర్తి పాదాలతోడు" "కన్యకాపరమేశ్వరి పాదాలతోడు" అని యీతీరుగ నొట్టు బెట్టుకొనుచుందురు గాని బ్రహ్మదేవుని పాదములతో (బ్రహ్మశబ్దమున కర్థము చతుర్ముఖబ్రహ్మయైనను పరబ్రహ్మమైనను సరే) నొట్టుబెట్టుకొను నాచారమెక్కడను లేదు. ఈనాటకమును వ్రాయునపుడు "షా"యును చూచునపుడు ఆంగ్లేయప్రేక్షకులు "హైందవపాత్రము ఎంతచక్కగ పోషితమైనది" అని హర్షించుట కవకాశముకూడ నున్నది. కాని భరతఖండమునందలి ఏ బాలుడైనను దీనిలోనున్న వైరుధ్యమును గనిపెట్టి నవ్వుకొనకమానడు. దీనివలన దేలుచున్న దేమనగ నెంత సర్వజ్ఞుడని బిరుదువహించిన మహాకవియైనను ఇంకొక కాలమునందలిగాని దేశమునందలిగాని జీవితమును భాషను పునరుద్ధరించుటలో పూర్ణవిజయము గాంచుట కవకాశము లేదనియును పూర్ణవిజయ మనుకొనుచోట్ల గూడ నెన్నో పొరపాటులు తెలియకుండ నుండుట కవకాశ మున్నదనియు ఎంత ప్రతిభావంతుడైనను కృషిచేసి సాధింపగలిగినది నాటకీయవిభ్రాంతియే యనియును. ఎక్కడనో ఒక్క స్ఖాలిత్య మున్నను దానికి కవి పశ్చాత్తాపపడవలసిన యగత్యములేదు. ఏమానవుడుగాని అసాధ్యమును సాధింపవలెనని ఎవ్వరును ఆశింపరు. ఈనాటివారు నాటకమును జూచుచుండగ నాటకమునకు ఆశ్రయమైన రంగము—దేశము—కాలము భాష—యథార్థముగనే ఉన్నవను భ్రాంతి సమష్టిమీద నేర్పడినజాలును.

"అసత్యమయ మయినచో నట్టి భ్రాంతివలన నేమి ప్రయోజనము?" అని కొందరు ప్రశ్నింపవచ్చును ఈనాటివారు వెనుకటి కాలమును చిత్రించునపుడు ఆకాలమునకు ప్రాణపదమయిన ప్రధాన సూత్రములకు భంగమురాకుండ గాపాడుకొనుచు స్వల్పాంశములలో పొరబడినను నష్టములేదనుటయే ఈవిభ్రాంతి సిద్ధాంతమునకు సారము గాని చిత్రణ మంతయు నసత్యమయముగ నున్నను ఇబ్బంది లేదని కాదు ఈసందర్భమున కాలమునకును కాలస్వరూపమునకును గల తారతమ్యమును మనము విస్మరింపరాదు వెనుకటికాలము నంతను పునరుద్ధరించుట ఎవ్వరితరమును గాదు కాని చరిత్రపరనము దీక్షతో నెరవేరినచో ఆకాలమున కాత్మయై యలరారు రహస్యములను చిత్రించుట సుసాధ్యము ఆరహస్యములను అనుసంధించి చిత్రించినపుడే కాలస్వరూపము (Time sprit) చిత్రితమై నాటకీయవిభ్రాంతి (Dramatic Illusion) కృతార్థమగును స్వల్పాంశములలో వ్యత్యాస మున్నను విచారింప నగత్యములేదు

శాకుంతలమునూ జూచుచున్నపుడు ప్రేక్షకులను దీసికొనిపోయి కాళిదాసుడు భారతయుగమున గూర్చుండ బెట్టగలిగినాడా లేదా అనునదియే ప్రశ్న. ఈప్రశ్నకు సమాధాన మీయవలసివచ్చినపుడు సమష్టి మీద జూచుకొనవలసినదేగాని వ్యష్టిమయి ప్రత్యంశమును స్తనశల్య పరీక్షచేసి వాస్తవికతానిర్ణయము చేయ నక్కర లేదు. అట్టి సమష్టిదృష్టి నవలంబించునపుడు కాళిదాసుని యాశ్రయశిల్పము అఖండవిజయమున కాస్పద మనుటకు సందేహింపవలసిన పనిలేదు

# శాకుంతల విమర్శనము

## శాకుంతలము — శకుంతలోపాఖ్యానము

శాకుంతలమునకు ఆధారము భారతమునందలి శకుంతలోపాఖ్యానము. ఈ శకుంతలోపాఖ్యానము ప్రక్షిప్తమని పూనా భండార్కర్ ఇన్‌స్టిట్యూట్ వారి భారతమునకు సంపాదకులగు శ్రీ సూక్తంకరుల యభిప్రాయము. ఇది ప్రక్షిప్తమా? కాదా? యను ప్రశ్నలతో మనకిప్పుడు ప్రసక్తి లేదు. ప్రక్షిప్తమే యని యంగీకరించినను అది కాళిదాసునకు పూర్వమే ప్రక్షిప్తమై యుండవలెననియు కాళిదాసు నాటకమున కదే యాధారమనియు నంగీకరించుటలో ఎట్టి వివాదమును ఉండనేరదు.

ఇప్పుడు భండార్కర్ ఇన్‌స్టిట్యూటువారు ప్రచురించుచున్న భారతము చూచినచో ఉత్తరాది ప్రతులకును దక్షిణాది ప్రతులకును ఎంతో వ్యత్యాసము గానవచ్చుచున్నది. వ్యాసరచితమగు మహాభారతము వ్యాసరచితముగ మనకు లభ్యమగుటలేదు. ఎట్టి పూర్వాచార పరాయణుడయినను ఇది ప్రక్షిప్తమయమయి పెరిగిపోయినదని అంగీకరింపక తప్పదు. ఆదిభారతప్రతిని ఇప్పుడు నిర్ణయించుకొనుట అసాధ్యము.

శకుంతలోపాఖ్యానమున ఉత్తరాది ప్రతులలో 325 శ్లోకములు మాత్రమే యుండగ దక్షిణాది ప్రతులలో దానికి చిలువలు పలువలు బెట్టి 590 శ్లోకములవరకు అనగా ఇంచుమించుగా రెట్టింపువరకు బెంచుకొని వచ్చినారు. "కాళిదాసు ఏప్రతి ననుసరించియుండును?" అనుట చారిత్రకదృష్ట్యా ముఖ్యమైన ప్రశ్నయే. ఇప్పుడు లభ్యమగుచున్న యాధారములనుబట్టి అతడు దక్షిణాది ప్రతులనే అనుసరించి యుండవచ్చునని యూహించుటకవకాశ మేర్పడుచున్నది గాని కళాదృష్టిమై విమ

ర్శించుచున్న మనకు భాండార్కర్ ఇన్‌స్టిట్యూటువారి భారతములో నిర్ణయింపబడిన పాఠమును అనుసరించుట కెట్టి యాటంకమును ఉండ రాదు మొత్తముమీద నేప్రతిని పరిశీలించినను భారతమున గనవచ్చు శకుంతలోపాఖ్యానమును రచించినకవి—ఆతడెవ్వరైన గానిండు — కాళి దాసునికంటెను ఉత్తమతరగతికి జెందినవాడే కథాప్రస్తరణ పాటవము చూచినను పాత్రీకరణ వైదగ్ధ్యమును చూచినను భావసంచరణ ప్రాగ ల్భ్యమును చూచినను శయ్యాసౌష్ఠవము చూచినను మూలము కాళి దాసుని ప్రతిభకు కూడ అతీత మగుచున్నది

శాకుంతలమును శకుంతలోపాఖ్యానమును సరిపోల్చుటలో శకుం తలోపాఖ్యానము శ్రవ్యమగు ఒక మహాకావ్యములో ఒకచిన్న ఉపా ఖ్యానమనియును శాకుంతల మట్లుగాక ప్రత్యేకదృశ్య ప్రబంధమనియు విస్మరింపరాదు సమానజాతికిజెందిన ఇరువురు కవులు రచించిన నాట కములను సరిపోల్చినట్లుగ ఈ రెండిటిని సరిపోల్చుటకు వలనుపడదు. పురాణకథను రంగస్థలమున ప్రదర్శనయోగ్యముగా నొనరించుపట్ల యథోచితముగ పూర్వకథను సంస్కరించుకొనుటకుగాని నూతనోన్మే దంతములను గల్పించుకొనుటకుగాని నాటకకర్తకు స్వాతంత్ర్య మున్న దనుటనుగూడ మనము విస్మరింపరాదు. పురాణకథలోనున్న మాహాత్మ్య మంతయు నాటకములోనికి వచ్చినదా? లేదా? లేక మాహాత్మ్యము నందు నాటకము పురాణమును మించినదా? అనునవే ప్రశ్నలు.

నాటకము పురాణముకంటె మాహాత్మ్యమునం దనేకవిధము ల కొరవడినదనగనే ఏ యంశమునందునుకూడ నది మేలుచేయ కాలేదని కూడ యర్థముకాదు మూలములో దీర్ఘముగనున్న వర్ణనలు ఇందు కొన్నియెడల పూర్ణముగ వర్జించినాడు కొన్నియెడల సంగ్రహించి నాడు మూలములో ననుచితములుగ దోచు ఘట్టములుకొన్ని యిందు ఔచిత్యనిక్షేపనిధులయి విరాజిల్లుచున్నవి మచ్చునకొక్క యుదాహర ణము—మూలమున శకుంతలా పూర్వవృత్తాంతమును రాజుతో శకుం

తల స్వయముగ జెప్పినట్లున్నది ఇది మిగుల దీర్ఘముగనుండుట మొదటి లోపము. ఉత్తరాదిప్రతులలోనైనను శకుంతలజన్మకథ 32 శ్లోకములలో వర్ణితమైనది. అందును మేనక విశ్వామిత్రునకు తపోభంగ మొనర్చుపట్ల

> అభివాద్య తతః సా తం ప్రాక్రీడ దృషిసన్నిధౌ
> అపోవాహ చ వాసో ఽస్యా మారుత శ్శశిసన్నిభం॥
>
> సా గచ్ఛ త్త్వరితా భూమిం వాస స్తదభిలింగతీ
> ఉత్స్మయన్తీవ సవ్రీడం మారుతం వరవర్ణినీ॥
>
> గృద్ధాం వాససి సంభ్రాంతాం మేనకాం మునిసత్తమః
> అనిర్దేశ్య వయోరూపాం అపశ్య ద్వివృతాం తదా॥

ఇత్యాది స్థలములలో మిగుల మోటుగకూడ నున్నది. పెండ్లికానిపిల్ల ముక్కుమొగమెరుగని యొక క్రొత్తమనుష్యునితో ఈ తీరున ముచ్చటించుట మిగుల ననుచితముగ నున్నదని గ్రహించి ఈ జన్మకథను శకుంతలనోట నుంచక ఆమెసఖులచే పలికించినాడు కాళిదాసు. ఆ పలికించుటలో వీణ పలికించినట్లు ఎంతో శ్రుతిమనోహరముగ పలికించినాడు. ధ్వనిప్రధానముగ బలికించినాడు.

రాజా — భగవాన్ కాశ్యపః శాశ్వతే బ్రహ్మణిస్థితః ఇతి ప్రకాశః ఇయం వ స్సఖీ తదాత్మజేతి కథ మేతత్?

అనసూయా — శృణో త్వార్యః. అస్తి కౌశిక ఇతి కృతగోత్రనామధేయో మహాప్రభావో రాజర్షిః.

రాజా — అస్తి శ్రూయతే తతః?

అన — త న్నౌ సఖ్యాః ప్రభవ మవగచ్ఛ. తే నోజ్ఝితాయాః శరీరసంవర్ధనాదిభిః తాతకాశ్యపోఽస్యాః పితా

రాజా — ఉజ్ఝితశబ్దేన జనితం మే కౌతూహలం ఆమూలా చ్ఛ్రోతు మిచ్ఛామి.

అన — శృణో త్వార్యః పురా కిల తస్య రాజర్షే రుగ్రేతపసి వర్తమానస్య కిమపి జాతశంకై ర్దేవై ర్మేనకా నామాప్సరా నియమవిఘ్నకారిణీ ప్రేషితా

రాజా — అస్త్యేత దన్యసమాధిభీరుత్వమ్ దేవానామ్ తత స్తతః?

అన — తతో వసన్తోదారసమయే తస్యా ఉన్మాదయిత్రుకం రూపం ప్రేక్ష్య (ఇ త్యర్ధోక్తే లజ్జయా విరమతి)

రాజా — పరస్తా దవగమ్యతఏవ, సర్వథా అప్సర స్సంభవైషా?
అన — అథ కిమ్?

నాటకకర్తల కెల్లను మేలుబంతి యనదగిన యీ సంభాషణమున ఎంత ఔచిత్యజ్ఞానము ప్రస్ఫురిత మగుచున్నది వృత్తాంతమునంతను ఒక్క గుక్కలో నేకరువు బెట్టించకపోవుట మొదటియందము ఎక్కడను వ్యక్తులనుగూర్చిగాని సన్నివేశములను గూర్చిగాని దీర్ఘవర్ణనము లేక పోవుట రెండవవిశేషము 'కృతగోత్ర నామధేయో మహాప్రభావో రాజర్షిః' అను రెండుముక్కలలో విశ్వామిత్రుని మాహాత్మ్యమంతయు వెల్లడి యగుచున్నది "శరీర సంవర్ధనాదిభిః" అనుటలో ధర్మశాస్త్ర చర్చ యంతయు ధ్వనిత మగుచున్నది మాటకు మాటికి ఉత్తరమేర్పడు చున్నది అప్రస్తుతమైన గాథల కెక్కడను తావు లేదు అనసూయచే నర్ధోక్తిలో విరమింపజేయుటయు రాజుచే 'నవగత మేవ' యనిపించు టయు యీ ఘట్టమునకు తలమానికములు. ఇట్టి నాజూకుపనితనము కాళిదాసునకే చెల్లినది ఇట్లే రాజసభలో శకుంతలాదుష్యంతులకు నడచిన సంభాషణములో పరుషములగు పరస్పర దూషణవాక్యములు కొన్ని మూలములో నుండగ కాళిదాసు వానిని పూర్ణముగ తొలగించి వైచినాడు.

అదిగాక కణ్వునిపాత్రమును విపులీకరించి చిత్రించుటలోను, శకుంతల యాశ్రమజీవితమును ప్రత్యక్షీకరించుటలోను, శకుంతలాదుష్యంతుల ప్రథమపరిణయమును విపులీకరించి రసప్లుతము గావించుటలోను, మూలములో లేని శార్ఙ్గరవశారద్వతులను అనసూయా ప్రియంవదలను నూతనముగ సృష్టించి పోషించుటలోను యథోచితములగు సంస్కరణములచేతను కల్పనలచేతను మూలమునకు మెఱుగుపెట్టుటలో కాళిదాసుని యుపజ్ఞ పూర్ణముగ మూర్తీభవించుచున్నదనుటనిస్సంశయము. ఇందు పెక్కుఘట్టములలో కాళిదాసుని తాత్త్వికగుణము లాలిత్యము జగన్మోహనముగ నృత్యము సల్పినది

కాని మూలమునకును నాటకమునకును తారతమ్యము నిర్ణయింప వలసివచ్చినపుడు కాళిదాసు కల్పించిన రెండు ముఖ్యోదంతములు విమర్శనీయము లగుచున్నవి (1) శాపవృత్తాంతము (2) అంగుళీయక వృత్తాంతము. ఈ రెండింటిని పురస్కరించుకొని శకుంతలోపాఖ్యానమునకును శాకుంతలమునకును కథాపరిణామము మున్నగు ముఖ్యాంశము లందు ఎంతో తారతమ్య మేర్పడుచున్నది

మూలము ననుసరించినచో నాటకము పంచమాంకముననే ముగియవలసినది శకుంతలోపాఖ్యానము యథార్థచరిత్రమే కానిండు కల్పితకథయే కానిండు దీనికి ప్రాప్యము సత్యమునకున్న మాహాత్మ్యమును స్థాపించుటయే దుష్యంతుడు వేటకుబోయి అరణ్యమున కణ్వాశ్రమమున యాదృచ్ఛికముగ శకుంతలను గలసికొన్నాడు ఆమెసౌందర్యమునకు సమ్మోహితుడయి యామెను వివాహ మాడగోరినాడు. ఆమె తన జనకుడు వచ్చువరకు నాగి అతని యనుమతిమై వివాహ మాడవలసినదిగా ప్రార్థించినది క్షత్రియకన్యలకు ఇతరుల యనుమతితో నిమిత్తము లేని గాంధర్వవివాహము ధర్మశాస్త్రసమ్మత మని యుపన్యసించి ఆమె కుమారునికి యౌవరాజ్య మిచ్చెదనని సమయముచేసి ఆమె నొడబరచి తనయభీష్టము నెరవేర్చుకొని యింటికి మరలినాడు అటుతరువాత కణ్వుడు శాపమిచ్చునేమో యను భయముచే నామెమాట మరి తల పెట్టలేదు. ఆమెకు పుత్రోదయమైనది రాజునొద్దనుండి ఆహ్వానము నేడువచ్చునో రేపువచ్చునో యని కొన్ని సంవత్సరములైనను వేచి యున్నది. ఇక పుట్టినింటినివాసము ధర్మసమ్మతము గాదనియు పుత్రునకు యౌవరాజ్యాభిషేక కాలము వచ్చినదనియు కణ్వుడు ప్రబోధించిన మీదట పుత్రుని వెంటబెట్టుకొని భర్తయొద్దకు వచ్చినది. అతడు పేరోలగమున నుండగ సత్యసంధుడు గనుక తన్ను సగౌరవముగ స్వీకరించునని కొండంత యాశతో — సముచితముగ తన్నెఱుకపరచుకొన్నది. పుత్రుని స్వీకరించి యౌవరాజ్యమిమ్మని కోరినది అతడు ఎరిగియు ఎరు

గనివానివలెనటించి "నీవెవ్వతెవో నే నెఱుగను పొమ్మ"న్నాడు. ఆమె చేయునదేమి? ఆమెకుసాక్ష్యమెవరు? మరియొక ప్రాకృతస్త్రీ యయినచో ఈసన్నివేశమునకు చతికిలబడవలసినదే. ఆమెకూడ కొంతసేపు నిర్విణ్ణ చిత్తయై యూరకున్నదిగాని అంతరంగసంస్కారము ఆశ్రమజీవితము ఆశ్రమశిక్షణము నామె నూరకుండనిచ్చినవికావు. ఎవ్వరును సాక్ష్యము లేరుగదా యని అసత్యమున కొడబడి ధర్మపత్నిని వంశోద్ధారకుడగు పుత్రుని నిరాకరించుట తగదని ఆమె ఎన్నోవిధముల నయమున భయమున ప్రబోధించి చూచినది, లాభము లేకపోయెను. చేయునదిలేక ఆమె నిస్పృహ వహించినపుడు దేవదూత యశరీరవాణితో 'సత్యమాహ శకుంతలా' యని సాక్ష్యమిచ్చినాడు. అపుడు రాజు నిందుకొలువునుగాంచి తన నిరాకరణములోనున్న పరమార్థము శకుంతలను పుత్రుని శోధించుటయే యని వారికి విశదీకరించుచు ఆమెను పుత్రుని సగౌరవముగ స్వీకరించి పూజించినాడు. పుత్రుని యౌవరాజ్యాభిషిక్తుని గావించినాడు. 'భరస్వ' అని ఆకాశవాణి పలికినది గావున అతడు భరతుడైనాడు. అతనివంశము భారతవంశమును ఈభూమిభారతభూమియు నైనవి.

ఇది మూలములోని కథకు సంక్షిప్తరూపము ఈ కథకు చక్కని సహజపరిణామ మేర్పడుచున్నది అశరీరవాణి సాక్ష్యముతో దీని కాశ్వాసాంతము. శకుంతలాదుష్యంతుల ధర్మవివాదము దీనికి ప్రాణము ఆకాశవాణి సాక్ష్యము పలుకుట యద్భుతప్రక్రియగానెంచి దానిని కాళిదాసు నిరాకరించియుండడు ఏ:యన నాటకములోగూడ వేరొక తావున అశరీరవాణి న ప్రకరణముగ నాతడుకూడ వినియోగించుకొన్నాడుగదా! (అం 4 శ్లో. 4) మరి యీ కథనుమార్చి దుర్వాసుని శాపవృత్తాంతము ను అంగుళీయకవృత్తాంతమును గల్పించుటలో కాళిదాసు సంకల్పించిన పరమార్థ మేమయియుండును. దానివలన సిద్ధించిన ప్రయోజనము లెవ్వి? అనుప్రశ్న లిపుడు మనల నెదుర్కొనుచున్నవి.

మూలములోని కథాపరిణామము సహజముగ లేదని యెంచి కాళిదాసు కథను మార్చినట్లుగ దోచదు మూలములో నున్నదాని కంటె నాటకములోని కథాపరిణామము ఎక్కుడు సహజముగ నున్నదా? ఉన్నట్లు కనబడదు శకుంతలవివాహము తన యనుమతి మీద జరుగకపోయినను తరువాతనయినను దానిమీద కణ్వుడంగీ కారముద్ర వైచినాడుగదా! అట్టిచో గర్భవతియగు కుమార్తెను ప్రస వించినవెనుక అత్తవారింటికి పంపుట సహజముగాని గర్భవతినే తొం దరపెట్టి హస్తినగరమునకు పంపుటలో నౌచిత్యమేమున్నది. అందుచే మూలములోనున్నట్లుగ పురుషవచ్చినవెనుక పుత్రసహితముగ శకుం తల రాజును సందర్శించినదనుటయే ఉచితముగ నున్నది అశరీరవాణి మున్నగు నద్భుతముల నంగీకరించినచో రాజునకు శకుంతలకు వివా దము సిద్ధించినపుడు అక్కడికక్కడనే అశరీరవాణిసాక్ష్యసాహాయ్యమున కథను ముగించుటలో సహజపరిణామమేర్పడుచున్నదిగాని దీనికి అంగుళీయకవృత్తాంతము శాపవృత్తాంతము గల్పించి డొంకతిరుగు డుగ పోనిచ్చుట కథ కేమాత్రము ప్రయోజనకారి? ఇంతకును మూల ములో సాధితమగు పరమార్థము నాటకములో సాధితమే కాలేదు. ఆ దినములలో రాజు నెన్నుకొనుటలో ప్రజలకుగూడ నెక్కుడుగ స్వాతంత్ర్యమున్నట్లు గానవచ్చుచున్నది అందుచే వెంటనే భరతుని తనపుత్రునిగ నంగీకరించినచో తనయనంతర మాతడు సింహాసన మధి ష్ఠించుటను ప్రజ లంగీకరింపకపోవచ్చునని ఋత్విక్పురోహితాచార్యాది పౌరవర్గము సమక్షమున నిండుకొలువున అశరీరవాణి సాక్ష్యమిచ్చిన మీదట శకుంతలను భరతుని దుష్యంతు డంగీకరించినాడు. ఇది మూల ములోని పద్ధతి ఇక నాటకమున నన్ననో అంగుళీయకమువలన స్మృతి లబ్ధియు మారీచాశ్రమమునందలి పునస్సమాగమమును ప్రజల పరోక్ష మున నడచినవే. ఇవి వ్యక్తిగతములయిన యుదంతములుగాని ప్రజా సామాన్యమునకు ప్రత్యయము పుట్టింపజాలిన బహిరంగోదంతములు

గావు అదిగాక శకుంతలోపాఖ్యానమునకు ప్రాణప్రదమైన "శకుంతలా దుష్యన్తుల ధర్మవివాదము" అను సన్నివేశమును మిక్కిలి సంక్షిప్త పరచియు పెడత్రోవనుబట్టించియు కాళిదాసు కథకు ప్రాణము దీసి వైచినాడు.

"న ఖ్వేకస్మిన్ దివసే నవమాలికామణ్టపే నలినీపత్రభాజనగత ముదకం తవహస్తే సన్నిహిత మాసీత్"—

ఇత్యాది భోగలాలసములగు వాక్కులవలననా దుష్యంతునకు ప్రబోధము కలిగింపచూచుట! ఆత్మవిశ్వాసము మూర్తీభవించినట్లుగ నున్న మూలమునందలి ధర్మప్రబోధమునకును ఇటీవలికాలమువారిమర్యాదల ననుసరించి ఔచిత్య మెక్కడ చెడిపోవునోయని అత్యంత లలితముగ నడచిన నాటకమునందలి సంభాషణకును ఎక్కడనైన పోలికగలదా? తనతో సంగమించినవానికి సంగమమే జ్ఞప్తిలేకపోయినపుడు దాని ననుసరించినడచిన తక్కిన స్వల్పోదంతములు జ్ఞప్తియుండునా?

శకుంతలాదుష్యంతులను సమావేశపరచుటయందును భరతుని చారిత్రమునకు ప్రాముఖ్యమిచ్చుటయందునుగూడ మూలమునందలి కథాప్రస్తరణమే ప్రౌఢముగ గనవచ్చుచున్నది. మూలమునందు దుష్యంతునకు కణ్వాశ్రమము జూచిపోవలసినదని ఆశ్రమవాసులయొద్ద నుండి ఆహ్వానము లేదు. వేటకు వచ్చి వేటలో నలసిపోయి డప్పితీర్చు కొనుటకయి మాలినీతీరమునకు వచ్చి (డప్పి తీర్చుకొని) సమీపము ననేయున్న మునిపల్లెనుగాంచి ఋషిసందర్శనకుతూహలచే దుష్యంతు డాశ్రమమున ప్రవేశించినాడు ఫలాహరణార్థమై యరిగియుండుటచే ఆశ్రమమున ఋషి లేకపోవుటయు వచ్చినవాడు అతిథిగదాయని ఆశ్రమమునందలి యాచారము ననుసరించి అతిథిపూజకయి శకుంతల ప్రత్యక్షమగుటయు యాదృచ్ఛికముగ నడచినవి. ఇక నాటకమున నన్ననో వైఖానసులు శిష్యసహితముగ ప్రత్యక్షమయి ఆశ్రమము చూచిపోవలసినదని దుష్యంతు నాహ్వానించినారు. కణ్వు డాశ్రమమున నున్నాడా

అను ప్రశ్న మప్పుడే వచ్చినది కణ్వుడు లేడని చెప్పుచు దుష్యంతు నాశ్రమము చూచిపోవలసినదని యాహ్వానింపజేయుటలో నేమంత ప్రౌఢిమయున్నది ? ఈపన్ని వేశమును సమర్థించుకొనుటకయి

"రమ్యా స్తపోధనానాం ప్రతిహతవిఘ్నాః క్రియాః సమవలోక్య
జ్ఞాస్యసి కియద్భుజో మే రక్షతి మౌర్వీకిణాఙ్క' ఇతి.

అని యొకసమాధాన మదనమున గల్పింపవలసివచ్చినది అప్పటికయి నను ఈ సమాధానము సంతృప్తికరముగ కనబడదు. దుష్యంతునివంటి రాజర్షిని ఆశ్రమమున కాహ్వానించునపుడు కణ్వుడు ఆశ్రమములో లేడని యెఱింగియుండియు "నీవు ఆశ్రమమును చూచిపోవలసినదని చెప్పుటకంటె తాను వెనుకకు వచ్చి రాజునకు ఆశ్రమముచూపించుట వైఖానసునకు ఉచితక్రియ. లేదా తాను మహాతపస్వి గనుక వెనుకకు మరలుట తన మాహాత్మ్యమునకు లోప మని తలచినాడని సమర్థింత మన్నను తనవెంటనున్న శిష్యునైనను రాజువెంట బంపియుండవలసి నది. (ఇంతకు తానునెలపెట్టిన మహాకార్యము సమిధాహరణమేగదా!)

కాని శిష్యుని రాజువెంట బంపినచో శకుంతలాదుష్యంతుల సమావేశమున కవకాశమే యుండదేమో! ఒంటరిగ చెట్లకు నీళ్లు పోయుచున్న యౌవనవతులకడకు ఏదో సాకు గల్పించుకొని ప్రవే శించి రాజు ప్రణయవ్యవహారము నిర్వహించుకొనుటగూడ దుష్యంతుని ఉచితజ్ఞతకుగాని ఆశ్రమజీవితమునందలి పవిత్రతకుగాని అనురూపము కు కల్పన గానేరదు శకుంతలాదుష్యంతుల ప్రణయమును చిత్రించుటలో అనంగలేఖలను దూతికలను విరహవేదనమును ప్రవేశపెట్టి తనకాలపు నాగరకసంస్కృతిని కాళిదాసు దాటలేకపోయినాడు అందుచే మూల ములో నొక యుదంతమునుండి ఇంకొకయుదంత ముదయించినంత సహ జముగ నాటకములో నుదయించుట లేదు. మూలములోని కథకు చక్కని సహజపరిణామ మేర్పడుచున్నది

మూలములో రాజు తన్ను వివాహమాడగోరినపుడు శకుంతల

యది ధర్మపథ స్త్వేష యది చాత్మా ప్రభుర్మమ
ప్రదానే పౌరవశ్రేష్ఠ శృణు మే సమయం ప్రభో
సత్యం మే ప్రతిజానీహి యత్త్వాం వక్ష్యా మ్యహంరహః
మమ జాయేత యః పుత్రః స భవే త్త్వ దనంతరమ్॥

అని స్పష్టముగ నడిగివైచినది. ఇట్లనిపించుటలో ఉపాఖ్యానకర్త స్త్రీ హృదయమును మిక్కిలిచక్కగ చిత్రించిన వాడగుచున్నాడు స్త్రీకి స్వసుఖాభిలాషకంటె సంతానము క్షేమముగ నుండవలెను, వృద్ధిలోనికి రావలెను, అనిన కాంక్ష యధికముగ నుండును దానికై యామె స్వశరీరత్యాగమునకైన నోడబడును తనకుపుట్టిన పుత్రుడు చక్రవర్తి కావలెననుకోరిక ఆమె చిరకాలమునుండి హృదయములో నిక్షిప్త మొనర్చుకొని యుండవలెను రాజర్షియగు విశ్వామిత్రునకు దేవభామిని యగు మేనకకు జనించిన కన్యకకు ఈకోరిక సహజముగదా! అందుచే వివాహ ప్రసక్తి వచ్చినపుడు ఆమె యీకోరికను నలితొలి లేకుండ తెగగొట్టి వెల్లడించినది. నాటకములోనో శకుంతలాదుష్యంతుల సంగమసమయమున ఈ వరమునకు ప్రత్యక్షమయిన ప్రసక్తిలేదు. "సఖి అల మంత్రః పురవిరహ పర్యుత్సుకస్య రాజర్షే రుపరోధేన" అనుటలో ముగ్ధయు నాగరికజీవితము నెరుగని యమాయికహృదయయుగ నాటకమున చిత్రింపబడిన శకుంతలాపాత్రమున కిది ఔచిత్యమునకు భంగకరము కాదని యంగీకరించినను ఈవాక్యము సపత్నులయెడ నసూయచే ప్రేరితముయినట్లు తోచుచున్నదిగాని "చక్రవర్తికి జనని కావలెను" అను నుత్తమాశయము వలన జనించినట్లుగ తోచుటలేదు.

"వయస్య బహువల్లభా రాజానః శ్రూయన్తే యథా నో ప్రియసఖీ బంధుజనశోచనీయా న భవతి తథా నిర్వాహస్వ" అను చెలికత్తెల వ్యంగ్యముష్టిలోకూడ శకుంతలప్రతిష్ఠను గూర్చిన యాందోళనమే ప్రధానముగ ప్రస్ఫురితమగుచున్నది. కాని సంతతినిగూర్చిన ప్రసక్తి లేదు. శకుంతలను కణ్వుడు ఆశ్రమమునకు తిరిగివచ్చి సంగమవృత్తాం

తమును దివ్యచక్షువుతో తిలకించిన వెనుక నడచిన ప్రసంగములో గూడ మూలములో

మహాత్మా జనితా లోకే పుత్రస్తవమహాబలః
య ఇమాం సాగరాపాంగాం కృత్స్నాం భోక్ష్యతి మేదినీమ్॥

అని భరతోత్పత్తికి ప్రాముఖ్యమిచ్చి పలికినాడు నాటకమునమాత్రము

"దిష్ట్యా ధూమావరుద్ధదృష్టేరపి యజమానస్యపావక ఏవాహుతిః పతితా వత్సే! సు శిష్యపరిదత్తేవ విద్యా అశోచనీయాసి మే సంవృత్తా అద్యైవ రాజర్షి పరిగృహీతాం త్వాం భర్తుస్సకాశం విసర్జయామి"

అనుటలో భరతుని ప్రసక్తియే కానరాకుండనున్నది ఈప్రసక్తి ఈ సన్నివేశమున మిక్కిలి ముఖ్యమయినది శకుంతల చాలకాలము కణ్వాశ్రమముననే నిలిచిపోవుటకును తుదకు భర్తృసకాశమునకు బయలు దేరుటకునుకూడ కారణము నిదే నిరూపించుచున్నది "చక్రవర్తిలక్షణములు గలిగిన కుమారుడుదయించునుగదా పుత్రోదయమైనవెనుక నే పతియింటికి బంపవచ్చు"నని కొంతకాలమును పుత్రు డుదయించిన వెనుక "ఇంకను రాజాహ్వానము లేదుగదా ఈలోపున నీపుత్రుని సుశిక్షితుని జేయవచ్చు"నని కొంతకాలమును ఉపేక్షజరిగినది ఇక సర్వదమనుని రాజ్యలాభమునకు భంగమువచ్చునని తోచినపుడుమాత్రము కణ్వుడు మేల్కొన్నాడు శకుంతల నత్తింటికి బంపునపుడు మూలములో మున్ముందుగ నిరూపించిన కారణమిది.

తం కుమారం ఋషి ర్దృష్ట్వా కర్మ చాప్యతిమానుషమ్
సమయో యౌవరాజ్యాయే త్యబ్రవీచ్చ శకుంతలామ్॥

నాటకములో "అద్యైవ" అని అంతతొందరగ త్రోలివేయుటకు నే కారణముకూడ నిరూపితముగాని సూచితముగాని కాలేదు. ఉపాఖ్యానమున దుష్యంతుని సభాప్రవేశమొనర్చి యథోచితములు నడచిన వెనుక శకుంతల మున్ముందుగ నెత్తుకొనినదిగూడ భరతుని యౌవరాజ్యమును గూర్చియే

పూజయిత్వా యథాన్యాయ మబ్రవీ త్తం శకుంతలా।
అయం పుత్రస్త్వయా రాజన్ యౌవరాజ్యేభిషిచ్యతామ్॥

దుష్యంతునితో వివాదము తటస్థించిన వెనుక తాను నిరాకరింపబడుట కయినను ఆమెయంగీకరించినదిగాని పుత్రనిరాకరణమునకియ్యకొనలేదు.

కామం త్వయా పరిత్యక్తా గమిష్యామ్యహ మాశ్రమమ్ ।
ఇమంతు బాలం సంత్యక్తుం నార్హ స్యాత్మజ మాత్మనా॥

అని పరిపరివిధముల ప్రార్థించినది అంతకును వినకపోయినపుడు

అస్య తే చేత్ప్రసంగ స్తే శ్రద్ధాసి నచే త్స్వయమ్ ।
ఆత్మనో హన్త గచ్ఛామి త్వాదృశే నాస్తి సంగతమ్॥

అని తిరస్కరించుటలో గూడ

ఋతేపి త్వయి దుష్యంత శైలరాజావతంసకామ్ ।
చతురన్తా మిమా ముర్వీం పుత్రో మే పాలయిష్యతి॥

అని పుత్రుని భావిగతినిగూర్చి ఉజ్జ్వలమగు విశ్వాసమును ప్రకటించుచున్నది ఈ యుపాఖ్యానమును ముగించుటలో మూలమున నొక చమత్కృతి యున్నది నాటకములో "భరతుడు" అను నామమును సమర్థించుటకయి "భరత ఇతి లోకస్య భరణాత్" అని మారు త్రోవను పోవలసి వచ్చినది అశరీరవాణి పత్నిని పుత్రుని భరింపవలసినదని సాక్ష్యమిచ్చుట అందు లేదు గనుక మూలములో నట్లుగాక

భర్తవ్యోయం త్వయాయస్మా దస్మాకం వచనాదపి॥
తస్మా ద్భవ త్వయం నామ్నా భరతో నామ తే సుతః॥

అనుటలో కథకు చక్కని ముగింపు సిద్ధించినది భరతుని నామము నందే శకుంతలాదుష్యంతుల చరిత్ర మంతయు ఇమిడిపోవుచున్నది. "భరతుడు అని పేరెందులకు వచ్చినది" అను ప్రశ్నము రాగానే దానికి సమాధానముగ శకుంతలాదుష్యంతుల చరిత్రమంతయు చెప్పవలసివచ్చుచున్నది ఇంతేగాక నాటకములోవలె పతిని పత్నినిపుత్రుని ఏకము చేయుటతో నాగక మూలములో

యాజయామాస తం కణ్వో దక్షవ ద్భూరిదక్షిణం ।

అని కణ్వునికి భరతునికిగూడ మరల సాంగత్యము చేకూర్చినాడు అంతతో నాగక

భరతా ద్భారతీకీర్తిం యేనేదం భారతం కులం ।

అని భారతవంశము విఖ్యాతికంతెకును చక్కని మైక్యము చేకూర్చి నాడు. ఈ భరతుని కిచ్చిన ప్రాముఖ్యమునుబట్టి కథకు నిక్యము నొడ కూర్చుట అను కళాప్రయోజనము మూలములో లెస్సగ సిద్ధించు చున్నది కథను కొంతవరకు తారుమారుచేయుటచే నాటకమున నిట్టి ప్రాముఖ్యమును కాళిదాసీయజాలకి పోయినాడు. దానివలన కథలో నున్న బిగి కొంతవరకు సడలిపోయినది. దుష్యంతు డెటింగియుండియు నీ వెవ్వతెవో నే నెఱుగను పొమ్మనుట ఉదాత్తనాయక లక్షణము గాదని తోచి కాళిదాసీ శాపవృత్తాంతమును అంగుళీయకవృత్తాం తమును గల్పింపవలసినవాడాయెనని తోచుచున్నది నాటకమున

"అహహో । ధర్మాపేక్షితా భర్తుః ఈదృశం నామ ముఖోపణతం రూపం దృష్ట్వా కోఽ న్యో విచారయతి"

అని దుష్యంతుని పరిజనునిచేతనేగాక "అథవా దుర్వాసఃకోప ఏవం వికారయతి అన్యథా కథం స రాజర్షిః తాదృశాని మంత్రయిత్వా ... లేఖామాత్రమపి నవిసర్జయతిః" యని శకుంతల చెలికత్తెయగు అన సూయ చేతను

"తత స్తపస్విన్యాం శకుంతలాయా మధర్మభీరో రస్య రాజర్షేః పరిణయ సందేహః అథవా కుత ఈ దృశానురాగోఽభిజ్ఞాన మపేక్షతే"

అని శకుంతలాపక్షపాతినియగు సానుమతిచేతను

"దుర్వాసశ్శాపా దియం సహధర్మచారిణీ త్వయా ప్రత్యాదిష్టా నాన్యథా"

అని దుష్యంతునితోడను "వత్సే విదితార్థాసి సహధర్మచారిణం ప్రతి న త్వయా మన్యుః కర్తవ్యః" అని శకుంతలతోడను శకుంతల కాశ్రయ మొసగిన పితృతుల్యుడగు మారీచప్రజాపతిచేతగూడ చెప్పించి దుష్యం తునివర్తనమును సమర్థింపజేసినాడు. అంతటితో నాగక "దిష్ట్యా అకా రణ ప్రత్యాదేశీ నార్యపుత్రః.. ప్రాప్తో మయా శాపో విరహశూన్య హృదయయా" అని దోషమంతయు దుష్యంతుని తలనుండి తొలగి పోయి శకుంతల తలమీదనే నిలిచినట్లు ఆమెచేతనే యొప్పించినాడు.

మూలమునకు భిన్నముగ బోయి యింత శ్రమపడి దోషియైన దుష్యంతుని నిర్దోషిగను నిర్దోషియయిన శకుంతలను కొంతవరకైన దోషిగను నిర్ణయించుటకు కాళిదాసున కెట్టి ప్రబలకారణము లుండెనో మనము చెప్పజాలము. అది చరిత్ర పరిశోధకులు చేయవలసినపని కాని కాళిదాసు అవలంబించిన పద్ధతి ఎంతవరకు సమీచీనముగ నున్నది ? ఎంతవరకు కళకు పోషకముగ నున్నది? అనునవే మన ప్రశ్నలు

మూలమునుబట్టియైనను దుష్యంతుని దోషిగ నెన్నవచ్చునా యని ప్రశ్న వచ్చినపుడు ఎన్నవలసియుండుననియే సమాధానము చెప్పవలసియున్నది మూలమున దుష్యంతుని పెండ్లియాడుటకయి శకుంతల పడిన యాత్రతకంటె శకుంతలను పెండ్లియాడుటకయి దుష్యంతుడే ఎక్కువగ నాత్రత పడినట్లు గానవచ్చుచున్నది మొట్టమొదట పెండ్లిప్రసక్తి తెచ్చినది దుష్యంతుడే. "దర్శనాదేవ హి శుభే త్వయా మే అపహృతం మనః" అని శకుంతలా పూర్వవృత్తాంతమునుగూర్చి ప్రశ్నించుటలోనే తన హృదయమును వ్యక్తపరచుటతో నాగక ఆ వృత్తాంత కథనము ముగిసిన వెంటనే

సువ్యక్తరాజపుత్రీ త్వం యథా కల్యాణి భాషసే
భార్యా మే భవ సుశ్రోణి బ్రూహి కిం కరవాణి తే॥

అని సూటిగ నడిగివైచినాడు కోరిక యుదయించుటనుగూర్చి కాని దానిని వ్యక్తపరుచుటనుగూర్చి కాని రాజును తప్పుపట్టవలసిన పని లేదు. మూలములో ఈ సన్నివేశమున శకుంతలమాత్ర మెక్కడను నిగ్రహమును వీడుటలేదు

ఫలాహారో గతా రాజన్ పితా మే ఇత ఆశ్రమాత్
తం ముహూర్తం ప్రతీక్షస్వ స మాం తుభ్యం ప్రదాస్యతి॥

అని యెంతో చక్కగ నామె సమాధానమిచ్చినది కాని రాజుమాత్రము ఆగక ధర్మశాస్త్రము ననుసరించి ఆమె క్షత్రియకన్య గావున ఒరుల యనుజ్ఞకయి వేచియుండనక్కరలేదని ప్రబోధించినాడు ఆమె యేర్పరచిన సమయమున కొడబడి యామెను వివాహమైనాడు. ఇంతవరకు

కూడ రాజులో దోషము కన్పింపదు కాని అక్కడ తీర్పుకొని నిజ పురాభిముఖుడై పోవుచు

> విశ్వాస్య చైనాం స ప్రాయా దబ్రవీచ్చ పునః పునః
> పేషయిష్యే తవార్థాయ వాహినీం చతురంగిణీమ్॥

అని ప్రతిశ్రుతము రాజపత్నియయి ముఖ్యముగ రాజమాత కావలసిన యామెను యథార్థముగ పురమునకు దోడ్కొని పోయెదనని నమ్మించి ఎన్ని సంవత్సరములైనను ఆమె మాటయే తలపెట్టకపోవుటలో దుష్యంతుని దోషిగ నిర్ణయింపవలసి వచ్చుచున్నది ఎట్టకేలకు ఆమెయే సాహసించి పుత్రుని వెంటబెట్టుకొని తన సముఖమున ప్రత్యక్షముకాగా

> సోఽథ శ్రుత్వైవ తస్యా రాజా స్మరన్నపి
> అబ్రవీన్న స్మరా మీతి కస్య త్వం దుష్టతాపసి॥

అని పలికిన భాగమునకురాగానే మనకోపమునకు మేరలేకుండ పోవుచున్నది ఆమెను తొందరపెట్టి ఫలాహరణార్థమయి పోయిన జనకుడాశ్రమమునకు మరలివచ్చువరకైన నాగనీయకుండ వివాహమాడిన వాడు తాను! చతురంగసేనతో స్వాగతమిచ్చి పురమునకు తోడ్కొని పోయెదనని నమ్మించినవాడు తాను! తుదకెన్ని సంవత్సరములయినను ఆమె మాటయే తలపెట్టక ఉపేక్షించుటయేగాక ఎట్టకేలకు తనంత తానుగ పుత్రుని వెంటబెట్టుకొనివచ్చి ధర్మసమ్మతముగ ప్రార్థించుచున్న యామెను నిరాకరించుటయేగాక నీచోక్తులు పలుకుచున్నవాడు తాను! ఇంతకంటె దుర్మార్గత యేముండును? అయితే ఒక్కరహస్యము. ప్రత్యక్షమయిన భరతుని శకుంతలను నిరాకరించుటయందుకంటె ఆమెను తోడ్కొనివచ్చు నిమిత్తమయి చతురంగసేనపంపక ఉపేక్షించుటలోనే ఎక్కుడు దోషము గనవచ్చుచున్నది. నిరాకరించుటలోగల పరమార్థము నాతడు వ్యక్తీకరించినవెనుక అదివర కాతనిపైయునున్న కోపములో కొంతభాగమైన మనకు తగ్గుచున్నది.

> అహమ ప్యేవమే వైనం జానామి స్వయ మాత్మజమ్॥
> యు ద్యహం వచనా దేవ గృహ్ణీయామి మమాత్మజమ్
> భవేద్ధి శంకా లోకస్య నైవం శుద్ధో భవే దయమ్॥

శకుంతలాపుత్రుని తనయనంతరము రాజుగా జేయవలసియున్నదిగదా! అందుచే తాను జీవించియున్నంతకాలము ఒకవేళ తనమాటను గొట్టి వేయలేక భరతుని యువరాజుగ నంగీకరించినను ఆతని జన్మశుద్ధిని గూర్చి శంకించుచున్న ప్రజలు దుష్యంతుని యనంతరమైనను భరతుని పదభ్రష్టుని జేయుట కవకాశ మేర్పడుచున్నదిగదా! అందుచే నీఘట్టమున దుష్యంతుని వర్తనమునకు గాంభీర్య మాపాదించియో మరియొక తీరుననో సమర్థింపవచ్చు ననుకొనుడు. కాని మున్ముందే శకుంతలయుపదేశ మనుసరించి కణ్వుడువచ్చువరకు నాగి ఆతని యనుమతివడసి శకుంతలను వివాహమాడినచో నీ బాధలన్నియు లేకపోయెడివి గదా! మొదట వేగిరపడినతప్పు—తరువాత యుపేక్షించినతప్పు—అటుతరువాత నిరాకరించినతప్పు—మూలమున పూర్ణముగ రాజుతలపై నిలచినది

దుష్యంతుని దోషిగ నిర్ణయించినంతమాత్రమున మూలమునందలి పాత్రీకరణము దోషభూయిష్ఠ మనుటకు వలనుపడదు. చిత్రించినపాత్రము సహజముగ నున్నదా లేదా యనునదే ప్రశ్నముగాని దానిలో నేమాత్రము దోషస్పర్శమే పనికిరాదనుట సిద్ధాంతము కాజాలదు. ఎప్పటికప్పుడు దుష్యంతుని వర్తనము స్వాభావికముగ గనవచ్చుచున్నదిగాని అస్వాభావికముగ లేదు. దుష్యంతుని వర్తనమునందలి స్వాభావికతను నిరూపించుకొనుచు ఉపాఖ్యానకారుడుకూడ ఎప్పటికప్పుడు సమాధాన మిచ్చుచునే వచ్చినాడు కాని మూలకీభావము వహింప లేదు దుష్యంతుడు మరల శకుంతలకు కబురైన పంపకుండుటకుగల కారణము

> మనసా చింతయన్ ప్రాయా త్కాశ్యసంప్రతి పార్థివః
> భగవాన్ స్తపసా యుక్తః శ్రుత్వా కిన్ను కరిష్యతి॥

అనుభయమే యని స్పష్టముగ వ్రాయబడినది. దుష్యంతునివలె వర్తించుపాత్రములు లోకమున నెన్నో గనవచ్చుచున్నప్పుడు ఏ మెట్టున కామెట్టు ఆ పాత్రమునందలి స్వాభావికతను నిరూపింపజాలిన

సమాధానము కవి తన కావ్యమున నిక్షేపించుచు వచ్చినపుడు ఇక నా పాత్రీకరణమునుగూర్చి తప్పుపట్టుట కవకాశ మెక్కడ నున్నది?

"ఉత్తమకావ్యమున నాయకపాత్రము స్వాభావికముగ నున్నదన్నంత మాత్రమున చాలదుగదా? అది ఉదాత్తముగ కూడ నుండవలెనుగదా! మూలములో దుష్యంతుని వర్తనము ధీరోదాత్తముగ లేదు. అందుచే కాళిదాసు దానిని సమర్థింపవలసి వచ్చినది" అని యొక వాదమున్నది కాని సూక్ష్మముగ పరీక్షించినచో ఈ వాదమునందు కూడ సారమున్నట్లు తోచదు అసలు నాయకులను ధీరోదాత్తులని, ధీరలలితులని, ధీరశాంతులని విభజించుటలో నేమైన విశేష మున్నదా యని యొక ప్రశ్న. అయితే ఆ ప్రశ్నమునకు మనమిక్కడ సమాధానము జెప్పనక్కరలేదు కాళిదాసు పూర్వలాక్షణికుల ననుసరించి పోయినాడు గావున పూర్వలాక్షణికుల నాటకమునకు ధీరోదాత్తుడే ఉత్తమనాయకుడని యంగీకరింతము. ఆ పక్షమునగూడ మూలమున చిత్రితమగు పాత్రమునకు ధీరోదాత్తలక్షణములు కొరవడియున్నవా యనునది ప్రశ్న.

భాండార్కర్ ఇన్స్టిట్యూటువారు నిర్ణయించిన పాఠముప్రకారము ఈ శకుంతలోపాఖ్యానము ఆదిపర్వమున నెనిమిది యధ్యాయములుగ నున్నది. (62 మొదలు 70 వరకు) ఇందు మొదటి యధ్యాయమంతయు దుష్యంతుని గుణవర్ణనకే వినియోగపడినది ఈ యధ్యాయమును చూచినచో ఆతని ప్రజాపాలనసామర్థ్యము, ధర్మనిరతి, పరాక్రమము మున్నగు ఉత్తమగుణము లెన్నియో ప్రత్యక్ష మగుచున్నవి. ఎటువచ్చినను శకుంతలను వివాహమాడుట మొదలుకొని అతనిలో దోషము పొడకట్టుచున్నది. ఎక్కడను ఏదోషము లేకుండుటయే ధీరోదాత్తలక్షణమా? ఎట్టి ఉత్తమపురుషునికైనను ఒక్కొక్కచో ప్రమాదము రాకూడదా? అంతమాత్రమున ఆతని మాహాత్మ్యమునకు భంగము రావలసిన దేనా?

భారతపాత్రీకరణము నందున్న విశేషమేయిది. ప్రకృతిని యదా

తథముగ చిత్రించుటలో భారతకారుని కందిన కవి మరియొకడుండడు శకుంతలోపాఖ్యానము ప్రక్షిప్తమే యని యంగీకరించినను ఇందలి పాత్రీకరణము భారతపాత్రీకరణమునకు అనుగుణముగనే యున్నది ప్రకృతిలోవలెనే కావ్యమునందుగూడ ఎట్టి ఉత్తమపురుషు నందైనను గుణదోషములు రెండును సమ్మిశ్రితములైనట్లు ప్రదర్శించుటయే భారతకారుని యభిమతము భారతమున ఉత్తమపాత్రము లనదగిన యుధిష్ఠిరాదులయందుగూడ గుణదోషము లెట్లు మిశ్రితములయినదియు సహృదయు లెరుగకపోరు. అంతమాత్రమున వారి ధీరోదాత్తతకు భంగము వచ్చుచుండుటలేదు మీదుమిక్కిలి దోషనిరూపణము వలన నాపాత్రములు స్వాభావికములయి సజీవములయి మన హృదయముల నాకర్షింపజాలి యున్నవి పరిపూర్ణత యనునది సూర్యమండలమువలె మానవమాత్రులకు దుర్నిరీక్ష్యము. గుణదోష మిశ్రితమగు ప్రకృతి చంద్రమండలమువలె సర్వజనులకు ఆహ్లాదదాయిని.

ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోః కిరణేష్వివాంకః॥

అని కవికులగురువే చెప్పియున్నాడుగదా! పైగ గుణదోషమిశ్రణము సత్యబద్ధముకావున కళాపోషకము సత్యసమ్మతముకాని కళ నిస్సారము. అట్టికళ నవలంబించినకావ్యమునందలి పాత్రములన్నియు నమూనా పాత్రములయిపోయి నిజమయిన ఆనందము నీయజాలవు

ఇంకొక విశేషము ప్రకృతము విమర్శనీయమగు దుష్యంత పాత్రమునందలి దోషము అతని వైశిష్ట్యమును ప్రస్ఫురింపజేయ జాలి యున్నది. శకుంతలను చూడగనే దుష్యంతుడు మోహించినాడనగనే ఆతడు దుష్యంతుడు కావుననే మోహించినాడు. మరియొక రాజమాత్రుడయినచో ఆమెను మోహించియుండడు వల్కలములు ధరించి ఋషి పల్లెలోనున్న కన్యను అందును నిరుపేదరాలిని ఏ రాజంగీకరించును?

తాం చ దృష్ట్వా వరారోహాం శ్రీమతీం చారుహాసినీమ్
విభ్రాజమానాం వపుషా తపసా చ దమేన చ॥

తపస్సువలనను దమమువలనను సిద్ధించిన తేజమును గుర్తించుటకు దాని
వలన ఆకర్షింపబడుటకు ఒక విశిష్టమయిన మనస్తత్త్వము కావలసి
యున్నది తపోధనయందున్న మహిమను దుష్యంతుడు గావుననే
గ్రహింపగలిగినాడు గ్రహించుటయే కాదు గ్రహించినవెంటనే గాఢ
ముగ వరించినాడు కణ్వుడు వచ్చువరకైన నాతడు వేచియుండలేక
పోయినాడు కణ్వుడు తిరవచ్చి ఔనననో కాదననో ఎట్లయినను ఆమెను
పెండ్లియాడి తీరవలెను గాని ఇక కాదనిపించుకొనుట కిష్టము లేకపోయి
నది అందుచే నీ ఘట్టమునందు దుష్యంతునియందు దోషముగ గన
వచ్చు వేగిరపాటునకు అతని గుణగ్రాహిత్వమే మూలముగ నున్నది
తొందరపడినను శకుంతలను ధర్మమార్గముననే నడిపించి ధర్మసమ్మతము
గనే వివాహమాడినాడు కాని మరియొక తప్పుతోవ తొక్కలేదు
కాని తీర సంకల్పము నెరవేరినవెనుక మాత్రము భయము పైకొన్నది.
"అయ్యో ఈకన్యను కణ్వుని అనుమతిలేకుండ వివాహమాడితినే దీని
కాతడు కోపించునేమో" అని వడకజొచ్చెను. ఈ భయముగూడ
దుష్యంతుని వైశిష్ట్యమునే ప్రతిపాదించుచున్నది ఋషులయందు
అత్యంత భక్తియు వారి మాహాత్మ్యమునందు అత్యంత విశ్వాసమును
కలవాడు గావుననే అతనికీ భయము పొడచూపినది. అటు నమ్మించిన
ధర్మపత్ని కేకబురు చెప్పక మిన్నకుంట యను సంకోచము ఇటు ఋషిని
సందర్శించుటకు ధైర్యముచాలక వెనుకంజవేయుట—ఈ సంకటములో
బడి యాతని మనస్సురియాడుచున్నది ఇంతలో శకుంతల తనంత
తానుగ పుత్రునితో ప్రత్యక్షమైనది మరియొకప్రాకృతుడైనచో ఆమెకు
వెంటనే స్వాగతమిచ్చి స్వీకరించెడివాడు దుష్యంతుని నిరాకరణము
గూడ అతని వైశిష్ట్యమును స్థాపింపజాలి యున్నది ఆమె కుమారునికి
యౌవరాజ్య మిచ్చెదనని ప్రతిజ్ఞచేసినాడుగదా! అందుచే వెంటనే
యామె నంగీకరించినచో ఆ ప్రతిజ్ఞకు మున్ముందు భంగము రావచ్చు
నని — దీర్ఘదర్శిగనుక — అతనికితోచినది. అందుచే నామెయెవ్వతెయో

తా నెరుగనట్లు నటించినాడు ఈ నటించుటలో కొంతదూరముపోయి యాగుటకు వీలిచ్చినది కాదు ఆమె ననరాని మాటలుకూడ ననవలసి వచ్చినది మిక్కిలి పరుషస్వభావమును ప్రకటింపవలసి వచ్చినది

మేనకా నిరనుక్రోశా బంధకీ జననీ తవ
యయా హిమవతః పృష్ఠే నిర్మాల్యేవప్రవేరితా॥

ఈతీరున నొకటిరెండు కాదు పెక్కుమాటలే యన్నాడు మొత్తము మీద స్త్రీలోకమునంతనుకూడ 'అసత్యవచనా నార్యః' అని నిందించినాడు సభలోగదా యీ వృత్తాంతము జరుగుచున్నది "ఎక్కడను ముక్కుమొగమే యెరుగని స్త్రీ వచ్చి బహిరంగముగ సభలో రాజును ధిక్కరించి 'నీవు నన్ను పెండ్లాడితివి. వీడు నీపుత్రుడు' అని ప్రబోధించుట సంభవమా" అని సభ్యులకు తోచవచ్చును అదిగ్రహించుటచే పరుషోక్తినుండి పరుషోక్తికాతడు పరుగెత్తుచున్నాడు చల్లగ కూర్చుండి చదువుకొనుచున్న మనకు 'ఇంతదూరము పోనేల' అని తోచవచ్చును గాని పారుష్యమున కొడంబడినపుడు దానికి మితియుండదు ఆ సన్నివేశమును గాఢముగ ననుసంధించినచో నది యెంత స్వాభావికమో మనకు బోధపడును చూడుడు శ్రీరాముని యంతటివాడు

తదర్థం నిర్జితా మే త్వం యశః ప్రత్యాహృతం మయా
నాస్తి మే త్వయ్యభిష్వఙ్గో యథేష్టం గమ్యతా మితః॥
ఇతి ప్రవ్యాహృతం భద్రే మయైత త్కృతబుద్ధినా
లక్ష్మణే భరతేవా త్వం కురుబుద్ధిం యథాసుఖమ్॥
సుగ్రీవే వానరేన్ద్రేవా రాక్షసేన్ద్రే విభీషణే
నివేశయ మన స్సీతే యథావా సుఖ మాత్మనః॥
(యుద్ధకాం. సర్గ 118. శ్లో. ౨౧-౨౩)

అని సీతతో బలుకుచున్నాడు శ్రీరాముని యంతటివానినోట రాదగిన వాక్యములేనా యివి! శోధింప దలచుకొన్నచో "రావణుడు నీ పాతివ్రత్యమును భంగపరుపకుండ నుండుట యసంభవము. అందుచే నేను నిన్ను నిరాకరించుచున్నాను" అనిచెప్పిన చాలదా? ఈ పరుషవాక్యములుకూడ నెందులకు? అను ప్రశ్నలు రావచ్చును దీనిలోని పరమార్థ

మిది. ఈ సన్నివేశమున ప్రాకృతులకుగూడ సంశయచ్ఛేదము గావింప వలసియున్నదిగదా! అందుచే ప్రాకృతుల యధిక్షేపణలను నీచోక్తులవలె గనవచ్చు పరుషోక్తులను ఉత్తమపురుషులే పలుకుచున్నారు ఇట్టి గంభీరమైన ప్రకృతిరహస్యములను దివ్యచక్షువులతో తిలకించిన మహా కవులు వారిచేనిట్లు పలికింపవలసి వచ్చుచున్నది.

ఈ సన్నివేశము లన్నిటిని యథామూలముగ చిత్రించియుండి నచో కాళిదాసుని దుష్యంతచిత్రణము ఇప్పటికంటె నెన్నియోమడుం గులు ప్రశస్తతరమయి యుండుననుట కెట్టి సందేహమునులేదు మూల ములో దుష్యంతపాత్రము ను ఎప్పటికప్పుడు ఒక ధర్మసంకట మెదు ర్కొనుచున్నది దీనిచే బాధపడుటవలన నాతని పాత్ర ముత్తరోత్తర ముగ పరిణమించుచున్నది స్వభావమున కత్యంత సన్నిహితమయి సర్వ సమ్మతమయి ప్రకాశించుచున్నది శాపవృత్తాంతమును దెచ్చిపెట్టుట వలన కాళిదాసుని నాయకుడు క్లోరోఫారము పుచ్చుకొన్న రోగివలె స్మృతితప్పి పడిపోవుచున్నాడు పాత్రపరిణామమున కున్న చక్కని యవకాశములను పూర్ణముగ విసర్జించినవాడగుచున్నాడు కాళిదాసు. గాఢముగ నాలోచించినచో ఇంతకు పోషింపదలచుకొన్న యుదాత్తత గూడ పరిపోషణము నందకున్నది కణ్వునియంతటి మహర్షి యెవ్వతెనో దారినిబోయెడిదానిని దీసికొనివచ్చి శిష్యులను జతయిచ్చి "ఈమె నీ భార్య, స్వీకరింప వలసినది" అని యాజ్ఞాపించు ననుకొనుటలో దుష్యం తుని యుదాత్తతకు భంగము వచ్చుటలేదా? అది యొకటి—అంగు ళీయకదర్శనమున స్మృతివచ్చిన వెనుకనయిన విరహావిలాపములతో పొద్దుపుచ్చుచున్నాడే గాని "అయ్యో ధర్మపత్నిగదా. నెలలునిండిన మూలాలు. ఆమెగతి యేమైనది" అని అన్వేషణప్రయత్న మేమియు చేయకుండ నున్నాడే?- ఇట శకుంతలాప్రత్యాదేశమును విని కణ్వు డూరకున్నాడా? ఊరకున్నచో ఊరకుండుటలో నుచితజ్ఞత యేమున్నది? కాళిదాసుని దుష్యంతచిత్రణము నుండి ఇట్టి ప్రశ్నలెన్నియో బయలు

వెడలుచున్నవి. ఏవో యుక్తులను సమాధానములుగ స్వీకరింపవచ్చును గాని గాఢముగ పరిశీలించినచో మూలానుసరణ మొనర్చియుండినచో ఈచిత్రణ మిప్పటికంటె శోభ వహించియుండెడిది

ఇక శకుంతలాపాత్రమును గైకొందము దుష్యంత పాత్రచిత్రణమును సూక్ష్మముగ విచారించిననేగాని నాటకమునకును మూలమునకును తారతమ్యము గోచరింపక పోవచ్చును. కాని శకుంతలాపాత్ర చిత్రణ యట్టిదికాదు. కాళిదాసుశకుంతలకును మూలమునందలి శకుంతలకును గల వ్యత్యాసము స్థూలదృష్టికిగూడ విస్పష్టముగ గోచరించుచున్నది. మూలమునందలి శకుంతలామూర్తి మహోజ్జ్వలమైనది. ఆమె ధర్మస్వరూపిణి. దమస్వరూపిణి. పురాణయుగమున స్త్రీకెట్టి స్వాతంత్ర్యముండెడిది—ఎట్టి గౌరవముండెడిది—దానిలో ప్రత్యక్ష మగుచున్నది నాటకములోని శకుంతల కాళిదాసు కాలమునాటి సంస్కృతిని దాటలేక యవస్థపడుచున్న సుకుమారస్వరూపిణి ఆమె చిత్రణమునందు ఎట్టి లాలిత్యము ప్రత్యక్షమగుచున్నను అది మూలమున శకుంతలా మాహాత్మ్యమునకు చేతులు జోడించుకొని నమస్కరింపవలసినదే. నాటకమునందలి నాయిక "భగవతి వసుధే దేహి మే వివరం" అని ఆపదలకు సాష్టాంగపడుచుండగ ఉపాఖ్యానమునందలి శకుంతల అధర్మమునకు ఖుజనించిన యాగ్రహముచే పంచభూతములను గడగడ వడకించి దైవముచే సైతము సాక్ష్య మిప్పించుకొనగలుగుచున్నది.

మూలములో దోషమంతయు దుష్యంతునిమీద మోపియుండగ నాటకములో నది శకుంతలమీద నారోపితమైనది "దైవ మస్యాః ప్రతికూలం శమయితుం" అనుటలో నిది మున్ముందు సూచితమైనది దుర్వాసుడు వచ్చినపుడు సాధారణముగ తాపసకన్యలకు నియుక్తమగు అతిథిసత్కార ధర్మమును మఱచిపోయి శకుంతల యలక్ష్యము చేసినది. ఈ యలక్ష్యముచేయుట తప్పుగదా! అందుచే యీయామె తప్పువలననే శాపము ప్రాప్తించి దుష్యంతుడు ఈమెను మరచిపోవుట తటస్థించినది.

తప్పంతయు తనదేయని "విరహశూన్య హృదయయా" అనుటలో శకుంతలచేతనే యొప్పించి దుష్యంతుడు నిర్దోషియని కూడ "అకారణ పరిత్యాగదేశీ నార్యపుత్రః" అను శకుంతలా వాక్యమువలననే నిరూపించు కొని వచ్చినాడు. మూలమునందున్న యుదంతము నిట్లు వ్యత్యస్తము చేయుటచే కాళిదాసు సాధింపదలచుకొన్న పరమార్థ మేమో!

ఇంతేకాదు గాంధర్వవివాహము కేవలము దోషరహితమని అంగీకరించుట కాతని మనస్సొప్పినది కాదు

గాంధర్వేణ వివాహేన బహ్వ్యో రాజర్షికన్యకాః
శ్రూయన్తే పరిణీతా స్తాః పితృభి శ్చాభినందితాః॥

అని యొకవంక ననుచున్నను "దిష్ట్యా ధూమవరుద్ధ దృష్టే రపి" అని కణ్వునిచే పలికించుటలోను

"ఆర్య! కిమపి వక్తు కామాస్మి ఖలు మే వచ నావకా శో స్తి కథమివ
నాపేక్షితో గురుజన స్త్వయానయా న పృష్టా బన్ధవః
ఏకైక మేవ చరితే భణామి కిమేకైకస్య"

అని గౌతమిచే పలికించుటలోను

ఇత్థ మాత్మకృతం చాపల మాత్మానం దహతి

అని కణ్వశిష్యులచే పలికించుటలోను ఈ గాంధర్వవివాహమునుగూర్చి నిరసనసూచకమగు ధ్వని లేకపోలేదు. కాని మూలములోమాత్ర మిట్లు గాక

విజ్ఞాయాథ తాం కణ్వో దివ్యజ్ఞానో మహాతపాః
ఉవాచ భగవాన్ ప్రీతః పశ్యన్ దివ్యేనచక్షుషా॥

త్వ యాద్య రాజాన్వయయా మామనాదృత్య యత్కృతః
పుంసా సహాస మాయోగో న స ధర్మోపఘాతకః॥

క్షత్రియస్యహి గాంధర్వో వివాహః శ్రేష్ఠ ఉచ్యతే
సకామాయా సకామేన నిర్మంత్రో రహసి స్మృతః॥

అని కులపతిశేఖరుడగు కణ్వుడు యీ వివాహముపై యేమాత్రము వెనుకంజవేయని యంగీకారముద్ర వేయుచున్నాడు. మూలములో దుష్యంతుడు కొలువుదీర్చియుండగా పుత్రసహితముగ శకుంతల సభా

మందిరమునే ప్రవేశించినది. నాటకములో నట్లుగాక దుష్యంతుని యగ్న్యగారమున శకుంతలాదుష్యంతుల ద్వితీయసమావేశము నడచినది. ఋషులకుదర్శనమిచ్చుటలో అగ్న్యగార మువితముగ నుండునని యెంచి కాళిదాసు అట్లు చేసినాడని సమర్థింపవచ్చునుగాని సభామందిరముననే హారివాదము నడచినచో కథ కెక్కుడు ప్రయోజనకారి గదా! దాని నటుంచగా శకుంతల నవగుంఠనవతిగ నేలచేయవలెనో బోధపడుట లేదు. స్త్రీలు సభాప్రవేశమే చేయరాదనియు బయటికే రాగూడదనియు వచ్చినను ముఖమున కాచ్ఛాదనముతోగాని రాగూడదనియు కాళిదాసుని కాలమునాటికి మర్యాద లేర్పడియుండవలెను. ఈ మర్యాదల నతిక్రమింపజాలక అనగా తనకాలమునాటి సంస్కృతిని దాటలేక కాళిదాసు శకుంతల నవగుంఠనవతిగ నొనర్చెనని నిశ్చయింపదగి యున్నది

తదేషా భవతః కాన్తా త్యజ వైనాం గృహాణ వా
ఉపపన్నా హి దారేషు ప్రభుతా సర్వతో ముఖీ॥

అనుభావముకూడ స్త్రీ స్వాతంత్ర్యము క్షీణించుచున్న యుగమునకు చెందదగి యున్నదికాని పురాణయుగమునకును ముఖ్యముగ మూలము నందలి శకుంతలోపాఖ్యానమునందు ప్రతిపాదితమైన స్త్రీగౌరవ యుగమునకు సరిపడినది కాదు

శకుంతలశీలమును మహోజ్జ్వలముగ ప్రకాశింపజేయు మూడు ఘట్టములలోను మూలముకంటె నాటకము ఎన్నియోవిధముల వన్నెదరిగి యున్నది. (1) వివాహఘట్టము (2) వరప్రదానఘట్టము (3) వివాదఘట్టము అని పేర్కొనదగిన మూడుఘట్టములను ప్రత్యేకముగా గైకొని కొంత సూక్ష్మముగ విమర్శింతము

వివాహఘట్టము కణ్వాశ్రమమున శకుంతలాదుష్యంతుల గాంధర్వవివాహమును వర్ణించుచున్నది. ఈ సందర్భమున నాటకమున మూడవ

సమావేశములలోగాని వివాహము పూర్తికాలేదు. అట్లుగాక మూలములో నున్నట్లుగ ఒక్క సమావేశములోనే వివాహము పూర్తియైనట్లున్నచో గాంధర్వవివాహము యథోచితముగ నుండి యుండును. వధూవరులమధ్య అనంగలేఖాదు లాయభారములు మున్నగు నాగరకప్రయోగములకు అవకాశము కావలసి కాళిదాసట్లు చేసినాడు అంతగ నలువురకు వెల్లడియైన వెనుక వివాదఘట్టమున కవకాశమే లేదేమో సన్నివేశమునకు సంబంధించిన యౌచిత్యము నటుంచగ శీలవిచారణములో ఈ ఘట్టమున నొక పరమార్థ మేర్పడుచున్నది శకుంతలయెడల ననురాగములో రాజు ఉద్రిక్తుడయినటులును శకుంతల మొదటినుండి తుదివరకు నిగ్రహము చూపినటులును మూలములో నున్నది. ఇది ఆమె పొందిన ఆశ్రమశిక్షణమున కెంతయు ఉచితముగ నున్నది

> రాజా—(శకుంతలాభిముఖో భూత్వా) అపి నామ తపో వర్ధతే?
> శకుంతలా—(సాధ్వసా దవచనా తిష్ఠతి)

అని నాటకములోనున్న చిత్రణమును

> శూన్యం దృష్ట్వా త మాశ్రమమ్
> ఉవాచ క ఇహే త్యుచ్చై ర్వనం సంనాదయ న్నివ॥
> శ్రుత్వాథ తస్య తం శబ్దం కన్యా శ్రీరివ రూపిణీ
> నిశ్చక్రా మాశ్రమా త్తస్మా త్తాపసీవేషధారిణీ॥
> సా తం దృష్ట్వా రాజానం దుష్యంత మసితేక్షణా
> స్వాగతం త క్షిప్ర మువాచ ప్రతిపూజ్యత
> ఆసనే నార్చయిత్వా చ పాద్యేనార్ఘ్యేణ చైవహి
> ప్రపచ్ఛానామయం రాజన్ కుశలంచ నరాధిపమ్
> ఉవాచ స్మయమానేవ కిం కార్యం క్రియతామితి

అని మూలములోనున్న చిత్రణముతో సరిపోల్చినపుడు శకుంతల పవిత్రయు హృదయనైర్మల్యమును మనకు మూలములో ప్రత్యక్షమగునట్లు నాటకములో ప్రత్యక్షమగుటలేదు నాటకములో రాజు ప్రశ్నించుసరికే ఆమెహృదయమున తపోవనవిరోధములగు భావము లుదయించి

నవి. అందుచే మాటలేకుండ బోయినది మూలములో నట్లుగాక ఆశ్ర మోచితమగు సరళస్వభావముతో నామె యతిథిసత్కారమును జరపుచు ధారాళముగ మాటలాడుచున్నది తన్ను వివాహమాడవలసినదిగ రాజు ప్రార్థించినపుడు ఆమె యిచ్చిన సమాధానముగూడ అనేక విధముల నాస్వాదనయోగ్యముగ నున్నది

ఫలాహారో గతో రాజన్ పితా మే ఇత ఆశ్రమాత్
తం ముహూర్తం పరీక్షస్వ సమాం తుభ్యం ప్రదాస్యతి॥

దీనికి నన్నయభట్టారకులు

కం॥ కరుణాపరతులు ధర్మ! స్వరూపు లింతకు మదీయజనకులు నరుదెం
తురు, వారు వచ్చి నీ కి! చ్చిరేని పాణిగ్రహణము సేయుము నన్నున్॥

అని యెంతో మనోహరముగ భాషాంతరీకరణ మొనర్చి యున్నారు. దుష్యంతుని గంభీరాకృతిని జూచి శకుంతల యాతని వివాహమాడుట కిష్టపడుచున్నది. అంతేకాదు కణ్వునకుకూడ ఉచితజ్ఞుడుగావున అట్టి సర్వ లక్షణసంపన్నుడగువరునకు తప్పక తన్నిచ్చితీరుదురను విశ్వాసమామె కున్నది. "ఇచ్చిరేని" యని సందేహసూచకము కూడ లేకుండ మూలము ప్రకాశించు చున్నది. ఈ ఘట్టమున విశేష మేమనగ శకుంతల సూటిగ మాటాడుచున్నది నాటకములోని వంకిరటింకరదారులు ఇందులో లేవు ఇది ఆమె శీలమున కెంతయు నుత్తేజకరము దుష్యంతునిచే సమయము చేయించుకొనుటలోకూడ నంతే తన కుమారుడు చక్రవర్తి కావలెనను ఆశయము ఆమెకున్నది. అందుచే దాని నామె ప్రత్యక్షముగ నడిగివైచినది దుష్యంతుడుచేయు ప్రతిజ్ఞకు సాక్ష్యము కావలెననికూడ ఆమెకు తోచకపోవుటయందు దామెకున్న దైవవిశ్వాసమును అంతకంటెను ఎక్కుడుగ ధర్మమునందును తనయందును ఆమెకున్న విశ్వాసమును ప్రజ్వలించుచున్నవి. అదిగాక అంతవరకు కణ్వాశ్రమమున బెరుగుటచే నాడితప్పినవారి నామె చూచియే యుండదు.

రెండవదియగు వరదానఘట్టమున (కణ్వు డింటికివచ్చి ఆమెకు

వరమిచ్చిన ఘట్టమున) కూడ ధర్మముపట్ల ఆమెకుగల భక్తియే సువ్యక్తమగుచున్నది.

> తతో ధర్మిష్ఠతాం వవ్రే రాజ్యా చ్చాస్ఖలనం తథా
> శకుంతలా పౌరవాణాం దుష్యంతే హితకామ్యయా॥

ఇక మూడవదియగు వివాద ఘట్టమునకు వత్తము. ఈ ఘట్టమున మూలమునకును నాటకమునకును ఎక్కడను పోలికలేదు. శకుంతలా దుష్యంతుల చరిత్రమునకు ప్రాణప్రదమైన ఘట్టమిదియే. "ఎవ్వరును సాక్ష్యము లేరుగదాయని అబద్ధమాడ జూచుట ఆత్మవంచనము. సర్వసాక్షియగు దైవము నెవ్వరును వంచింపజాలరు" అనుటయే శకుంతలోపాఖ్యానమునకు పరమార్థము. కాని కాళిదాసుని ఉపజ్ఞ యీఘట్టమున మారుతోవ త్రొక్కినది. "నీ వెవ్వతెవో నే నెరుగను పొ" మ్మని రాజు పలికినపుడు కాళిదాసునిశకుంతల ఇటీవలికాలపు స్త్రీవలె నోటికి తాళమువైచుకొని కాలికి బుద్ధిచెప్పుచున్నది. కాని మూలమున నట్లున్నదా? మున్ముందు

> సైవ ముక్తా వరారోహా హ్రీడితేవ మనస్వినీ
> విసంజ్ఞేవ చ దుఃఖేన తస్థౌ స్థాణురి వాచలా॥

అను శ్లోకములో స్త్రీజనసహజమగు మార్దవము పరిపూర్ణముగ పోషితమైనది. దుష్యంతునివంటి ఉత్తమపురుషు డట్లుచేయునని ఆమె కలనైన ననుకొనలేదు. అందుచే ముహూర్తమాత్రము నిర్విణ్ణురాలయిపోయినది. కాని సహజధీరయగు నామె కింతలో నాత్మవిశ్వాస మందుకొన్నది.

> సంరంభామర్షతామ్రాక్షీ స్ఫురమాణోష్ఠసంపుటా
> కటాక్షై ర్నిర్దహ న్తీవ తిర్యగ్రాజాన మైక్షత॥
> ఆకారం గూహమానా చ మన్యునాభిసమీరితా
> తపసా సంభృతం తేజో ధారయామాసవై తదా॥

ఆహా! యేమి యీ దివ్యమూర్తి! ఈ సందర్భమున జరిగిన ధర్మోపన్యాసము వేదముతో తుల్యమైనది. భారతమునకు బంచమవేదమను

ప్రశస్తి యిట్టి ఘట్టములవలననే లభించినది. దుష్యంతుడీ ఘట్టమున సత్యమును భార్యను పుత్రుని పరిత్యజించుట కుద్యుక్తుడైనట్లు గోచరింప గనే యీ మూడిటికిని గల పరస్పరసంబంధమును మానవజీవితమున వీని ప్రాముఖ్యమును విశదమగునట్లుగ నామె యొసర్చిన ప్రబోధము ఋషులకుగూడ గౌరవము సంపాదింప దగియున్నది ధర్మోపన్యాస మనగనే అసంబద్ధమగు శుష్కవేదాంతమున కిందు ప్రసక్తి యున్న దేమోయని భ్రమింపరాదు ఎక్కడికక్కడ సూటిగ మాటాడు చున్నది. దుష్యంతుని ధార్మిక దేహమునకు శస్త్రచికిత్స చేసి విడిచిపెట్టి నది ఎత్తుకొనుటలోనే

జానన్నపి మహారాజ కస్మాదేవం ప్రభాషసే
అత్రతే హృదయం వేద సత్యస్యై వానృతస్యచ॥

అని గద్దించి పలుకుచున్నది. "దీనివలన నీవు లోకమును వంచించు చున్నాననుకొను చున్నావు కాబోలును నిన్ను నీవే వంచించుకొను చున్నావుసుమీ" అనువిషయము తరువాతివాక్యములలో నెంత చక్కగ విశదీకరించినది

ఏకో హమ స్మీతి చ మన్యసే త్వం న హృచ్ఛయం వేత్సి మునింపురాణం
యో వేదితా కర్మణః పాపకస్య య స్యాన్తికే త్వం వృజినం కరోషి॥

కులపతియగు కణ్వునివలన ధర్మశిక్షణము నందుకొన్న యీమెనోట నీ యుపన్యాస మెంత యభ్యుచితముగ నున్నది ఆమె యాత్మగౌరవమును ప్రత్యక్షపరచు నీక్రింది వాక్యములను దిలకింపుడు.

స్వయంప్రాప్తేతి మా మేవం మావమంస్థాః పతివ్రతామ్
అర్ఘ్యార్హాం నార్చయసి మాం స్వయం భార్యా ముపస్థితామ్॥

దుష్యంతు డామెను అతినీచముగ నిందించినాడు. కాని అంతమాత్ర ముచే నామె వెనుకంజ వేయలేదు. అతని నీచోక్తులను వడ్డీతో తీర్చి వేయుటయేగాక తనకు బాకీపడునట్లు చేసికొన్నది అయితే మరల

నిదర్శనార్థం సర్వేషా త్వమ్ఛ్రిత్వా క్షంతు మర్హసి

అని యుదాత్తతను గాపాడుకొను చున్నది

ఇంత తేజముతో నలరారుచున్నదిగదా యని మూలములోని మూర్తికి మాధుర్యము లుప్తమయ్యెనని భావింపరాదు. మూలములో మాధుర్యస్ఫురణము నాటకములోనిగీటును మించుచున్నది తన పూర్వ వృత్తాంతకథనమును ముగించుచు

కణ్వం హి పితరం మన్యే పితరం స్వ న జానతీం

అని పలికినపుడు మానవస్వభావమున కత్యంత సహజమగు లలితవిషాదముతో మనహృదయమును ఆమె చూరగొనుచున్నది గాంధర్వ వివాహ మైనవెనుక ఇంటికివచ్చిన తండ్రికి యథాపూర్వముగ స్వాగత మీయ లేకపోయినది

శకుంతలా చ పితరం హ్రియా నోపజగామ తం

ఈ రేఖకూడ ఎంతో హృదయంగమ మైనదే దుష్యంతునిపై నగ్నివర్షము కురియుంచు నప్పుడైన స్త్రీజనోచితమగు లాలిత్య మామెను విడిచినదిగాదు

కింను కర్మాశుభం పూర్వం కృతవ త్యస్మిజన్మని

యదహం బాంధవై స్త్యక్తా బాల్యే సంప్రతి చ త్వయా॥

అను నామె గాఢవిషాదమునకు సంకటసన్నివేశమునకు కన్నీళ్లు విడువని మానవహృదయ ముండునా?

ఇట్లు మూలములోనిమూర్తి మొదటినుండి తుదివరకు పవిత్రధర్మానురక్తి, ఆత్మవిశ్వాసము, ఆత్మతేజము మున్నగు నపురూపగుణముల కాశ్రయమయి యలరారుచున్నది నాటకములోగూడ పవిత్రత ప్రతిపాదితము కాకపోలేదుకాని పవిత్రతకంటె మాదుర్యము లాలిత్యము పెంపొందినవి. ప్రతిపాదితమైనవరకైన పవిత్రత మూలములో నున్నదానిలో శతాంశమైనను లేదు. ఎవ్వరును సాక్ష్యములేని యసహాయవలె గనవచ్చు శకుంతల తన యాత్మవిశ్వాసమును విజృంబింపజేసి యశరీరవాణిచే సాక్ష్యమిప్పించుకొని జయభేరి మ్రోగించుటలోనే ఆమె యద్వితీయమాహాత్మ్యము గోచరించుచున్నది ఈ మాహాత్మ్యమును లుప్తమొనరించి లాలిత్యము నెంత పెంపొందించినను కాళిదా

సుని శకుంతలాపాత్ర చిత్రణము—మూలముతో పోల్చిచూచినపుడు—వెలవెల పోవుచున్నదని నిర్ణయింపక తప్పదు

ప్రతికావ్యమునకును ప్రత్యేకమైన వాతావరణమొకటి యేర్పడుచుండును. ఈ వాతావరణము తరచు కావ్యమునందు సంచరించు భావములనుబట్టి యుండును కావ్యములు పర్వతములవలె ఔన్నత్య మెక్కుడైనకొలది వాతావరణము చల్లనగుటచే సుఖావహములయి యుండును కావ్యమున సంచరించు భావములు ఉన్నతములగుటయేగాక స్వానుభవసిద్ధములుకూడ గావలయును అప్పుడుగాని దానికి సహజమును సాంద్రమును అగు చైతన్యసంపద యేర్పడదు భగవద్గీతలోని భావముల నాస్వాదించునపుడు మన మన స్సు త్తమభూములలో సంచరించునుగదా! ఆ భావములనే అనుభవముచాలని వేరొకకవి యనువదించు ననుకొనుడు. ఈ యనువాదమునకును మూలమునకును చైతన్య సంపదలో విశేషతారతమ్య మేర్పడదా? మూలము మనహృదయము సంచలింప జేయగలిగి నంతగ ఆత్మదర్శనము లేని కవిచేసిన యనువాదము సంచలింప జేయగలదా?

కాళిదాసు శాకుంతలమునందు సంచరింపజేసిన భావములన్నియు బహుసుకుమారమైనవి మధురమైనవి మనోహరమైనవి అనుట కెంతమాత్రమును సందేహము లేదు శాకుంతలమును ప్రత్యేకముగ చదువుచున్నపుడుగాని లేక యితరనాటకములతో బోల్చి చదువుచున్నపుడుగాని దాని భావమాధుర్యము మిక్కిలి ప్రశంసనీయమే యగుచున్నది. కాని మూలముతో సరిపోల్చి చూచినపుడుమాత్రము ఔన్నత్యమును బట్టి చూచినను చైతన్యసంపదనుబట్టి చూచినను శాకుంతలముకంటె శకుంతలోపాఖ్యానము ఎన్నియో వేల అడుగులు ఎత్తైనదని చెప్పక తప్పదు శాకుంతలము నందున్న భావసంపద యంతటికిని సమున్నతమైన మట్టము (Uniform level) లేకపోలేదు అట్లనే శకుంతలోపాఖ్యానమునందలి భావసంపద కూడ సమున్నతమైన మట్టముతో

(Uniform level) నలరారుచున్నది. కాని యీ రెండింటి పుట్టము లను ఒండొంటితో బోల్చి చూచినపుడు వింధ్యపర్వత శ్రేణికిని హిమవత్పర్వత శ్రేణికిని ఎంత తారతమ్యమున్నదో అంత తారతమ్యమేర్పడు చున్నది

నాటకములో నతిమనోహరముగ గనవచ్చు

> అలక్ష్యదంతముకుళా నవిమిత్తహాసై
> రవ్యక్తవర్ణ రమణీయవచః ప్రవృత్తీన్,
> అంకాశ్రయప్రణయిన స్తనయా న్వహంతో
> ధన్యా స్తదఙ్గరజసా మలినీభవన్తి॥

ఇత్యాదిశ్లోకములకు గూడ

> పరిపత్య యదా సూను ర్ధరణీరేణుగుంఠితః
> పితురాశ్లిష్య తేంఽగాని కిమి వాస్త్యధికం తతః॥

అని మూలములో మాతృకలు లేకపోలేదు. మూలములో నున్న మహోన్నతభావము లెన్నో నాటకములో లుప్తమై పోయినవి. శాకుంతలము చదివినపుడు శకుంతలాదుష్యంతుల వివాహము నందేమి విరహము నందేమి నెలకొన్న మాధుర్యము మనహృదయముల నలరించుచున్నది. కాని శకుంతలోపాఖ్యానములో శకుంతలాదుష్యంతుల ప్రణయమున కంతగ ప్రాముఖ్యము లేనేలేదు. నాటకములో రెండవ యంకములోను మూడవ యంకములోను ప్రదర్శితమైన భావములు మూలమున నొకటి రెండు శ్లోకములలో దేలిపోయినవి. తుదకు వివాహమునకు ప్రత్యేక మొక్క శ్లోకమైన గానరాదు

> జగ్రాహ విధివ త్పాణా వువాస చ తయా సహ

అని శ్లోకములోని యర్ధభాగముతో నంతయు దేల్చివైచినాడు. ఎంత సేపును ఉపాఖ్యానకారుడు సత్యమునకున్న మాహాత్మ్యమును ప్రతి పాదించుటలోనే తనప్రతిభ నంతను వినియోగించినాడు. నిజముగ మూలము చదువుచున్నపుడు వేదవీధులలో విహరించిన ట్లుండును. అట్లని కావ్యరసమునకు భంగమువచ్చి నట్లుగ పడదు.

> అష్టావేవ సమాసేన వివాహా ధర్మతః స్మృతాః
> బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః॥

ఇత్యాది స్థలములలో స్మృతివాసన కొంచెము హెచ్చుగ సోకుచున్నను మొత్తముమీద చూచుకొన్నపుడు రసదృష్టిలోకూడ మూలము మహోత్తమశృంగముల నధిష్ఠించుచున్నది అతీతానుభవజన్యములైన ఇందలి భావములు హిమవత్పర్వతమునుండి యుదయించు నదులవలె త్రిలోకపావనములు.

> యథా హ్యాహవనీయాగ్ని ర్గార్హపత్యా త్ప్రణీయతే
> తథా త్వత్తః ప్రసూతోయమ్ త్వమేకస్స్వ ద్విధాకృతః॥

ఇట్టి అపూర్వములును పరమపవిత్రములునగు భావములకు మూలము గని ముఖ్యముగ స్త్రీకి శకుంతలలో వ్యాఖ్యానకారుడు ప్రతిపాదించిన పూజ్యత మిక్కిలి అహ్లాదదాయకముగ నున్నది

> న సంరబ్ధోపి రామాణాం న బ్రూయా దప్రియం బుధః
> రతిం ప్రీతిం చ ధర్మం చ తా స్వాయత్త మవేక్ష్యచ॥
> ఆత్మ నైవ జనితః పుత్రః ఇత్యుచ్యతే బుధైః
> తస్మా ద్భార్యా నరః పశ్యే న్మాతృవ త్పుత్రమాతరం॥
> భార్యాం పతి స్సంప్రవిశ్య స యస్మా జ్జాయతే పునః
> జాయాయా ఇతి జాయాత్వం పురాణాః కవయో విదుః॥

ఈ దృక్పథమునందు ఎంత మాహాత్మ్యమున్నదో అంత యాథార్థ్యము మాధుర్యముకూడ నేర్పడుచున్నవి. ఈ ఘట్టములలో శాస్త్రార్థము కావ్యార్థము చేయిచేయి కలుపుకొని నృత్యక్రీడ సల్పుచున్నవి. మూలము చదువుచున్నపుడు ఏదో ఒక అపూర్వజ్యోతి మనకనులకు ప్రత్యక్షమయినట్టులయి మానవజీవితమునందలి పరమార్థము మన హృదయానుసంధానమున కందుచున్నది. స్త్రీపురుషుల యన్యోన్యసంబంధమును పుత్రసంతతికిగల ప్రాముఖ్యమును ఇంత చక్కగ ప్రతిబింబించు నువ్యాఖ్యానమింకొకటి గానరాదు. కాళిదాసు మూలముకంటె భిన్నముగ నెన్నియో పోకల బోయి దాని కపూర్వరామణీయకమును సంపాదింప జూచినా

డనుటలో సందేహము లేదుగాని సూక్ష్మముగ నాలోచించినచో దాని మాహాత్మ్యము సంతను ప్రత్యక్షీకరింప లేకపోయినాడనియే చెప్పవలసి వచ్చుచున్నది. మూలమును యథేచ్ఛగా సంస్కరించుకొనుటకు నాటక కర్తకు స్వాతంత్ర్యమున్నను ఆ స్వాతంత్ర్యము మూలముకంటె మహోన్నతపదములకు బోయినపుడే మిక్కిలి శోభించును

Style అను నింగ్లీషుపదమునకు అనువాదముగ ఇప్పటి విమర్శకులు "శైలి" అనుపదమును వాడుచున్నారు. కాని పూర్వాలంకారికులు వాడిన "శయ్య" అనుపదమే అభ్యుచితముగ గనవచ్చుచున్నది.

ఈశయ్య అనుపదములో శబ్దమునకు అర్థమునకు భావమునకు గల పరస్పరసంబంధము లెస్సగ ద్యోతమాన మగుచున్నది భావమునకు అర్థమునకు అనురూపమైన పానుపువలె భాష యలరారుచుండవలెనను రహస్యము శయ్య అనుపదమువలన విస్పష్ట మగుచున్నది శబ్దోపాసనమున సిద్ధివడసినవారుతప్ప శయ్యాసౌష్ఠవమునందలి తారతమ్యమును నిర్ధారణచేయుట దుష్కరము

మూలములోని శయ్యాసౌష్ఠవము నాటకమునందలి శయ్యాసౌష్ఠవముకంటె మహోజ్జ్వలముగ గనవచ్చుచున్న దనగనే కాళిదాసు ప్రతిభ నికృష్టతరగతికి చెందినదని నిర్ణయింప వలనుపడదు.

'వాగర్థా వివసంపృక్తౌ'

అనుటలో కాళిదాసుని శబ్దోపాసన మెట్టి యుత్తమతరగతికి జెందుచున్నదియు సుగ్రాహ్యమగుచున్నది. ఒక్క నాటకములందుమాత్రమే గాక ఇతరశ్రవ్యకావ్యము లన్నిటియందు నిరూపితమగుచున్న శయ్యాసౌష్ఠవమంతటికంటెను శాకుంతలమునందలి శయ్యాసౌష్ఠవము అత్యుచ్చదశను ప్రాపించుచున్నదనుట నిస్సందేహము

భావమునకు భాషకు నవినాభావ సంబంధమనిగదా యనుకొంటిమి. శాకుంతల నాటకమునందలి భావములకున్న మాధుర్యము లాలిత్యము భాషకుగూడ నున్నవి

కాని మూలమునందలి భావములకును నాటకమునందలి భావములకును ఎట్టి తారతమ్యము నిశ్చయించుకొంటిమో రెండింటియందలి శయ్యాసౌష్ఠవములకును అట్టి తారతమ్యమే నిశ్చయింప దగియున్నది మూలమునందలి శయ్య వర్చస్విని మానవహృదయము నాకర్షించుటలో దానికున్నశక్తి అనిర్వాచ్యము కావ్యములో భావము ఉత్తమ భూముల కేగుచున్నకొలది శయ్య మిక్కిలి సులభమగుటయు సర్వజనాస్వాదనయోగ్య మగుటయు తటస్థించుచుండును మాటకు సూటిదనము (Directness) కూడ హెచ్చును అన్నిటికంటెను ముఖ్యగుణములు రెండు (1) ఆత్మకు సంతర్పణమొనర్పగల సంగీతము, సంగీతమునే మాధుర్యము అనికూడ పేర్కొనవచ్చును (2) తేజము. ఈ రెండు గొప్పగుణములు పరిణతుడగు సహృదయునకు ఉత్తమకావ్యములయందలి శయ్యలలో బ్రత్యక్ష మగుచుండును. ఈ రెండింటిని బట్టియే ఆయా శయ్యలలో వైశిష్ట్యమును తారతమ్యమును ముఖ్యముగ నిర్ణీత మగుచుండును. సునిశితమగు అంతశ్శ్రోత్రముగల యోగివలెనే రససిద్ధినిగాంచిన సహృదయుడుకూడ ఈ రెండుగుణములయందును గల భేదమును నిర్ణయించుకొనగలుచుండును భగవద్గీతయందలి శయ్య ఆర్షతేజోవిరాజితము రామాయణమునందలి శయ్యకూడ ఆర్షతేజోవిరాజితమే కాని యీరెండు కావ్యములయందలి శయ్యలయందును బ్రత్యక్షమగు సంగీతమునకు తేజమునకు అపారమగు భేదము గనవచ్చుచున్నది. దానినిబట్టియే రసదృష్టిమై నాని వైశిష్ట్యము నిర్ణీత మగుచున్నది

శాకుంతలమునందలి శయ్య ఆర్షతేజోసమన్వితము కాదు అంతవరకు నే సందేహమును లేదు కాని

దుష్యంతే నాహితం తేజో దధానాం భూతయేభువ
అవేహి తనయాం బ్రహ్మ న్నగ్నిగర్భాం శమీమివ॥
జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదంతవ
పుత్ర మేవం గుణోపేతం చక్రవర్తిన మాప్నుహి॥

దిష్ట్యా శకుంతలా సాధ్వీ సదపత్య మిదం భవాన్
శ్రద్ధా విత్తం విధి శ్చేతి త్రితయం వ స్సమాగతం॥

ఇత్యాది స్థలములలో ఆర్షప్రోక్తములకు సన్నిహితముగ రావలెనను ప్రయత్నము జరిగినది కొంతవరకు కృతార్థమైనదికూడను కాని "శకుంతలోపాఖ్యానము"లో నున్న శైలియంతయు పైనుదాహృతములగు శ్లోకములకు అతీతమగు తరగతిలోనిదే పూర్ణముగ నార్షతేజోసమన్వితమై యలరారుచున్నది సంగీతమునందు రామాయణము శకుంతలోపాఖ్యానముకంటె పై చేయియనుకొనుడు. కాని తేజమునందుమాత్రము ఉపాఖ్యానశైలి ఏ యుత్తమోత్తమ కావ్యములకును దీపిపోక వేదములతో వియ్య మందుచున్నది దాని ననుసంధించి యానందింప వలసినదేగాని వర్ణించుటకు వీలుపడదు దీర్ఘములగుటవలన విసుగుజనింపజేయునేమో యని భయపడుట కాస్పదములయిన వర్ణనలయందునను తము ఎట్టిశైలి ప్రత్యక్షమగునదియు ఈ క్రిందిశ్లోకమున జూడనగును.

నదీ మాశ్రమసంశ్లిష్టాం పుణ్యతోయాం దదర్శ సః
సర్వప్రాణభృతాం తత్ర జననీమివ విష్ఠితామ్॥

నాటకశైలి స్వర్గలోకమును దలపించును ఉపాఖ్యానశైలి బ్రహ్మలోకమున విహరింపజేయును.

మహాకవులలో తారతమ్యము నిర్ణయించుటకు సహృదయు డెన్నడును వెనుదీయరాదు మాహాత్మ్యమును మాహాత్మ్యముతో బోల్చి యానందింపగలిగినపుడే మానవజీవితము కృతార్థ మగుచున్నది. శాకుంతలమువంటి ఉత్తమనాటకమును శకుంతలోపాఖ్యానమువంటి ఉత్తమోత్తమ కావ్యముతో బోల్చి చూచినపుడే కావ్యరసోపాసనము చరితార్థము కావలసి యున్నది. అట్టి చరితార్థత మనకుసిద్ధించినదని భావుకులు నిర్ణయింపగలిగినచో ధన్యులము!

స ం పూ ర్ణ ము

## ఈగ్రంథకర్త ఇతరకృతులు

అచ్చయినది

# రాజ్యలక్ష్మి

స్వతంత్ర సాంఘికనాటకము కల్పనాశిల్పమునకు కవిత్వమునకు నాటకీయశక్తికి అన్నిటికంటె ముఖ్యముగ వ్యంగ్యచమత్కృతికి బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, చిలకమర్తి లక్ష్మినరసింహము గారు, కూచి నరసింహముగారు మున్నగుమహామహులు ఎంతోగొప్పగ మెచ్చుకొన్నది. చక్కని గ్లేజు కాగితములమీద సుందరముగ ముద్రితమైనది. పలుతావుల ప్రదర్శితమైనది.

వలయువారు గ్రంథకర్తకు వ్రాయుడు. వెల రు **1—8—0** మాత్రమే

1. ఆంధ్రతేజము - చరిత్రాత్మక నాటకము (ప్రదర్శితము)
2. ఖడ్గతిక్కన - డిటో డిటో
3. భారతవిమర్శనము
4. వ్యాసమంజరి

## అనుబంధము

# ఆంధ్రానువాదములు

ఈ గ్రంథమున నుదాహృతములయిన వానిలో నగత్యమయిన సంస్కృతశ్లోకము లకు వచనములకు సంస్కృతమురాని పాఠకుల యుపయోగార్థము స్వేచ్ఛానువాదము లిందు పొందుపరచుచున్నాము మూలము లుదాహృతములయిన పుటసంఖ్య పఙ్క్తిసంఖ్య మాత్రమే యిచ్చి అనువాదము పూర్ణముగ నిచ్చుచున్నాము.

5_వపుటలో నుదాహృతమైన “ఆపరితోషాద్విదుషామ్” అనుశ్లోకమున కాపుట లోనే యిచ్చిన పద్యానువాదము కవిరాజు శ్రీ వత్సవాయి నీలాద్రిరాజుగారి శాకుంత లాంధ్రీకరణములోనిది సౌలభ్యము నాశించి ఈక్రిందనిచ్చిన వచనానువాదములు సొంత ములు.—స॥ బం॥

పుట పంక్తి

3 19 మిక్కిలి పొడవరియైనవానికి అందుబాటులోనున్న ఫల మునకయి పొట్టివాడు చేయిజాపినచో నవ్వులపాలుగాడా? కవియశము నాశించు నావంటి మందుడు అపహాస్యము నకు పాల్పడుట నిశ్చయము

4 7 బంగారము స్వచ్ఛమైనదా? కలితీ కలిసినదా? అనుపరీక్ష అగ్నిలోగదా జరుగవలసినది! నేనురచించు నీ (రఘు వంశ) కావ్యమునందలి గుణాగుణములను సహృదయులు నిర్ణయింతురుగాక!

4 19 పారిపార్శ్వకుడు.— సుప్రసిద్ధ పూర్వకవులయిన భాసకవి పుత్ర సౌమిల్లకాదుల నాటకములను గాదని వర్తమాన కవియైన కాళిదాసుని నాటకప్రయోగమును సందర్శిం చుటలో పరిషత్తున కింత మొగ్గరమెందులకు?

సూత్రధారుడు:— వివేకశూన్యమయిన ప్రశ్న వైచితివి. చూడు— పురాతన మయినదయి నంతమాత్రమున ప్రతి

కావ్యమును సాధువుగా నేరదు. నవీనమయినంత మాత్ర
మున నింద్యమునుగాదు. వివేకశీలురు స్వయముగ పరీ
క్షించుకొనిన మీదట కావ్యము నాదరింతురు
మూఢులు ప్రసిద్ధినిబట్టి యారాధింతురు.

5 5 విద్వాంసులు మెచ్చుకొనునంతవరకు మన ప్రయోగవిజ్ఞా
నము సాదువని విశ్వసింపను సుశిక్షితులయిన వారికి
గూడ స్వవిషయమున చిత్తము విశ్వాసరాహిత్యమునే
భజించును.

5 12 (భరతాది) మునులు ఈనాట్యవిద్యను (ఇంద్రాది) దేవ
తలకు మనోహరమయిన చక్షుఃక్రతువుగ నిర్ణయింతురు

5 14 ఎవడు తనశాస్త్రజ్ఞానమును కుటుంబ పోషణకయి అర్థ
సాధనముగ నుపయోగించునో ఆతడు జ్ఞానవిక్రేతయగు
వణిజుడని (పెద్దలు) వచింతురు

9 25 చేటి.— ఈమధ్యనే ప్రారంభించిన "చలిత" మను నాట్య
ములో మాళవిక ఎంతవరకు కృతార్థయైనదో నాట్యా
చార్యుడయిన ఆర్యగణదాసుని కనుగొని రావలసినదిగ
ధారిణీదేవి ఆజ్ఞాపించినది.

11 8 రాజు.— ముద్రికనుగూర్చి నేను ముచ్చటించుటలేదు. ఇంత
వరకు బంధితులయినవారికి ఇంతటిలోనే విముక్తియేల
యనికాని దేవి తనపరిజనములో నొక్కరిని బంపక
నిన్నేల పంపినదనికాని ప్రశ్నలు రాలేదాయని యడుగు
చున్నాను

12 10 పతివ్రతలయిన సాధ్వులు సపత్నీవర్గముతో గూడిన పతి
నయినను సేవింతురు గిరులలో నుద్భూతములయిన
నదులు వందలుగవచ్చి సముద్రుని జేరుకొనుట లేదా?

13 10 దివాసంకేత మేర్పరచుకొనిన మిథునము మనోరథము
నిర్విఘ్నముగ కొనసాగినదా?

13 13 తండ్రిని కుమారుడు (పరాక్రమములో) ననుసరించుచున్నాడని సంతోషించుచున్నాను.

13 15 యూధపతిని కలభ (యేనుగుగున్న) మనుసరింపదా?

15 2 ఇప్పుడు (మాళవికను చూచినమీదట) చిత్తరువు వ్రాసిన సమయమున చిత్రకారునికి మనస్సమాధానము (సమాధి) శిథిలమయి యుండవలెనని నాతాత్పర్యము

15 9 అగ్నిలో బంగారమున కలితీయున్నదియు లేనిదియు తేలినట్లే మిముబోట్ల పరీక్ష కాగినపుడే తమయుపదేశము శుద్ధమని యుపదేష్టలు తలంతురు

15 12 (చూడుడు 4—7)

24 8 పౌలోమీ పుత్రుడయిన జయంతునివలన పురందరునివలె నీవుగనిన ఈ సుపుత్రునివలన నేను పుత్రవంతులలో నగ్రేసరుడనైతిని

29 1 పురువంశమున జనించిన నీయాభిజాత్యమున కిప్పటి నీ ప్రవర్తనమెంతయు నుచితముగ నున్నది. ఇట్టి గుణసంపద గలిగినవానినే చక్రవర్తిని పుత్రునిగా బడసెదవుగాక!

30 28 ప్రతిదినము నేనుచేయు ప్రమాదములే నాకు తెలియవు. ఇకనింత ప్రజాబాహుళ్యములో నెవ్వడేమార్గమున సంచరించుచున్నాడో కనిపెట్టుటకు నాకు శక్తియెట్లుండును?

32 19 (చూడుడు 29—1)

32 24 రాజా! సమిధలను దెచ్చుకొనుటకయి మేము బయలుదేరితిమి. అదిగో! ఆ కనబడుచున్నదే అది మాలినీతీరమునందలి కణ్వుడను కులపతి యాశ్రమము. తొందరపనులు వేగిరింపకున్నచో నా యాశ్రమమును ప్రవేశించి యతిథిసత్కారమును గైకొనుము

33 7 నీధర్మమాయని విఘ్నములులేకుండ తపోధనులు నిర్వర్తించు పవిత్రకర్మములను తిలకించి జ్యాఘాతముచే నయిన కిణములతో ప్రకాశించు నీభుజములు సాధించు రక్షణ వ్యాపారమునకు నీవానందింపగలవు

34 8 ప్రియంవద:- చెలీ! శకుంతలా! అక్కడనే ఒక్కముహూర్తకాలము నిలువుము నీవు సమీపింపగనే ఆకేసరవృక్షకము లతాసనాథమయినట్లు ప్రకాశించుచున్నది
రాజు:- ప్రియముపలికినను నిజమే చెప్పినది. చూడగ- అధరము కిసలయరాగమును పుడికి పుచ్చుకొనుచున్నది. బాహుద్వయము లతాగ్రములతో కయ్యమునకు కాలు ద్రవ్వుచున్నవి. కోరికలూరించు పూవువలె యౌవనము సర్వావయవములను వికసనోన్ముఖమైనది.

43 6 (చూడుడు 29—1)

43 9 నిమ్నోన్నతములు లేని స్తిమితగతిగల అనగా ఆకాశయానముగల రథములో నీతడు సముద్రములనుదాటుచు సప్తద్వీపములు జయించును. ఇంతవరకు నీయాశ్రమము నందలి క్రూరసత్త్వములను నిర్జించుటచే సర్వదమనుడను నామము వడసెను. ఇకముందు లోకములను భరించుట వలన భరతుడను నామమునుకూడ వహింపగలవాడు.

44 22 కల్పవృక్షములున్న వనమున గాలియే ప్రాణాధారముగా గలవారును, కాంచన పద్మరేణుకపిశమగు జలమును క్రీడార్థముపయోగింపక పరమేశ్వరుని అభిషేకార్థముపయోగించువారును, రత్నశిలా తలములందు నియతము నిష్ప్రమాచిత్తులయి ధ్యాననిమగ్నులగువారును, విబుధస్త్రీల సన్నిధిని ఇంద్రియనిగ్రహము నభ్యసించువారును ఇతరతాపసులు ఏయే ప్రయోజనముల నాశించి తపిం

చ చుందురో అట్టి ప్రయోజనములన్నియు నిచట సహజముగ తమకు సిద్ధించినను వానిని స్పృశింపక ఇంకను ఉత్తమ ప్రయోజనముల నాశించి తపోనియమగ్నులగు వారును. అయిన మహాతపస్వులతో నీపరిదేశము నిండియున్నది

45 24 సిరిరా పూర్వము మోకాలొడ్డితివి దుఃఖముతప్ప ఇప్పుడు శ్రేయస్సెక్కడినుండి వచ్చును? ఓ బాహుదండమా ఎందులకు వృధా స్పందింతువు?

47 17 (33—7)

47 20 ఈ యాశ్రమపదము ప్రశాంతి నిలయము. నాబాహు వదరుచున్నది. ఇక్కడ (నైహిక) ఫలముల కవకాశమేమున్నది?

48 1 నాకు భార్యలు పెక్కండ్రు అయినను నాకులప్రతిష్ఠ ఇరువురిమీదనే ఆధారపడుచున్నది సముద్రమే యొడ్డాణముగాగల భూమిమీదను మీయీ సఖిమీదను.

48 15 ఓ బ్రహ్మర్షీ! అగ్నిగర్భయగు నరణివలె నీతనయ లోక కల్యాణార్థము దుష్యంత నిక్షిప్తమగు తేజమును ధరించుచున్నదని తెలిసికొనుము

49 4 చిరకాలము చతురంత మహీసపత్నివయి సకలభోగముల ననుభవించి అప్రతిరథుడయిన తనయునిగాంచి భర్తయాతనిపయి తన భారమునంతను మోపి (సిన్ననుసరింపగ) శాంతమయిన ఈయాశ్రమమున మరలపాదము మోపెదవు లెమ్ము

49 18 “ఈదుష్యంతుని తరువాత వేదోక్తప్రకారము మనకు నివపనము నెవ్వడిచ్చు”నని కన్నీరు దుడుచుకొనగా శేషించిన జలమును నాపితృదేవత లానుదురు. ఇందుకు సందేహము లేదు.

53 10 అనసూయ - ప్రియంవదా! ఈవృత్తాంతము మనయిద్దరి ముఖముననే నిలువనిమ్ము. సహజ సుకుమారియగు చెలిని మనము రక్షించుకొనవలెను గదా!

ప్రియంవద - నవమల్లికను ఉష్ణోదకమున దడుపు వారుందురా!

60 9 ఇతని యాకారమునకు దగిన చేష్టయే (ఈతడు మహర్షి పుత్రుడుగాడని) చెప్పక చెప్పుచున్నది. అయినను ఆశ్రమమున సీత డుండుటనుబట్టి యీవిధముగ మేమాలోచింపవలసి వచ్చినది

67 1 గాలవుడా! ఆరాధితమైనదో లేదో నేనెరుగను కాని విశేషమేమనగా సరస్వతీదేవి రచించిన లక్ష్మీస్వయంవరమను కావ్యబంధమును ప్రదర్శించుచుండగా ఆయా రసములందు పరిషత్తు తన్మయమైపోయి కూర్చున్నది.

67 15 సంధులయందు వృత్తిభేదము వ్యక్తమగునట్లును ఆయా రసానుగుణ్యములయిన రాగాలాపనము లేర్పడునట్లును లలితములయిన యంగవిక్షేపములతో నప్సరసలు ప్రయోగించిన నాటకమును (ఆవధూవరులు) చూచిరి.

77 5 రాజు - (శకుంతల కభిముఖుడయి) మీతపము వర్ధిల్లుచున్నదా?

శకుం - (సాధ్వసముచే నూరకుండును)

అనసూయ - ఇక్కడి ధర్మచారులగు తాపసులు మీరాకవలన సనాథులయిరి

శకుం - (శృంగారలజ్జను నిరూపించును)

రాజు - ఇప్పుడు సరిపోవుచున్నది. ప్రభాతరలమయిన జ్యోతి భూగర్భమునుండి యుదయింపదుగదా! ఇట్టి రూపసంపద మనుష్యగర్భమున నుదయించిన కోమలికి సంభవమా?

శకుం - (అధోముఖియయి కూర్చుండును)
ప్రియం -(నవ్వుచు శకుంతలను చూచి నాయకాభిముఖియయి)ఇంకనుఏదోఅడుగవలెననుకొనుచున్నట్లున్నారే!
శకుం - (చెలికత్తెను బొట్టనవ్రేలితో భయపెట్టును)

78 13 ఉభయులు - (చూచి సహర్షముగ) ఆలస్యములేకుండ ప్రత్యక్షమయిన మనోరథమునకు స్వాగతము!

78 24 సఖులు.- (ఇరువురి యాకారమును పోల్చుకొని) చెలీ! శకుంతలా! మనతండ్రిగారు ఇప్పుడిక్కడనున్నట్లయిన—
శకుం - (రోషముతో) ఉన్నచో నేమగును?
సఖులు :- తమజీవిత సర్వస్వమునైన ధారపోసి ఈ యతిథిని కృతార్థుని జేసియుందురు

79 13 అనసూయ - అటుతరువాత నా నడివసంతమున ఉన్మాదమునుకలిగించు నా మెరూపమును చూచి (అని అర్ధోక్తిలో లజ్జచే నూరకుండును)
రాజు - తరువాత తెలియుచునే యున్నది

79 22 అనసూయ - వయస్య! రాజులు బహుభార్యావంతులని విందుము ఈ మా ప్రియసఖి బంధుజనశోచనీయ గాకుండునట్లు నడచుకొనుడు
దుష్యన్తుడు - కల్యాణీ! పెక్కుమాటలేల? (చూడుడు 48—1)

80 13 అంగుళిచే నధరోష్ఠమును గప్పుకొనుచున్నట్టియు ప్రతిషేధాక్షరముల తడబాటుచే హృదయమునకింపుగూర్చుచున్నట్టియు అంసవివర్తియగు ముఖముగలట్టియు నా పక్ష్మలాక్షినెట్లో లేవనెత్తియు తుదకుముద్దిడలేకపోతినే!

80 2 బిడ్డా! ఉటజద్వారమున మున్ను నీవు సంతరించిన నీవారబలిని చూచినపుడు నాశోకమెట్లు శాంతింపగలదు?

81 1 ఏ ధన్యదంపతుల కులాంకురమో ఈశిశువును స్పృశించి నంతనే నాకింతసుఖము కలుగుచున్నదే! నిజముగా నీతని తలిదండ్రుల యానందమునకు మేరయుండునా?

81 5 విడీవిడని దంతములను మొగ్గలతోడను నిర్నిమిత్తము లయిన హాసములతోడను అవ్యక్త రమణీయములగు వచఃప్రవృత్తులతోడను అలరారు కుమారులను తొడల పయి గూర్చుండబెట్టుకొని వారియొడలిధూళిచే ధన్యులు తమయంగములను ధూసరిత మొనర్చుకొందురు

82 5 ఇది ధర్మపథమే యయినచో ఈప్రదానకృత్యమున నాకు నామీద ప్రభుత్వమేయున్నచో పౌరవశ్రేష్ఠుడవగు ప్రభూ! నాసమయమును వినుము

82 12 రహఃప్రణయ మెంతమాత్రము జ్ఞప్తికిరాక మరపుచే దారుణచిత్తవృత్తి వహించిన నామీది కోపముచే భిన్న మయిన ఈ లోహితాక్షి భ్రూకుటి మన్మథుని భగ్నశరా సనమువలె నున్నది.

84 8 ఇంతటి జగన్మోహనమగు రూపసంపద ఇంతసుఖముగ లభ్యము కానున్నపుడు మాప్రభువుతప్ప మరియెవ్వ రాలోచింతురు?

84 12 కేశబంధము విడిపోగా అందుండి రాలుచున్న క్రొవ్విరు లతో ముఖముననిండిన స్వేదబిందువులతో- నొకచేత నభిషేకఘటము పట్టుకొని తానుపోసిన నీళ్లకు తడిసిన చిగుళ్లుగల మోకమామిడిప్రక్కను కొంచెము అలసి పోయి నిలుచున్నట్లుగ చిత్రితమైన విగ్రహము (శకుం తలాదేవిది)

85 12 శైవల (నాచు) మలముకొన్నను సరసిజము రమ్యముగనే యుండును. మలినమయిన చంద్రబింబమునందలి కళం కముగూడ బింబపుకాంతి ననుమడింపజేయును. వల్క లములు ధరించినను ఈతన్వి ఎంతో మనోహరముగ

నన్నది. మధురాకృతులకు అలంకారశోభ నొడ
గూర్పని వస్తువుండునా?

85 21 (ఇది ప్రక్షిప్తము)

86 2 ఇటు నేను ప్రత్యాదేశింపగ స్వజనమును అనుసరింపబోయి
నది. అటు గురుతుల్యులయిన గురుశిష్యులు గద్దించి
"నిలువుము" అని బిగ్గరగ బలుకుసరికి బాష్పకలుష
మయిన దృష్టిని తిరుగ నావంకకు బ్రసరింపజేసినది

86 23 ముందటి పాదములు ఎత్తుగనున్నవి జఘనభారముచే
వెనుకటి పాదములు లోతుగా బోయినవి తెల్లని యీ
యిసుకదారిలో నామె యభినవ పదపఙ్క్తి తీరున గాన
వచ్చుచున్నవి

87 4 విధి ముందుగ చిత్రమున లిఖించిన రూపమునకు తరు
వాత ప్రాణమేపోసినాడో ప్రపంచమునందలి ఉత్తమ
రూపసమూహ మంతటిని ఒక్కచోటికిదెచ్చి మనసా
వానిని సమీకరించి శకుంతలా స్వరూపమున పోతపోసి
నాడో చెప్పజాలను ధాతసామర్థ్యముబట్టి చూచినను
ఆమె శరీరలావణ్యమును బట్టి చూచినను ఇదివరకు తన
సృష్టికౌశలమున కంతకు నతీతమయిన ప్రజ్ఞసంపాదించి
అపూర్వమయిన నిర్మాణసంపదకు ఈ స్త్రీరత్న సృష్టిచే
శ్రీకారము చుట్టినాడా యనిపించుచున్నది.

87 9 ఎక్కడను మాలిన్యలేశము లేని ఆమెరూపము అనాఘ్రాత
పుష్పము. హస్తస్పర్శము నెరుగని కిసలయము. అనా
విద్ధమయిన రత్నము. అనాస్వాదితమయిన నవమధు
రసము అఖండపుణ్యఫలము.

88 6 గండభాగమున కేసరము వ్రేలాడుచుండ శిరీషకుసుమ
మును కర్ణావతంసముగ చిత్రింపవలసియున్నది. శిర

చ్చంద్రమరీచికోమల మయిన మృణాలసూత్రమును స్తనాంతరమున లిఖింపవలసియున్నది

88 17 సైకతలీనమగు హంసమిథునమును, మాలినీనదిని, పావన మయిన గౌరీగురు (హిమవత్పర్వత) పాదాంతికమున నిషణ్ణమయిన హరిణమును, వల్కములార వైచిన కొమ్మలతో నొప్పు తరువులను, కృష్ణమృగశృంగమును వామ నయనమున గోకు నాడు లేడిని లిఖింపవలసియున్నది.

89 16 ముందుగ మీకు జలము సమర్పింపక తాను మంచినీళ్లు ముట్టి యెరుగదు అలంకరించుకొనుటయందాసక్తి యున్నను మీయందలి స్నేహముచే చివుళ్ళను త్రుంపి యెరుగదు మీరు ప్రప్రథమున కుసుమప్రసూతినులగు సమయమామెకు మహోత్సవాసరము. మీయందిట్టి సోదరస్నేహము చూపిన శకుంతల యత్తింటికేగు చున్నది మీరందరును సెలవు నను గ్రహింపరా?

89 24 దర్భముండ్లు గ్రుచ్చుకొని గాయపడిన ముఖమున గార నూనె రాచి వ్రణమును మాన్పితివి దోసిళ్లతో చామలు పెట్టి పోషించుకొని వచ్చితివి. అట్టి నీ పెంపుడు లేడిపిల్ల నిన్ననుసరించుచున్నది

90 3 మృగములు దర్భకబళములను నుమియు వైచినవి. మయూరములు నర్తనములు చాలించినవి లతలు పాండుపత్రముల పేరిట యశ్రువులను రాల్చుచున్నవి

94 6 ఈ మృగమును, దాని వెనుక శరాసనము నెక్కుపెట్టి వెంబడించు నిన్నును చూడగ మృగానుసారియగు పినాకపాణి జ్ఞప్తికి వచ్చుచున్నాడు

94 13 ఈ శ్లోకమునకు సందర్భము సీతాస్వయంవరమున శ్రీరాముడు శివధనస్సు నెత్తికొనుట ఈ పుటలో పదవ

పఙ్క్తిలో “ఈ యుపమానముపయి” అనుటకుమారుగ “ఈఉపమానమునందలి యుదంతముపయి” నని చదువుకోవలెను

95 1 ప్రియంవద - అనసూయా! ఎవ్వరీ చతురగంభీరాకృతి యగు పురుషుఁడు? మధురముగను ప్రియముగను మాటాడుచు ప్రభువువలె గన్పట్టుచున్నాఁడె!

95 9 ప్రథముఁడు - ఆహా! ఉజ్జ్వలమయినను విశ్వసనీయముగ నున్నదే ఈతని తనువు!

95 11 ద్విపేంద్రము యూథమధ్యమున సంచరించుటచే నలసి పోయి మధ్యాహ్నకాలమున శీతచ్ఛాయ నాశ్రయించి నట్లుగ ఇంతవరకు ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించు కృత్యమున నిమగ్నుఁడయి ఇప్పుడు శాంతమనస్కుఁడయి (మహారాజు) విశ్రాంతి నాశించి ఏకాంతమును సేవించు చున్నాఁడు

96 4 ఆహా! ఈ దుష్యంతమహారాజు ఎంతటి మహానుభావుఁడు! ఆతఁడు ఆశ్రమపదమున నడుగుపెట్టగనే మాపవనకర్మ ములన్నియు నిర్విఘ్నముగ సాగుచున్నవిగదా! బాణసంధానమువరకు నెందులకు? ధనుష్టంకార మాత్రముననే హుంకరించునట్లుగ విఘ్నములను పారద్రోలు చున్నాఁడు.

96 10 యజ్ఞభాగపర్యుత్సుకులయిన దేవతలే ఈ కార్యమును (శకుంతలా దుష్యంతసంధానమును) చక్కబెట్టెదరట [దుష్యంతుని త్రిదివమున కాహ్వానించుటలో దేవతల కాతనిని సతీసుతులతో సంధించి మేలుచేయువలెనను సంకల్పముకూడ నున్నదనుట ప్రయోజనాంతరము]

96 16 ఇప్పుడు నిశాసారమునను పూర్వము నారసింహదేవుని

సఖబలమునను సుఖపరతంత్రుండయిన ఇంద్రునికి స్వర్గ
మున నిష్కంటక పరిపాలన మేర్పడినది
సురసుందరు లలంకరించుకొనగా మిగిలిన కుంకుమాది
వర్ణములతో కల్పలతాంశుకములపై నీచరిత్రము గీతి
క్షమమైన (గానయోగ్యమైన) యర్థబన్ధములతో
లిఖించి నాక నివాసులు గానము చేయుచున్నారు

97 4 నీశస్త్రము ఆర్తులను రక్షించుటకే, నిరపరాధులను బాధిం
చుటకు గాదు

97 16 ఈతడు (రాజు) కూడ భోగాస్పదమైనను ఆశ్రమమందే
వసించుచున్నాడని చెప్పవలసియున్నది రక్షాయో
గమువలన ప్రత్యహమును తపస్సు కూడబెట్టుచున్నాడు.
నిగ్రహశీలుడగు నీతని యశోగీతములు చారణద్వంద్వ
ములనోట నాకలోకము, నంటుచున్నవి. రాజపూర్వ
మైన ముని పుణ్యశబ్దవాచ్యుడితడు

97 28 మునియగు (వసిష్ఠుడు) రాజ్యాశ్రమ మునియగు (దిలీ
పుని) రాజ్యమనామయముగ నున్నదా యని ప్రశ్నిం
చెను.

99 2 ఆహా! ఏమి ఈరాజర్షి తూలికానైపుణ్యము! సఖి నా
యెదుట నిలచినట్లున్నదే!

99 22 ఈమె స్వాశ్రమధర్మమునందు నియోగించిన కాశ్యప
ఋషి చక్కగ నాలోచించినట్లు కనబడదు.
ఇంతటి యవ్యాజ మనోహరమయిన శరీరముచే తప
స్సాధ్యములగు దుష్కరములను సాధింపజూచుట నల్ల
కలువరేకుతో సమిల్లతను గోయుట కుపక్రమించుటే
గదా!

100 19 స్నేహితులను గాని బంధువులను గాని పోగొట్టుకొన్న

ప్రజలకు—పాపసంబంధములందు దక్క—సమస్త విధ
ములను దుష్యంతుడే స్నేహితుడు బాంధవుడు నని
చాటింపుము

101 8 సుధాసితములయిన భవనములందు పూర్వము క్షితిరక్షా
ర్థము వసించువారే ఇపుడు ఒక్క పతివ్రతామతల్లి
తమ వెంటరా (వానప్రస్థాశ్రమమున) తరుమూలము
లను గృహములుగ జేసికొను చున్నారు

101 15 ఏలిక మీరా రనుమతించినట్లయిన ఆరాజర్షికి దయపుట్టు
నట్లుగ అనంతర కర్తవ్య మాలోచింపుము. లేదా ఇక
నా యాసను వీడి తిలోదకమును విడువుము.

102 24 శైశవమునవిద్యాభ్యాసము యౌవనమున విషయభోగాను
భవము వార్ధకమున మునివృత్తి, తుదకుయోగమున తను
త్యాగము నడపువారు (రఘువంశరాజులు)

108 2 స్వసుఖమునం దభిలాష లేదు లోకము కొరకయి పరిత
పింతువు ప్రతిదినము ఇది నివృత్తి పాదపము శిరసా
తీవ్రమైన యుష్ణము భరించుచు ఛాయచే సంశ్రితుల
పరితాపమును శమింపజేయునుగదా!

103 6 దండము నవలంబించి దుర్మార్గులను శిక్షింతువు. వివాద
ముల నడగింతువు రక్షణమునకగుదువు. ప్రజలకు వైభ
వోపేతులగు నితరబాంధవు లెందరున్నను నుందురు
గాక నిజమైన బాంధవుడవు నీవే.

106 1 పుట్టుకనుండియు పరిశుద్ధులును ఫలోదయముగు వరకు
పట్టును విడువని వారును సర్వంసహా చక్రవర్తులును
భూమినుండి స్వర్గమునకు అవ్యాహతమైన రథమార్గము
గలవారును యథావిధిగ అగ్నిని అర్చించు వారును
ఆశ్రితుల కోర్కెలను తుదిముట్ట దీర్చువారును

అపరాధులను నేరమునకు దగినట్లుగ శిక్షించువారును సమయము నతిక్రమింపకుండ మేల్కొను వారును త్యాగము నిమిత్తమే ఆర్జించువారును సత్యమునకెక్కుడ భంగము వచ్చునో యని మితముగ భాషించువారును క్రౌర్యముచే గాక యశోర్థులయి జైత్రయాత్ర సలుపు వారును కామముచేగాక సంతానకాంక్షచే గృహమేధు లగువారును శైశవమున విద్యాభ్యాసము యౌవనమున విషయానుభూతి వార్ధకమున మునివృత్తి తుదకు యోగ మున తనుత్యాగము యథాక్రమమున నడపువారును (అయిన రఘువంశ రాజుల చరిత్రమును వ్రాకుత్తును)

108 18 నీవు పూజ్యులకెల్ల నగ్రేసరుడవు శకుంతల మూర్తీభ వించిన సత్క్రియాపుంజము తుల్యగుణోపేతులయిన వధూవరులను మీ యిరువురను జతగూర్చి చిరకాల ముగ వచ్చుచున్న జనాపవాదమును బ్రహ్మ తొల గించుకొన్నాడు

110 25 మహారాజు శాసనము వసంతర్తువునందలి తరువులు వాని నాశ్రయించుకొనయున్న పక్షులుకూడ శిరసావహించు చుండగా మీకీ సంగతి తెలియనే లేదా ? చూతమంజరి యెన్నడో తలచూపినను పుప్పొడిగట్టుట లేదు. కురవ కము వికసనోన్ముఖమయ్యును కోరకావస్థలోనే నిలిచి పోవుచున్నది. శిశిరము గతించినను కోయిలపాట గొం తుకలోనే జారిపోవుచున్నది పగము ఎక్కుపెట్టిన బాణమును మరుడు వెనుకకు లాగుకొనుచున్నాడా యని పించుచున్నది

111 11 ఒక్కమ్రాను తరుణేందుపాండుర మయిన మంగళ వస్త్రము నొసగినది వేరొకమ్రాను చరణోపభోగ

సులభమయిన లాక్షారసము నొసగినది ఇతరవనదేవ
తలు మహీరుహ శాఖలనుండి ఆశాఖల కెంజిగురులతో
నెకసక్కెమాడు కరతలముల ననేకాభరణముల ననుగ్ర
హించిరి

111 28 వినిందితమయ్యును స్వధర్మసిద్ధమగు కర్మ విసర్జనీయము
గాదు. దారుణమైన పశుమారణ కర్మమున బ్రవర్తించు
చున్నను శ్రోత్రియుడు అనుకంపామృదుస్వభావుడే గదా!

113 5 రాజు .- భగవానులగు కాశ్యపులు లోకానుగ్రహార్థము
కుశలముగ నున్నారా ?
శార్ఙ్గరవుడు- సిద్ధపురుషులకు కుశలము స్వాధీనమేగదా!

113 10 శకుంతల యిప్పు (డత్తవారింటి) కేగుచున్నదని హృదయ
ముత్కంఠతో నిండినది కంఠము స్తంభించినది. బాష్ప
వృత్తి కలుషమయి చింతచే దృష్టి జడమైనది. అరణ్య
వాసినయి తపోధనుడనయి యున్న నేనేఒక్కింత పెంచిన
స్నేహమున కింత పొగులుచుండగ గృహస్థులు పిల్ల
నత్తవారింటికి బంపునప్పు డెంతగా పరితపింతురో!

113 24 కన్య ఎప్పటికైన పరధనమేగదా! ఆమెనిప్పుడు భర్త
యొద్దకనిపి — ఒకడుదాచుకొన్న సొత్తును వానికి మరల
నర్పించినపుడు వలె — నాయంతరాత్మ ఇపుడుస్వాస్థ్యము
నందు చున్నది

114 9 ఇట్టు లంతయు నొప్పియున్నను చిరకాలముగ మనస్సు
వివిక్తమున కలవాటుపడి యుండుటచే జనాకీర్ణమయిన
ప్రదేశము హుతవహపరీతమయిన గృహమువలె గన
వచ్చుచున్నది.
స్నాతు డభ్యక్తుని, శుచి యశుచిని, ప్రబుద్ధుడు సుప్తునీ,
స్వైరగతి బద్ధుని, వలె నేను సుఖసంగమయిన ఈజనము
ననసహ్యించుకొనుచున్నాను

140 24 సుభగములయిన సలిలావగాహములును, పాటలీపుష్ప సంసర్గముచే సురభిళములయిన వనవాయువులును, సులభముగ నిద్రవుచ్చుచుండు శీతలచ్ఛాయలును గల ఈ గ్రీష్మర్తువుని దివసములు పరిణామరమణీయములు

141 1 భ్రమరములచే నించుక చుంబితములయిన సుకుమార కేసరశిఖలుగల శిరీషకుసుమములను దయార్ద్రచిత్తలగు స్త్రీలు అలంకరించుకొనుచున్నారు (దయార్ద్రచిత్తలనుటలో శిరీషకుసుమముల మార్దవమునకు భంగము రానీయకుందురని భావము )

142 6 వనలతల సౌందర్య మెంతగ తపించినను ఉద్యానలతలకు రాదుగదా ! ఆశ్రమవాసినుల లావణ్యము శుద్ధాంత దుర్లభమగుటలో నాశ్చర్యమేమున్నది !

142 10 కేవలము తండ్రిగారి నియోగమే కాదు నాకు గూడ దీనియందు సోదరస్నేహముగదా !

142 14 సంతాపహారిణి వగు నో లతావలయమా ! మరల పరిభోగించుటకయి నిన్నాకట్టుకొని మరీ పోవుచున్నాను.

142 21 బాణమును వింటదొడిగియు నేనీమృగములపయి విడువలేకున్నాను నా ప్రియకు ముగ్ధవిలోకనోపదేశమొసంగి గురుపద మధిష్ఠించుపీనినెట్లు హింసింపగలను?

143 1 ఆపానసలిలమును కొమ్ములతో గొట్టికొనుచు నడవిదున్నలు యథేచ్ఛగా క్రీడించుగాక ! నీడలలో గుంపులుకట్టి నిలుచుమృగకులము రోమంథము నభ్యసించుగాక ! భయమునుపీడి యడవిపందులు పల్వలములలోని ముస్తలను పెకలించుగాక ! శిథిలజ్యాబన్ధమయిన నా ధనుస్సు విశ్రాంతి ననుభవించుగాక.

11 ఆహా! నేత్రనిర్వాణము లబ్ధమయినది ఇదిగో! నామనో

రథ ప్రియతముగాలు కుసుమములుపరిచిన శిలాపట్ట
మున బరుండి చెలికత్తెలతో మంతనమాడుచున్నది.

143 14 లేదా, ఇక్కడనే నాప్రియుగాలు భోగించి విడిచిపెట్టిన
ఈ లతామంటపమున నొక్కముహూర్తము నిలిచె
దను. "ఇదే యామెశరీరముచే నలగిన శిలమీదిపుష్ప
శయ్య నఖములతో మదనలేఖ లిఖించిన నళినిపత్రి
మిదిగో ఆమెచేతినుండి జారిన మృణాల కంకణ
మియ్యదే" అని యాతీరుగ తలచికొనుచు (శకుంతలా)
శూన్యముఖవను ఈ వేతస్వగృహమును విడువ
లేకున్నాను

22 ఒకవంక నోషధీశు డస్తశిఖరమును జేరుకొనుచున్నాడు
ఇంకొకవంక నరుణపురస్సరముగ సర్కుడుదయించు
చున్నాడు. ఏకకాలమునందే వ్యసనము అభ్యుదయము
ననుభవించుచున్న ఈ తేజోద్వయము, "సుఖదుఃఖ
ములు స్వాభావికములు. వానికి చలింపవలసినపనిలే"
దని ఈ ఆత్మదశాంతరములచే లోకుల కుపదేశించు
చున్నదా యనినట్లున్నది

28 శశి యస్తమింపగనే సంస్మరణీయశోభ గలిగిన ఈకుము
ద్వతి నాదృష్టి నలరింపకున్నది. ప్రియా వియో
గముచే మిక్కుటముగ బరితపించు నబలాజనముల
దుర్దశచూచి భరింపలేముగదా!

145* 4 ఓమధుకర! నీవు అభినవ మధులోలుపుడవు మొదట
చూతమంజరిని చుంబించితివికదా! ఇప్పుడు కమల
ముతో వసించుచు ఆయానందములో వెనుకటి చూత
మంజరిని ఎట్లు విస్మరింపగలిగితివి?

19 రాజు :- ఏమిది? ఇట్టియర్థముగల ఈగీతము నాలకించి

ఇష్టజన విరహాపీడితుడను గాకున్నను ఇంతగాఢముగ నుత్కంఠితుడ నైతినేమి ?

రమ్యములైన వస్తువులను దర్శించియు మధురమైన శబ్దములను వినియు సుఖించుచున్న జంతువుకూడ (ఒక్కొకప్పుడు) పర్యుత్సుకమగును అంతవరకు స్ఫురింపరాని భావ స్థిరములయిన జననాంతర సౌహృదములు బహుశః అప్పుడు జ్ఞప్తికొదవును, సందేహము లేదు

148 11 చెలీ! శకుంతలా! బాలసహకారమునకు స్వయంవర వధువయిన ఈనవమల్లికకు "వనజ్యోత్స్న" యని ముద్దుపేరు పెట్టుకొని పెంచుచున్నావుగదా! దీనిని మరచితివా ?

148 18 చెలీ! ఈలతాపాదప మిథునముల సమ్మేళన సౌభాగ్యము రమణీయమైన కాలమున నడచినది "వనజ్యోత్స్న" నవకుసుమయౌవన. పరిత్యక్తపల్లవ పరిచురానురాగశాలి ఈ బాలసహకారము

149 2 శకుంతల (లతను సమీపించి) వనజ్యోత్స్నా! నేనింక నీకు దూరమగుచున్నానుగదా! చూతసంగతవయ్యును ఇటుపరిసరించు శాఖాబాహువులతో నన్నాలింగనము చేసికొనుము.

5 ఆత్మసదృశుడయిన భర్త నీకు లభింపవలెనని మొదటి నాసంకల్పము. అది నెరవేరి నీవత్తింటి కేగుచున్నావు. చూతముతో నవమల్లిక సాంగత్యము నెరపుచున్నది. ఇక మీ ఇరువురును గూర్చి నాకు నిశ్చింత.

(శకుంతలోపాఖ్యానములోని శ్లోకములకు నన్నయ శకుంతలోపాఖ్యానపద్యములు చూడనగును)

---